శ్రియై నమః

శ్రీ

# కనకదుర్గా క్షేత్ర మాహాత్మ్యము

( స్థల పురాణము )




గ్రంథకర్త :

శ్రీమాన్

కవిరాజ శిరోమణి - అష్టావధాని

పండిత దీవి నరసింహాచార్యులు

అవనిగడ్డ.





ప్రకాశకులు :

శ్రీ కనకదుర్గా మల్లేశ్వర దేవస్థాన పాలకవర్గంవారు

విజయవాడ.

1957

# అంకితము

కృష్ణతీరంబు వాసంబు - వైష్ణవులము
ఉభయనారాయణంబు మే - మున్నయూరు
పంటలకు దీవి ''దీవి''యే యింటిపేరు
పండితుడ నరకంఠీర - వుండనేను

మోక్షసామ్రాజ్యమునకును - మూలమైన
కనకదుర్గాంబ చరితంబు - ఘనతవ్రాసి
భక్తితోడుత నాదేవి - పాదములకు
నర్పణముఁజేసి, ధన్యుండ - నైతి నేఁడు ॥

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ, అభినవ శ్రీనాథాది బిరుదాంకితులును, ప్రభుత్వాస్థాన కవీశ్వరులు నైన బ్రహ్మశ్రీ శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రిగా రిచ్చిన యభిప్రాయము.

# శ్రీ కనకదుర్గా క్షేత్ర మాహాత్మ్యము

## స్థల పురాణము

ఇది శ్రీమాన్ కవిరాజ శిరోమణి అష్టావధాని పండిత దీవి నరసింహాచార్యులు గారిచే రచింపఁబడి శ్రీ కనకదుర్గా మల్లేశ్వర దేవస్థాన పాలకవర్గము వారిచేఁ బ్రకటింపఁబడినది. ఇందు గ్రంథకర్త వ్రాసిన తొలిపలుకులలోనే గ్రంథ ప్రభావ మంతయు విపులీకరింపఁ బడినది. దానిచేతనే దీని ప్రాముఖ్య మంతయుఁ దేటతెల్లంబగును. ఈ క్షేత్ర మాహాత్మ్య మెచటను విపులముగా వ్రాయఁబడి యుండలేదు. స్కాంద బ్రహ్మాండ పద్మాది పురాణములలో నతి సంగ్రహముగా సూచింపబడి యున్నది. అందున క్షేత్రమాహాత్మ్య మంతయు సమగ్రముగాఁ దెలిసికొని గ్రంథరూపముచేయుట దుర్ఘటము. అట్లయినను గ్రంథకర్త మిక్కిలి శ్రమపడి కొన్ని కొన్ని గ్రంథములు పరిశీలించియు, ప్రత్యక్షముగా క్షేత్ర మంతయుఁ బరిశీలించియుఁ బెద్దలవలన గ్రహించియు సమగ్రముగానే యీ గ్రంథము రచించినారు. ఈ క్షేత్రము కృష్ణానదీ తీరమందున్నదిగావునఁ దత్తీర్థము లభివర్ణితములయ్యె. కనకదుర్గ స్వయంభువమని కృష్ణామాహాత్మ్యములో నుండినట్లు చెప్పినారు. ఇది ముఖ్యవిషయము. మఱియు

ననేక క్షేత్రములు సందర్భానుసారముగా నిందు నుదాహృతములు. మఱియు 11, 12 పేజీలలో మన మెప్పుడును కని విని యెఱుంగని తీర్థములు, మహాబలేశ్వర, దత్తాత్రేయాదు లభివర్ణితములు. ఇంద్రకీల పర్వత ప్రభావము హృదయంగమముగా నున్నది. కనకదుర్గ బ్రహ్మచారిణి యని యపూర్వ విషయము రుజువుచేసినారు. పదునెన్మిది దుర్గలను క్రమముగాఁ జేర్కొనినారు. ఇది దేవీభక్తులు ముఖ్యముగా గమనింపవలసిన విషయము, దుర్గా వర్ణనము చక్కగా నున్నది. మల్లేశ్వరస్వామి బ్రహ్మ ప్రతిష్ఠితుఁడని నిరూపించినారు. అది శక్తిప్రధానమయిన క్షేత్రమని ప్రమాణీకరించినారు. మఱియు ననేక విషయము లిందు సప్రమాణముగా సూచింపఁబడి యున్నవి. ఇందుఁ బురాణములే గాక కొన్ని కైఫీయతులు దీనికి సంబంధించినవి సంగ్రహించి పరిశీలించి యిందుదాహరించినారు. ఇవి పుక్కిటి పురాణములేమో యని సందేహము కలిగింపక యథార్థములే యని నాస్తికవాదుల కైనను గోచరింపక మానదు.

కనకదుర్గా క్షేత్రమగు బెజవాడకు బీజపురము కనకప్రభ, కనకపురము, కనకవాడ, జయపురి, విజయపురి ఫల్గునక్షేత్రము, విజయవాడ అను పేరులుఁ గలిగియున్నట్లు చెప్పినారు. క్షేత్రమహిమమే కాక, తీర్థమహిమయును వర్ణించిరి. దేవతలఁ బేర్కొనిరి, వీనిని సేవించి కృతార్థులయిన వారిం బేర్కొనిరి. 43 వ పుటలో అగస్త్యుఁడు శ్రీరామునకు చెప్పిన తీర్థము లెన్నో కల వవి యన్నియు భుక్తి,

ము_క్తిప్రదము లనియు నవి ఈ దుర్గాక్షేత్రమునఁ గలవనియు వ్రాసినారు. దేవలీల లనేకములు హృదయరంజకముగాఁ జెప్పినారు, మఱియు నరసింహ బిలము, గోవిందుగుహ లోనగు వాని ప్రభావము సముచితముగా నున్నది.

మఱియు వీరెన్నో శాసనములు చరిత్రములు చదివి యెన్నో విశేషము లిందు సమగ్రముగాఁ జెప్పినారు. ఇంత కంటె నధికముగా నీ స్థలపురాణము వ్రాయుట కాధారముల లభ్యము లగుటచే విశేషించివ్రాయుట కెట్టివారికిని సామర్థ్య ముండఁబోదని తలంతును. ఆచార్యులు గారు మిక్కిలిశ్రమచేసి ఈగ్రంథము వ్రాసినారనియు, ఇది మనోహరముగా సప్రమా ణముగా నున్నదనియు నా యభిప్రాయము. ఆచార్యులుగారు ఉభయభాషా కవులు. అష్టావధానులు. పండితులును అయి యున్నారు. వారీ గ్రంథము వ్రాయుటలోఁ దమ పాండిత్యము ప్రకటించుకొనుటకుఁ గాక ఈ స్థలపురాణము సర్వజన సుబో ధకముగా నుండవలయునని కొన్ని కొన్ని వ్యావహారిక పద ములతో నతి సులభశైలిని, వచన ప్రబంధము రచించినారు. ఇట్లున్న యప్పుడే పండిత పామరులగు భక్తులెల్లరుం జదివి యిందలి మహిమాదికం బెఱింగి కృతార్థులగుటకు ననువు పడు చున్నదని నాయభిప్రాయము. కావున నెల్లవారు నీగ్రంథము సంపాదించి పారాయణ గ్రంథముగాఁ జేసికొని ధన్యులగుదు రుగాక. ఇట్లు గ్రంథమువ్రాసి జగత్తునకు శాశ్వతోపకారము చేసిన నరసింహాచార్యులుగారను గ్రంథము వ్రాయించిన

దేవస్థానపాలకవర్గమువారును మిక్కిలి ప్రశంసనీయులు వారికి శ్రీ కనకదుర్గా మల్లేశ్వరులు మేలుచేయుదురుగాక అని కోరుచున్నాను.

రాజమహేంద్రవరము
10—7—57

శ్రీ పాప కృష్ణమూర్తిశాస్త్రి
ప్రధ శాస్త్రాస్థానరవి,

శ్రీ హిందు రెలిజియస్ అండు ఛారిటబుల్ కమీషనరుగారైన

## శ్రీయుతులు వైపి లక్ష్మయ్య, బి. ఏ. బి. యల్. గారు

## పంపిన అభిప్రాయము.

నా బెజవాడ మకాములో ఈ గ్రంథకర్త నన్ను దర్శించి, ఈ గ్రంథములోని కొన్ని భాగములు 'స్థాలీపులాక' న్యాయమున, జదివి వినిపించెను. గీర్వాణభాషలోనున్న ఈ స్థలపురాణమును, క్షేత్రమాహాత్మ్యమును అరటిపండొలిచి చేతికందించినటుల తేటతెల్లముగ చక్కని సులభశైలిలో ఈ గ్రంథకర్త రచించియున్నాడన్న యతృప్తిఁ దట్టింపదేమో. నిజమరసిన ఈ గ్రంథకర్త కలవడిన యీ మేలిగుణమే నన్నాకర్షించినది. మఱియు, నాస్తికత్వమునకు దారితీయుచున్న ఆధునిక కాలములో నిట్టి స్థలపురాణ గ్రంథములెంతయు నావశ్యకములని తలంచి, దీనిని ముద్రించుట

మంచిదని వెంటనే వచించితిని. ఆలశ్యములేక యీపని జరిగి నందులకు, సంతసించితిని. ఈ దుర్గామల్లేశ్వర దేవాలయ ధర్మకర్తలు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారు, దేవాలయాభివృద్ధికై యాచరించుచుండిన, బహుసత్కార్యములలో నిదియొక్కటి యని ఘంటాపథముగ నుడువ వచ్చును.

భారతదేశమున ననాదిగ జాతికి జీవగఱ్ఱయై వెల రారిన సంస్కృత సాహిత్యము 'అమూల్యరత్నఖని' యన్న నత్యదూరముగాదు. శ్రీ పండిత దీవి నరశింహాచార్యుల వంటి ఆంధ్ర గీర్వాణ భాషావిశారదులు, ఆ ప్రాచీన సాహిత్యము నందలి పాణ్డిత్య లభావరత్నములు ఏర్చి, పేర్చి, ప్రజల కందించుచున్నారు. ఇది యెంతయు జనోపకారియై పరగెడి దన్న నందఱు నంగీకరింపక తప్పదు. దుర్గాహ్యామైన విషయములు, పండిత పామరుల కరమగునటుల, బోధించుట, వచించుట, రచించుట మన దేశోన్నతికి, విజ్ఞానాభివృద్ధి కెంతయుం దోడ్పడగలవనుట నిస్సందియము. పుణ్యతీర్థములకు, దివ్యక్షేత్రములకు, పుట్టినిల్లుగా వెలసినదీ భరతఖండము. మహోన్నతశిఖరములతో, శిల్పకళా నైపుణ్యముతో, పూర్వపు ఔన్నత్యమును, ప్రపంచమునకు వేనోళ్ళ జాటుచున్న దేవాలయములయొక్క చరిత్రమును, దివ్యక్షేత్రములయొక్క మాహాత్మ్యములను సాంగముగ తెలిసికొనుట ప్రతి భారతీయుని విధి. నా విదేశపర్యటనలో, నేనటెగినంతలో కనులార గాంచినంతలో యూరోపుఖండమందు, చారిత్రాత్మకమైన స్థలముల యొక్కయు, దివ్యభవనములయొక్కయు, విషయములు చక్కని పరిశోధన గావించి గ్రంథములు రచించి, ప్రక

టించియున్నారు. ఇయ్యది విదేశపర్యటన గావించిన విజ్ఞు లెల్లఱుకు తెలిసిన విషయము. దివ్యక్షేత్రమయమైన యీ దేశమున నట్టివి చాల తక్కువ. అట్టికొఱంతదీర్చుటకై యీ గ్రంధకర్త యుద్యమించి, కొంత సాధించినాడని తెలుపుటకు సంతసించినాడను. గతానుగతికన్యాయమున, మన పెద్దలు చేయుచున్నారు. కాబట్టి మేము నాచరించుచున్నా మనుట కన్న, దివ్యస్థలములయొక్క, స్థలపురాణముల విషయములు శోధించి యదార్థము గ్రహించిన, జనులెంతో ఆనందించుట యేగాక, పూర్ణవిశ్వాసముంచి వానిని పూజింతురు. ఆరా ధింతురు, అర్చింతురు. ఈ గ్రంధకర్త నుఃివిసటుల వ్యాసభగ వానుని మాహాత్మ్య ఖండముపై దృష్టి పాఱించవలసిన రోజు లివి. కొన్నిచోట్ల పరస్పర విరుద్ధములుగా గాన్పించి మన పురాణములు ప్రాకృతులకు దుర్గ్రాహ్యములుగా నున్నవి. వాటిని యర్థముచేసుకొను శక్తిలేక స్వల్పబుద్ధులు పుక్కిటి పురాణముల క్రింద, కట్టుకథల క్రిందఁ జేర్చి హేళన గావించు చున్నారు. ఉభయ భాషాప్రవీణులగు పండిత కవీంద్రులు వాటిని సమన్వయ పరచి, సముచితముగ, సమంజసముగ వ్యాఖ్యానించిన ఎంతయు దేశసేవ, భాషాసేవ సలిపినవారగు చున్నారు. ఈ గ్రంధకర్త, పురాణేతిహాసములలోని విషయ ములేకాక చారిత్రాత్మక శాసనములు సంగ్రహించి, సమ న్వయపరచి, యిందు వెల్లడించియుండుట యీ స్థలపురాణ మునకు మఱింత శోభఁ గూర్చుచున్నది.

ఆస్తికత్వమునకు చక్కని వాదముగావించి, యీ గ్రంధకర్త నాస్తికుల వితండవాదమును విమర్శించి, ఖండించి

యొప్పింపఁజూచుట ప్రశంసనీయము. విగ్రహారాధన యావశ్యకతనుగూర్చి యీ పండితుఁడొక ప్రత్యేక గ్రంథమును రచించిన మంచిదేమో. ప్రతిమా స్వల్పబుద్ధీనాం, అని ప్రాజ్ఞులు భావించినను విగ్రహారాధనతో ప్రథమ సోపానారోహణము ప్రారంభించి, ఆత్మసాక్షాత్కారముతో, విజ్ఞాన నిలయమగు మహోన్నతమునకు సౌధము గమ్యస్థానమై యవలీలగా జేరగలదారి జూపిన, మన ప్రాచీన అర్యులకు నమోవాకములు. స్థూలారుంధతీ న్యాయ మిందుకొఱకై వేదాంతులు నుడివిరి. రాజయోగమున 'పిపీలికా న్యాయము' జూపిరి. వారివారి అంతస్థులనుబట్టి, క్రమముగా సాయుజ్యమును జేరుకొనుటకు సక్రమమైనదారులు. తమ స్వీయానుభవముతో గ్రహించి వెల్లడించిరి. ఇదియేమన హిందూమతములో నొక్క ప్రశంసనీయమైన గుణము.

ఈ గ్రంథమున కనకదుర్గా క్షేత్ర మాహాత్మ్యము, కృష్ణానదీ జన్మకథనము, తీర్థములు క్షేత్రములు, మల్లేశ్వరుడు, బ్రహ్మప్రతిష్ఠ, మల్లికార్జునుడు, భ్రమరాంబిక, బ్రహ్మాండపురాణమందలి కనకదుర్గా మాహాత్మ్యము, చారిత్రాత్మకమైన శాసనములు చక్కగా విశదీకరింపబడినవి.

ఈ గ్రంథకర్త మఱికొన్ని యిట్టి స్థలపురాణములు రచించి లోకోపకార మొనరించి ధన్యజీవియగుగాక;

Hyderabad
22-7-57

P. LAKSHMAYYA,
Commissioner
H. R. & C. E.

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, అవధానశిరోమణి
మ హ శ్రీ
కాశీ కృష్ణాచార్యులవారొసంగిన అభిప్రాయము

'శ్రీ కనకదుర్గాక్షేత్ర మాహాత్మ్య' మను యీమహత్తర గ్రంథమును గ్రంథకర్తగారి ముఖముననే, శ్రీ మొదలు ఇతిశ్రీ వరకు, చదివించి రెండవపర్తిని ప్రత్యక్షర పరిశీలన పద్ధతితో నేను స్వయముగా చూచుచు విని కడుంగడు సంతసమునందితిని. ఇదివరకు నే నెచటను వినియుండమిచే నాకు అంత సంతసమును ఈ గ్రంథము కల్గించినది. ఏ యే పురాణములో శోధించి గ్రంథకర్తచే నిది ఉద్ధరింపఁబడినది. శ్రీ కనకదుర్గకు సంబంధించిన సర్వ విషయములు సులభముగా పండితపామరులకు తెలియుటకు యీ గ్రంథముకంటె మఱొక గ్రంథము లేదనియే నా యూహ. ఈ విధముగ పురాణశాసనాది ప్రబల ప్రమాణములతో తా చెప్పబోవు విషయముల నలంకరించి వ్రాయు కవులలో ఈగ్రంథకర్తయే అగ్రగణ్యుఁడేమోయని నేఁ దలంచుచున్నాను.

ఇటులనే గీర్వాణభాషా సముద్రములో నణఁగియున్న మాహాత్మ్యరత్నముల నుద్ధరించుచు నీ కవి శ్రీ హయగ్రీవ ప్రసాదపాత్రుడై, లోకోపకారియై చిరకాలము "మనుఁగాత' అని శ్రీ హయ వదనుని ప్రార్థించుచున్నాను. శంభూయాత్

గుంటూరు
25-7-57

కాశీ కృష్ణాచార్యులు

# FORE-WORD

Sriman Divi Narasimhacharyulu has been known to me for a long time since I was a Commissioner for the Hindu Religious Endowment's Board, Madras. He is Sanskrit scholar, Poet, a pundit in the Agama Sastras and a keen student of historical research. He is a disciple of the veteran scholar and epigraphist and linguist, the late Sri Vetury Prabhakara Sastry.

Sriman Narasimhacharyulu has taken great care and pains to prepare the Durgakshetra Mahatmyam, relating to the celebrated temple of the Goddess Durga, who is one of the Eighteen Saktis worshipped all over India. It is indeed a piece of rare good fortune that Andhra Country possesses six out of the celebrated eighteen Sakti pithas. They are Omkareswari at Oddavadi (Vaddadi) in Visakhapatnam District; Puruhutika at Pithapuram and Manikyeswari or Vindhyavasini at Daksharama in the East Godavari District, Kanaka Durga at Vijayawada, Bhramarambika at Srisailam and lastly Lalita at Tripurantakam in the Kurnool District. It is really gratifying to note that the publication of the Durgakshetra Mahatmyam, seems to be the beginning of writing down the Kshetra Mahatmyams of the remaining five Sakti pithas.

Sriman Narasimhacharyulu has exhibited his profound scholarship, his knowledge of the puranas and other ancient literature, his equipment for doing research

work in the matter of discovering and interpreting ancient inscriptions. His work reveals in an abundant degree his capacity to interpret knotty problems that arise in the study of inscriptions. The discussion on the Bezwada Pillar inscription of Yuddhamalla circa 927 A. C. clearly shows his capacity to deal with ancient language and history. Sriman Narasimhacharya's work is in lucid style and takes on eagarly the reader to the end of work. I wish he would undertake to write many more Mahatmyams of this type in Telugu for the benefit of his Countrymen.

Rajahmundry,<br>
5th July, 1957.

(Sd.) B. V. Krishna Rao, M.A., B.L.,<br>
ADVOCATE.

# విషయ సూచిక


| వరుస నెంబరు. | | పేజీ నెంబరు |
|---|---|---|
| 1 | తొలిపలుకు | 1 |
| 2 | దేవుడున్న కనపడడేమి | 4 |
| 3 | ప్రతిమా స్వల్పబుద్ధీనాం | 6 |
| 4 | రాళ్ళు దేవుళ్లైతే రాసులుమింగవా | 9 |
| 5 | అవతారిక | 1 |
| 6 | కృష్ణానదీ జన్మకథనము | 5 |
| 7 | తీర్థములు - క్షేత్రములు | 10 |
| 8 | ఇంద్రకీలుడు - ఇంద్రకీలాద్రి | 15 |
| 9 | కనకదుర్గ - బ్రహ్మచారిణి | 16 |
| 10 | శ్రీ దుర్గాదేవి వర్ణనము-ఆదిశంకరులు | 21 |
| 11 | మల్లేశ్వరుడు-బ్రహ్మప్రతిష్ఠ | 23 |
| 12 | విజయుడు - విజయేశ్వరుడు | 25 |
| 13 | దుర్గాకుండము చింతామణిదుర్గ | 26 |
| 14 | మల్లికార్జునుడు - భ్రమరాంబిక | 27 |
| 15 | మొగల్ రాజపురం - ధనపు కొల్లు | 27 |
| 16 | ముక్కంటిరుద్రుడు-కళ్ళేపల్లి కైఫీయతు | 28 |
| 17 | దుర్గాక్షేత్ర మాహాత్మ్యము | 30 |
| 18 | దుర్గమాసురుని వధ | 31 |
| 19 | మహిషాసురమర్దని అవతారము | 32 |
| 20 | శుంభనిశుంభులను జయించుట | 32 |
| 21 | శివునకుమల్లికేశుడను పేరుకలుగుట | 33 |
| 22 | పాండవులు తపస్సుచేయుట | 33 |
| 23 | బెజవాడకు పలు నామములు | 33 |

| | | |
|---|---|---|
| 24 | క్షేత్రమహిమ స్కాందపురాణము | 34 |
| 25 | దుర్గాంబా కుండమాహాత్మ్యము | 41 |
| 26 | శ్రీ కనకదుర్గామాహాత్మ్యము బ్రహ్మాండ పురాణము | 47 |
| 27 | శ్రీ దుర్గాదేవిమాహాత్మ్యము పద్మ పురాణము | 51 |
| 28 | గాజులు - సినీమా | 57 |
| 29 | నృసింహబిలము-గోవిందుగుహ | 60 |
| 30 | నటరాజు - శివకామసుందరి | 61 |
| 31 | కృష్ణజలక్రీడలు-గంగావతరణము | 61 |
| 32 | భక్తులు - పాలనకర్తలు | 62 |
| 33 | భక్తులపేర్లు - కట్టడములవివరము | 63 |
| 34 | ఆభరణములు - కవచములు | 64 |
| 35 | దేవస్థాన పరిపాలకవర్గము | 65 |
| 36 | చూడతగిన యితరముఖ్యవిషయములు | 66 |
| 37 | శాసనములు - చరిత్రము | 67 |
| 38 | యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనము | 85 |
| 39 | పల్లకేతు భూపాల శాసనము | 98-A |
| 40 | చోళకాంఇ పాత్రుని దానశాసనము | 98-H |
| 41 | శ్రీ కృష్ణానదీమాహాత్మ్యసంగ్రహమ్ | 99 |
| 42 | దుర్గాంబాకుండమాహాత్మ్యమ్ | 110 |
| 43 | కనకదుర్గా మహాత్మ్యమ్ | 116 |
| 44 | దుర్గామహాత్మ్య కథనమ్ | 120 |
| 45 | శ్రీ కనకదుర్గాదేవి ధ్యానశ్లోకములు | 126 |



శ్రీ గవర్నరు దంపతులు దేవస్థానమును ట్రస్టీలతో సహా
సందర్శించినప్పటి ఛాయా చిత్రము.



హిందూ రెలిజియస్ అండ్ ఛారిటబుల్ ఎండోమెంట్సు కమీషనరు
శ్రీయుతులు పైడి లక్ష్మయ్యనాయుడుగారితో
దేవస్థాన అధికారవర్గము.

# తొలిపలుకు

తొలుత నాకు సాహిత్యగురువులైన బ్రహ్మశ్రీ వేమూరి సీతారామశాస్త్రిగారికిని, కవితాగురువులైన కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికిని, అవధానదేశికులగు, మహా మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, అవధానశిరోమణి, మహర్షి శ్రీ కాశీ కృష్ణాచార్యుల వారికిని, ఆగమోపాధ్యాయులు, వైయాకరణపంచానన శ్రీమాన్ రొంపిచర్ల భట్టరు పండిత పార్థసారథి అయ్యంగారికిని, పరమగురువులైన, కీ॥ శే॥ శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులవారికిన్నీ నా మనః పూర్వక నమస్కారములు.

ఈ కనకదుర్గాక్షేత్ర ప్రభావము స్కాందము సహ్యాద్రి ఖండములోను, పద్మపురాణము పూర్వభాగములోను, బ్రహ్మాండపురాణమున నుత్తరఖండమునందును ప్రశంసింపఁ బడియున్నది. ఇట్టి పురాణప్రమాణముల వలన నీ క్షేత్రము యుగయుగములనుండియు నున్నట్లు కనపడుచున్నది. ఇం దుదహరింపఁబడిన ప్రమాణములు నేటి ముద్రిత పురాణ ప్రతులందు కానరావు ఇంతమాత్రమున నివి లేవనికాని, అప్రమాణములని కాని తలపరాదు. కారణమేమన ? అష్టా దశ పురాణములను, వ్యాసభగవానులు, మంత్రఖండము, మాహాత్మ్యఖండము, యితిహాసఖండములని మూఁడు భాగ ములుగ రచించియుండిరి. ఇందు యితిహాసఖండములు

మాత్రమే ముద్రితప్రతులు నేడు మనకు లభ్యము లగు
చున్నవి. కాని మంత్ర మాహాత్మ్య ఖండములు దొరుకుట
లేదు. మంత్రఖండములందు, ఆయా దేవతల నుపాసించు
టకు వలయు మంత్రములను, ఋషిచ్ఛందోధి దేవతల నియ
మమును, ప[illegible]క్రమాదుల నిర్ణయములును, ముద్రాయం
త్రాది మంత్రాంగసాధనములను, ఫలశ్రుతులను దెల్పు
కల్పము లుపదేశింపఁబడినవి. ఇవి గురుముఖమున తెలిసి
కొన తగినవగుటచే, యందలి రహస్యములు కీలకములు స్పష్ట
ముగా తెలియవు. అందువలన నివి ఆయా సాంప్రదాయము
లకుఁ జెందిన శిష్యులకు పరంపరాప్రాప్తిగా, గురుముఖమున
నుపదేశింపఁబడి వారియొద్ద మాత్రమే దొరుకుచున్నవి. ఇక
మాహాత్మ్యఖండములుకూడ కేవలము ఆ యా పుణ్యక్షేత్ర
ముల యొక్క యుత్పత్తిని గురించియు, నందలి దేవతా
విశేషములును, త[illegible]ల ప్రభావములును వర్ణితములై,
అందు ముఖ్యులైన భక్తుల చరిత్రములను తెల్పునవియై
యున్నవి. కనుక అట్టి గ్రంథములు ఆయా మతానుయాయు
లకు మాత్రమే పూజనీయములై, ఆయా క్షేత్రములకు
సంబంధించిన అర్చకుల యొద్దను లేక ఆ ప్రాంతీయ పండితుల
యొద్దను నుపలభ్యము లగుచున్నవి. ఇందువలన నివి చాల
వరకు ముద్రితములు కాలేదు. తాళపత్ర గ్రంథములున్నను
కీటకములచే కొట్టఁబడి గ్రంథ లుప్తములైనవి. ముద్రిత
ప్రతులు కొన్ని యుండఁగ దొరికినను నందు తప్పులు, తప్పు
లుగ నున్నవి. మరియు మరికొన్ని మాహాత్మ్య గ్రంథములు

తురుష్కుల పాలన కాలములో దేవాలయములెన్నోఁ బాలు విధ్వంసమొనర్పఁబడినవి.

అష్టాదశమహాపురాణములేఁ గాక పదునెనిమిది యువపురాణములును, పదునెనిమిది యుపోప పురాణములుకూడ వ్యాసభగవానుఁడే రచించినట్లు పురాణములందు కలదు. కనుక మొత్తము యేబది నాలుగు పురాణములు వ్యాసరచితము లున్నట్లు స్పష్టమగుచున్నది. ఖండత్రయాత్మక విభాగము విదియేనేమో ?

ఈ మహాత్మ్య గ్రంథములలోని శ్లోకములు కొన్ని చోట్ల అర్థప్రధానములుగ మాత్రమే యుండియున్నవి. కాని నేటి వ్యాకరణ సూత్రములకు ఛందస్సులకు సరిపోవుట లేదు. ఇట్టి పాఠములు తరచుగ పురాణములలోనే కానగును. ఇవి ఆర్షప్రయోగములగుటచే సవరించుటకు వీలులేదు. ఆర్ష వ్యాకరణములచే నివి సాధుపాఠములే యగుచు గాని స్ఖాలిత్యములు కావు.

అసలు మాహాత్మ్యముల సత్యములనియు, కల్పితములని కొందరును, అసలు దేవుఁడే లేడని కొందరును, ఉన్నను విగ్రహారాధనము మూఢనమ్మకమని కొందరును, వాదించు విమర్శకులు పెక్కురు కలరు, వారికి 'ప్రతిమా స్వల్పబుద్ధీనాం' అనియు 'రాళ్ళు దేవుళ్లైతే గానులు మ్రింగవా' అనుచున్నగు ప్రమాణములు కొన్ని దొరకకపోవు. కాని వాటినైనను, పూర్వాపరములు విమర్శింపకయే తమ కవసరమగు

నంతవరకు మాత్రమే ప్రమాణములుగ గ్రహించుకొని వాదించు
అతివాదుల సందేహములను తీర్చ సమకట్టుట వ్యర్థప్రయాసమే
యగును. మరియు వారికి కోపకారణమగును కనుక అట్టి
వారితో మనకు వాదప్రసక్తి లేదు. వారి విశ్వాసము వారిది.
మన విశ్వాసము మనది, అని యూరకుందుమన్న. విశ్వా
సము కలవారికైనను. వారి వాదములకు సమాధానములు
చెప్పనందున, వీటికి సమాధానములు లేవనుకొని. వీరి విశ్వా
సము కూడ, క్రమక్రమముగా సన్నగిలి పోవునన్నీ, ఇందలి
యథార్థము మరుగుపడుననే తలంపున నిటకొంత విస్తరింప
తలచితిమి. సంశయములు హెచ్చినకొలది విశ్వాసము తగ్గును.
అందువలన. ఆత్మనశించునని, 'సంశయాత్మా వినశ్యతి' అని
ఆర్యోక్తి.

## దేవుడున్నాడనుటకు ఆధారమేమి ?

దేవుడు లేడని వాదించు వారికి అనుమాన ప్రమా
ణములు పనికిరావట. ప్రత్యక్ష ప్రమాణమును మాత్రమే
నమ్ముదురట. దేవుని చూపలేనందున లేడనివాదింతురు,
ఇందెంత సత్యమున్నదో సమంజసముగనున్నదో విచారింతము
వీరికి కనపడనంత మాత్రమున వీరు చూడలేనంత మాత్ర
మున, అట్టి శక్తులన్నియు లేవని తాత్పర్యమా? అసలు
లేడన్నమాట చేతనే, ఉన్నాడన్న ధ్వని కలుగుచున్నది.
ఉంటేనే లేదను శబ్ద వ్యవహార సిద్ధి కలుగునని తార్కిక
మతము. తేజోమయ గోళములైన సూర్యాదులను చూడ

లేని కళ్ళు కోటి సూర్యప్రకాశమానమైన దేవునిఁ జూడఁ
గలవా? వాయువు కనుపించుచున్నదా? విద్యుచ్ఛక్తి కను
పించుచున్నదా! లేదు. అట్టి చోటఁ గన్నులకుఁ బనియుం గాలేదు.
కనుక లేవనియర్థమా? పోనిండు రూపములున్న వస్తువులై
నను (జీవులైనను) గ్రామాంతర, దేశాంతరములందున్న
కనపడుట సాధ్యమా? లండను పట్టణమును మనము చూడ
నంతమాత్రమున లేకుండపోవునా? పట్టణమువద్దకు మనము
పోవలెనా? పట్టణము మనవద్దకు రావలెనా? పోవుటకు తగిన
ప్రయత్నము చేయవలెను కదా? అందుకు తగిన అర్హత
యుండవలెనుకదా! చూచినవారున్నారు వారు చెప్పుచు
న్నారన్నచో ఆప్తవాక్యము వారి పక్షమున ప్రమాణము
కాదుకదా? అట్టివారైన ప్రహ్లాద, నారద, రామదాసాదు
లెందరులేరు? ఇంతవరకేల! ఒకనికి తండ్రి చిన్నతనమున పర
లోకగతుడయ్యెను, అతను తన తండ్రి నెరుగడు. అంత
మాత్రమున అతనికి తండ్రి లేడని వాదమా? ఉన్నాడన్న
చూపుటకు సాధ్యమగునా? మరియొక సంగతి ఒక అంధునికి
యెదుటనున్న ప్రపంచము కనుపించదు. కనుక ప్రపంచమే
లేదందుమా? ఇట్టి యుక్తివాదములతోను, వ్యర్థవాదము
లతోను, మనకు ప్రసక్తి లేదు. ఈ సకలచరాచర సృష్టికి
కర్త, భర్త, అయిన నొక మహత్తరమైన పదార్థము కలదు.
అదియే బ్రహ్మమనుడు, శక్తియనుడు, ఏదైననేమి?

ధనమును వెచ్చించి యిట్లు నిర్మించుటకు కారణము, భగ
వంతుని అర్చావతార వైభవమే. ఆయా విగ్రహములందు
కల మహాత్మ్యమును తెలుపుటకు నేటికిని, తిరుపతి, శ్రీరంగ
ము, శ్రీశైలము, భద్రగిరి, వారణాసి, రామేశ్వరము,
మంగళగిరి, అన్నవరము, మోపిదేవి, యాదవాద్రి, అంత
ర్వేది, కోటప్పకొండ మున్నగు వెన్నియో క్షేత్రములు
ప్రత్యక్ష ప్రమాణములుగ నున్నవికదా! ఇట్టి క్షేత్రములకు
సంతవారించినను, నవ్వారు వద్దన్నను భక్తులు వెళ్ళక ఆగు
దురా? వీరిని రమ్మని యెవరైన పిలుచుచుండిరా?

ఈ దేవాలయములు ఆగమశాస్త్రములలో స్వయం
వ్యక్తములని, దివ్యక్షేత్రములని, ఆర్షములని, సైద్ధములని,
ప్రాకృతములని అయిదు విధములుగ విభజింపఁబడినవి.
స్వయంవ్యక్తములనగా? భగవంతుఁడు కాని, భగవతి
(దేవి) గాని, దేవమానవ నిర్మితములుఁగాక స్వయముగా
నుద్భవించిన దివ్యస్థలములు. తిరుపతి, అహోబిలము,
వేదాద్రి, జంబుకేశ్వరము, ఆకిరిపల్లి, మున్నగునవి దివ్యస్థల
ములనగా దేవతలచేత ప్రతిష్ఠింపఁబడినవి. తిరునారాయణ
పురం, మాయవరం, మధురాంతకం, శ్రీకాకుళం,
శ్రీకూర్మము లోనగునవి. ఋషిప్రతిష్ఠతములు, ఆర్షము
లు. రి. భద్రగిరి, ద్వారకా తిరుపతి, మంగళాద్రి,
శ్రీశైలము, జగన్నాథము మొదలగునవి ఇంక శ్రీరంగము,
వానమామలై (తోతాద్రి) కాంచీపురము, చిదంబరము,
నామక్కల్, శృంగేరి, పుష్పగిరి, విరూపాక్షము, మున్నగు

నవి. సిద్ధులచేత ప్రతిష్ఠింపఁబడినవి. పొన్నూరు, కాళహస్తి, సింహాచలము, లోనుగాఁగల క్షేత్రములు పూర్వులచేత ప్రతిష్ఠించఁబడినవి. ఇప్పుడు ప్రతిష్ఠింపఁబడినవి నవీనము లనిరి.

## రాళ్లు దేవుళ్లైతె రాసులు మ్రింగవా ?

అసలు విగ్రహములు శిలలు గదా ! ఇవెట్లు భక్తులను తరింపఁజేయును ? అనునది మరియొక సమస్య. మానవునిచే నిర్మింపఁబడు విమానము ధూమశకటము (Rail) పొగయోడ (Steemer) మున్నగునవి అచేతనము లైనను, తమను నిర్మించిన వారిని, యితరులనుకూడ ఒకదేశమునుండి మరియొక దేశమున కెన్నివేల మైళ్ళ దూరమున్నను సముద్రమును సహితము దాటించి యెట్లు తీసుకొని పోవుచున్నవి ? అట్లే ఈ విగ్రహములు, మానవ నిర్మితము లైనను, చిత్తైకాగ్రతను కలిగించి, భవసాగరమును తరింపఁజేయుటయేగాక కామ్యములనుకూడ తీర్చుచున్నవి. ఇంకను మానవునిచే నిర్మింపఁబడిన రేడియో (Redeo) చలనచిత్రము (Cinima) లు ప్రత్యక్షముగా మనకానందమును కలుగజేయుటలేదా ? వాటికట్టి శక్తి ఎట్లువచ్చినది ? అందుకు కొంత ప్రయత్నమును చేయుచున్నాము కదా ! అట్లె అర్చనాదుల వలన భగవత్సాన్నిధ్యము కలుగఁగలదు. ఒక మైలురాయి గాని, మార్గమును సూచించుఫలకము (Sign Board) గాని మనకు యేమి తెలుపుచున్నవి. వాటివంక చూచిన వారికి మదరాసు 250 మైళ్లు, కలకత్తా 750 మైళ్లు అని తెలుపుచున్నవి. అవి అచేతనములు. చెప్పుటకవి మనలను పిలుచుచు

న్నవా? పిలుచుటకు వాటికి నోరున్నదా? లేదు. రాతికి చైతన్యము లేకపోయినను తన వంకచూచిన వారికి యిది ఈ పట్టణమునకు పోవుమార్గము, యిక్కడి కింతదూరమను విషయములను నెట్లు బోధపర్చుచున్నవో అట్లు యీ ప్రతిమలును తమ వంకచూచినవారికి భగవంతుని అనంత లీలలను అవతార భేదములను జ్ఞప్తికి తెచ్చి, మానసిక కల్మషములం దొలగించి, పవిత్రులనుఁ జేయుచున్నవి. మనోనిశ్చలత(Control of Mind)యే ముక్తికి ప్రథమ మార్గమని పెద్దల అనుభవము "రసబంధో, మనోబంధో, కోనసిద్ధ్యతి భూతలే"అని రసవాదమతము.

విగ్రహములకు శక్తి యెట్లుకలుగు ననగా, "ఏహ్యాశ్మాన మాతిష్ఠాఽశ్మాభవతు తేతనుః 'అని అధర్వవేదోక్తి అనగా ఓ భగవంతుడా! యీ రాతిపై వచ్చి ఆవహించుము. యీ రాయి నీకు తనువు కాగలదు. అని అర్థము. ఆగమ శాస్త్రములందును, "నిర్ణయసింధువు' అను ధర్మశాస్త్రములోను "అర్చకస్య తపోయోగా దర్చనస్యాతి శాయనాత్। బింబానామాభిరూప్యాచ్చ త్రిభిస్సాన్నిధ్యమృచ్ఛతి" అని చెప్పఁబడినది అనగా అర్చకుని తపోనిష్ట వల్లను, అర్చనము (పూజ)యొక్క నిశిష్టతవల్లను, విగ్రహముయొక్క సౌందర్యము వల్లను, ప్రతిమయందు భగవత్సాన్నిధ్యము కలుగును. మరియు" లక్ష్మీధర తంత్రము "లో

"సర్వాతిశాయి షాడ్గుణ్యాం సంస్థితం మంత్రబింబయోః
అర్చాపి లౌకికీయాస్యాత్సాపి షాడ్గుణ్య విగ్రహా."

అని నిర్వచించబడినది. అనగా అగ్నిచే తప్తము చేయబడిన అయఃపిండము (యినుపగుండు) సహితము, తన పూర్వకాఠిన్యతినుం బాసి మృదువుగా నెట్లగునో, అటులనే మంత్రతప్తములైన విగ్రహములును తమ సహజ కాఠిన్యమును విడిచి, చైతన్యము కలవై చలన సంభాషణాది కార్యకరణ సమర్థములగునని అర్థము. ఈ విషయమునే శ్రీమదాంధ్ర భాగవతము సప్తమ స్కంధము 366 వచనములో "రూప రహితుండవైన నీకు బీజాంకురముల కైవడిం గారణ కార్యంబులయిన సదసద్రూపంబులు రెండును ప్రకాశమానంబు లగు. నా రెంటియందును భక్తియోగంబున బుద్ధిమంతులు, మననంబున దారువులందు వహ్నిం గనియెడు తెరంగున నిన్నుం బొడగందురు." అని వచించిరి అనగా అచేతనములైన కమలములను వికసింపంజేసి యందున్న మకరందమును వెలువరించుటకు సూర్యభగవానుం డెట్లు యావశ్యకమో, యట్లె విగ్రహములందు శక్తిపాతమును కలుగంజేయుటకు అర్చకులు ఆవశ్యకము ఇట్టి సంశయమే శ్రీ స్వామి వివేకానందకు కలిగినప్పుడు, "రామకృష్ణపరమహంస" దేవాలయములో "కాళికాదేవి"ని ప్రత్యక్షముగం జూపించెను. అంత వానికి నమ్మకము కుదిరినది. ఇట్లు విగ్రహములు కదలునా? మాట్లాడునా? యను సంశయము పలువురకు కలుగవచ్చును. తప్పక విగ్రహములు నదులుకూడ శరీరములతో భక్తులకు దర్శన మొసంగుట జరుగుచుండును. ఇది వింత కాదు. తిరుపతిలో శ్రీనివాసమూర్తి హత్తిరాంతో చద

గంగ మాడుట, మేలుకోటలోని తిరునారాయణ (శల్వపిళ్లె) స్వామి "మాడుకడుత్తై" (ఢిల్లీ పాదుషాకూతురు)ను పెండ్లి యాడుట, భద్రాచలములో రామదాసును చెఱసాలనుండి విడిపించుట, శ్రీకాకుళంలో సుమంతమహారాజుకు శిరోజము లను జూపుట, కూని గోవిందుకు పొన్నూరులో శావనారా యణస్వామి సాక్ష్యము పలుకుట, యీ కనకదుర్గాంబ గాజు లను వేయించుకొనుట, కాళహస్త్రిలో కన్నప్పను రక్షించుట, కాంజీవరములో వేదాంతదేశికులకు స్వామి ప్రత్యక్షమగుట, పండరీక్షేత్రమున భక్తుల ననుగ్రహించిన గాధలు సాక్ష్య మిచ్చుచున్నవి. కనుకనే మహాభారతములో శ్రీ వ్యాసభగ వానుఁడు 68 అధ్యాయములో,

✓ "అర్చాయత్రి ప్రనృత్యంతి, నదంతి హసంతిచ
ఉన్మీలంతి నిమీలంతి రాష్ట్రక్షోభం వినిర్దిశేత్॥ "అని

వచించిరి. దేవాలయములందు యేరాష్ట్రమున విగ్రహములు నృత్యముచేయునో, నాదముచేయునో, నవ్వుచుండునో, లేక కన్నులు మూసి తెరచుచుండునో ఆ రాష్ట్రమునకు కీడు మూడునని యర్థము. ఇట్లె అథర్వణవేదములోకూడ "దేవా యతనాని కంపంతె, దైవతప్రతిమా హసన్తి, రుదంతి, నృత్యంతి" అని కలదు. మఱియు శ్రీమద్భాగవతములోకూడ

కం. కదలెడి వేల్పుల రూపులు
వదలెడిఁ గన్నీరు వానివలనం జెమటల్
పొదలెడిఁ బ్రతిమలు వెలిఁజని
మెదలెడి నాక్రోశ గుడిని మేదిని యందున్॥ అని

శ్రీ పోతనామాత్యుఁడు వర్ణించి తెలిఁగించెను.

యీ విషయమున విశ్వాసము లేనివారు యీ శతాబ్దము లోనే ది 28-8-25 తేదీన వెలువడిన "హిందు" పత్రిక యందు నాగపూరులోని 'పాండురంగస్వామి, రుక్మిణీదేవి' విగ్రహములు కన్నులనుండి పన్నెండుగంటలు కన్నీరు కార్చె నను ప్రకటనమును చూడఁ గోరెదను. అదిట్లు కలదు.

✓ "Idol's tears, curious, Nagpur incident." A Nagpur message to 'The times of India' tells of hand bills signed by Mr. Narayana Rao Hedas, was describing a strange incident, on the 17 th. August, tears were seen for 12 hours rolling down,the cheeks of the idols of Vittal and Rukmini, in the temple of Panduranga Budvari, Nagpur and thousands of people witnessed the incident. As a result of this strange phenomenon special prayers are being offered in the temple. Several people ascribe this effusion of tears from the idol's to the death of Tajuddin Saheb, the Mahamedan saint, which occured on that day."

పోతనామాత్యుని పలుకు ప్రకారము, గుంటూరు మండ లాంతర్గత రేపల్లెతాలూకాలోని పెదపులివర్రు గ్రామములో శ్రీ రాజరాజనరేంద్రునిచే ప్రతిష్ఠింపఁబడిన నరేంద్రస్వామి ఆలయములో నొక కుమారస్వామి విగ్రహము స్వయంభువ మూర్తి కలదు. ఆ స్వామి శరీరమునుండి నేఁటికిని సంతతము చెమట (నీరు) కారుచుండును. నేటికిని చూడనగును.

ఇంకిట్టి వెన్నియో నిదర్శనములు కలవు. కనుకనే

దుర్మత, మాయావాదముల కజేయములై, యీవిగ్రహారా
ధనము, (సగుణోపాసనము) విరాజిల్లు చున్నది. మఱియు
మోక్షప్రాప్తికి యజ్ఞాది క్రతు యను స్థానము కంటెను,
" భక్తియే గొప్పది యని, సులభోపాయమని " మోక్షసా
ధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసి "యని నారదుఁడు భక్తి
సూత్రములలో పలికిరి. దీనికి విధానము శరణాగతియే.
అందు కాధారము విగ్రహారాధనమే. శరణాగతిని పొందిన
వారి కెన్నడును ప్రమాదము లేదు. ఫలవంతము కాకపోదు.
కనుక శ్రీమద్రామాయణములో విభీషణ శరణాగతి ఘట్ట
మున శ్రీ రామచంద్రపరమాత్మ, " సకృదేవ ప్రపన్నాయ
తవాస్మీతిచ యాచతే । అభయం సర్వభూతేభ్యో దదామ్యే
తద్వ్రతం మమ " అని పలికిరి. ఇట్లు శ్రీకృష్ణచంద్ర పర
మాత్మయు, గీతలలో " సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం
శరణం వ్రజ । అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి
మా శుచః " అని ప్రతిజ్ఞ చేసిరి. కనుక నిస్సందేహముగ
విగ్రహారాధన మావశ్యకమే. అందువలన మానవుని కన్ని
యభీష్టములు సమకూరును. ఆ విగ్రహములం దన్ని శక్తు
లెట్లు యిమిడియుండు ననగా (Redoo) (రేడియో) యంత్ర
మున మన మే కేంద్రమును కోరిపెట్టిన యా కేంద్రము
నుండి పాటలు వినవచ్చినట్లు యీ స్వామిని మన మే కోరి
కలు కోరిన మన కవి లభించును. ఇట్టి మార్గములో కనకదు
ర్గాంబ యొక్క లావణ్యమూర్తి. సర్వాభీష్ట ప్రదాత్రి మోక్ష
దాయిని.

మరియు నీ దేవాలయములు సర్వకళలకు నాలయములై యుండెడివి. ఇవి మన కారోగ్యదాయకములు. ఆనందదాయకములు. మన పూర్వులు యింత యెత్తైన పర్వతములమీదను, నదీతీరములందును, గ్రామములలోను ఎత్తైన గోపురములు విమానములు యెందుకు నిర్మించిరనగా? పంచభూతముల పరిణామావస్థయందు కలుగు విప్లవములను నివారించి లోకమునకు శాంతిని చేకూర్చుటకె. అహోబిలము, మంగళగిరి మున్నగునవి అగ్నిపర్వతములు, గంధకపు గనులునైయున్నవి. కనుక అట్టి ప్రమాదములు తగ్గుటకె వాటికి విరుగుడులైన చంద్రకిరణక, కుళ అహోబిలములోను; మంగళగిరిలో పానకము పోయునట్లు నియమించిరి. వేదాద్రిలోని నృశింహశిల విషమణియగుటచే దాని నెల్లప్పుడు నీటిలోనుండునట్లు చేసిరి. ఎత్తైన గోపుర నిర్మాణములు, వాటిపై లోహముతు (Magnit) శిఖరస్థాపనలు యిప్పుడు పిడుగుయంత్రములు చేసెడి పనిని చేయుచుండెడివి. తిరువళ్లూరులో తైలాభిషేకము కుష్టువ్యాధులను నివారించుచున్నది. అది గంధకపు శిల. ఇట్టి భద్రాద్రిలో యుష్ణగుండముల నీరును ఆరోగ్యము నిచ్చును. మరియు దేవాలయములు, నేటి విశ్వవిద్యాలయములవలె పని చేసెడివి. ఇందుకు మంత్ర, వేదపఠనము, పురాణప్రవచనము, సూత్రభాష్యాది శ్రవణములవల్లను, వేదశాస్త్రములును, భజనము, భరతనాట్యములవలన, సంగీతమును, శిల్పసంపదచే (Engineering) సమస్తకళలను వంశ పరంపరా పెంపొందించుచూ, పోషింపబడుచుండెడివి.

ఇంక నీ స్థలపురాణమును వ్రాయుటకు నన్ను ప్రప్రథమమున ప్రోత్సహించినది, హిందు రెలిజియస్ అండ్ చారిటబుల్ ఎండోమెంట్సు, బందరు అసిస్టెంటు కమీషనరుగారైన శ్రీయుతులు కె. కృష్ణారావు గారు ఈ విషయమును విన్నవించినంతనే శ్రీ డిప్యూటీ కమీషనరుగారైన శ్రీ జి. ఎస్. ఎస్. రామమూర్తి పంతులు, బి. ఏ. బి. యల్. వారు యెంతయో ఆదరాభిమానములతో నంగీకరించి యనుజ్ఞ నొసంగిరి. తరువాత గ్రంథముద్రణమును, శ్రీ అమ్మవారి దేవాలయ పాలకవర్గ ట్రష్టీలగు శ్రీ మాజేటి రామమోహన రావు శ్రేష్ఠి గారును, మరుపిళ్ళ అప్పలస్వామి పాత్రుడు గారును, శ్రీ పిన్నమనేని పున్నయ్యచౌదరి గారును శ్రీ పాటిబండ అప్పారావు పంతులు గారును, శ్రీ నూతులపాటి తులసీరావు గారున్నూ సంతసముతో నంగీకరించి పాల్గొనిరి. శ్రీ ఎగ్జిక్యూటివు ఆఫీసరు మాదిరెడ్డి మాధవరావు బి. ఏ. గారున్ను శ్రీ రామ కృష్ణా ప్రెస్ అధికార్లున్నూ తగు ప్రత్యేక శ్రద్ధ వహించి ముద్రణకు వలయు సౌకర్యముల నన్నిటిని సమకూర్చి నిర్వహించిరి. పై వారి అందరికిని నా మనఃపూర్వక వందనముల నర్పించుచున్నాను. మరియు, శ్రీ కనకదుర్గా మల్లికేశ్వరులు వీరి కాయురారోగ్యైశ్వర్యముల నిచ్చి చిరకాలము మనునట్లుగాత యని జగన్మాతా పితలగు నా పార్వతీ పరమేశ్వరులను వేడుచున్నాను.

ఇట్లు,

అవనిగడ్డ,
ది 1-6-1957.

భక్తాంఘ్రి రేణువు
గ్రంథకర్త.



శ్రీ మల్లేశ్వరస్వామి దేవాలయము - విజయవాడ పట్టణ దృశ్యము.

# శ్రీ కనకదుర్గా క్షేత్ర మహాత్మ్యము

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయే సర్వవిఘ్నోప శాంతయే ॥1॥

శ్లో॥ జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥2॥

శ్లో॥ సర్వమంగళ మాంగల్యే - శివే సర్వార్థసాధకే
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే ॥3॥

శ్లో॥ కృష్ణవేణి నమస్తుభ్యం శుభే హరిహరాత్మకే
నిర్మితా విష్ణునా దేవి జగతామభిమతమె ॥4॥

శ్లో॥ తర్కవ్యాకృతి వక్షాయ గాయత్రాయంత్రవస్తునె
గోపరనాపధానాయ కాశీ కృష్ణాయతేనమః ॥5॥

## అవతారిక

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండును, నిఖిల జగదుదయ విభవలయలీల, సత్యకామ, సత్య సంకల్పాది సకల కళ్యాణ గుణాకరుండును, దేవదేవుండునగు శ్రీమన్నారాయణుండు, తన విలాసము కొరకు, అనంత

కోటి బ్రహ్మాండములను సృష్టించి, అందు చరాచరాత్మక మగు అనేక జీవకోటులను కల్పించెను. వారి ప్రవృత్తికొరకు వలయు దేహేంద్రియ సత్వాది సంపత్తులను, అంతఃకరణ చతుష్టయ విశిష్టంబగు జ్ఞానంబు నొసంగి, సత్యాసత్యములను, ధర్మాధర్మములను కల్పించి, తాను సాక్షీ భూతుడై, యీ జగన్నాటక లీలను జరిగించుచున్నాడు. శ్రీ వైకుంఠుని లీలలు అనంతములు. అద్భుతములు. ఈ జీవులును, కేవలము తమోగుణ ప్రధానులనియు, రజోగుణ ప్రధానులనియు, సత్వగుణ ప్రధానులనియు ముత్తెరంగుల నుండిరి. వీరిని మరియొక విధముగా జెప్పవలయునన్న కేవలము పాపులు, పుణ్యపాపమిశ్రులు, కేవలము పుణ్యులు అని చెప్పనొప్పును. కేవలము పాపజన్ములు పశుపక్ష్యాది తిర్యగ్జంతువులు. తరు పాషాణాది జడ పదార్థములునై యున్నవి. పుణ్యపాప మిశ్రితములైన జన్ములు మనుష్యులు. కేవలము పుణ్యజన్ములు దేవతలు. కనుకనే పాపలోకములకును, పుణ్యలోకములకును మధ్య నీ భూలోకము కలదు. అతలాది సప్తలోకములు అధోభాగమున గలవు. ఇవి పాపలోకములు వీటినే చీకటి లోకములందురు. ఇందు పాపులు నివసింతురు. భువరాది యూర్ధ్వలోకములందు దేవతలు తమ తమ యర్హతల ననుసరించి సంచరించుచుందురు. శ్రీ వైకుంఠ కైలాసములు పునరావృత్తి రహితములైనవి. ఇవి శాశ్వతములు. అనగా యిందు ప్రవేశము కలిగిన జీవులకు నిక జన్మ పరంపరలు లేవు. అవిద్యావాసనాదులు లేవు కనుకనే వీటికి అపవర్గములని పేరు. ఈ యూర్ధ్వలోకము లేడింటిలో ప్రథమ

లోకము భూలోకము. చివర లోకము స్వర్గము. ఏజీవి యయినను యీ భూలోకమున జన్మించినగాని యూర్ధ్వలోకములకు నేగఁజాలఁడు. ఏలనన? ఊర్ధ్వలోకములన్నియు తేజోమయ లోకములగుటచే కర్మఫలముల ననుభవించుట కరములైన భోగస్థానములు, కాని కర్మాచరణమున కనుకూలములైన లోకములుకావు. కనుక విష్ణు పురాణము, తృతీయాధ్యాయములో.

"ఇతస్స్వర్గశ్చ మోక్షశ్చ మధ్యశ్చాంతశ్చగమ్యతే" అని వచింపఁబడినది. అనగా యీలోకము పరలోకములకు వెళ్ళుటకు ద్వారము వంటిదని పలికెను. ఊర్ధ్వలోకములకు వెళ్ళఁగోరువారికి జ్ఞానము పరమసాధనము. అట్టి జ్ఞానప్రాప్తికి సత్కర్మానుష్ఠాన మాచరణీయము. సత్కర్మలొనరుచుట కును, శాంతిదాంతులను సమకూర్చుటకును, నిర్మలోదకములు, నిర్జనారణ్యములు, పవిత్ర క్షేత్రములు, పరమాలంబములు. ఇందుకొరకు కరుణాసింధులైన పరమాత్మ యీ భూలోకమున వలయు వస్తు సముదాయమును నుపకరణము లను ప్రసాదించెను.

అవిద్యావాసనచే జీవులు క్షణభంగురములైన తనువును, దారాపుత్రులను, ధన గృహ క్షేత్రములను, నిత్యము లని నమ్మి, యీ సంసార సముద్రమున నిమగ్నులై దరిఁ గానలేక జన్మ పరంపరలం బొరలుచుండు జీవుల నుద్ధరింపఁ జేయుటకొరకు తగు మార్గంబులైన పవిత్ర క్షేత్రములను సద్గురువులను ప్రసాదించెను. అట్టి సత్కర్మానుష్ఠానమునకు

వలయు నదీ పర్వతారామ క్షేత్రాదులను కల్పించెను. అందు
వలన జితేంద్రియులైన మహామునీంద్రులుకూడ తమ తప
స్సున కనువగునటుల పర్వత గుహాలయందును, నదీ తీరము
లందును, అరణ్యములయందును ఆశ్రమములను నిర్మించు
కొని తపంబు లొనరించుకొనుచుందురు అనగా యిట్టి నిర్మ
లోదకము లు నిర్జనారణ్యములును తపోయోగ్యములైన స్థలము
లని తెలుచున్నది. పెక్కు దేవాయతనములను, దేవతలును,
ఋషులును, సిద్ధులును, ప్రభువులును, తమ మనోనిశ్చలత
కొరకు తమ తమ యుపాస్యదైవతముల ప్రతీకము (విగ్ర
హము)లను ప్రతిష్ఠించుకొనిరి. ఇట్టి క్షేత్రములు మన భారత
వర్షమున పెక్కులు కలవు. కనుక దీనికి ధర్మక్షేత్రమని,
కర్మక్షేత్రమని పేరులు వెలసినవి. ఇట్టి ధర్మములను బోధిం
చుటకు తొలుత వేదములను పరమేష్ఠి పలికెను. శ్రుత్యుక్త
ధర్మములను విశదీకరించుచు, మను, యాజ్ఞవల్క్య, గౌతమ,
పరాశరాది మహర్షులు స్మృతులను రచించిరి. వాటిని
సులభముగా తెలిసికొనుటకును, ఆదరించుటకును వ్యాస
భగవానుడు అనేక పురాణేతిహాసములను బోధించి యనుగ్ర
హించిరి. పురాణములయందు మంత్రఖండమనియు, మహాత్మ్య
ఖండమనియు పురాణఖండమనియు మూడు ఖండములుగ
వివరింపబడినవి. ఇప్పుడు మనకు లభ్యములగు పురాణములు
యితిహాసఖండములు మాత్రమే. మంత్రమహాత్మ్యఖండముల
ముద్రితములుగనున్నవి. మహాత్మ్యఖండము నందు నదీ మహా
త్మ్యమును తత్తనదీ తీరస్థక్షేత్ర మహాత్మ్యములును వర్ణింప
బడియుండును. ఇల్లే మంత్రఖండములు గురూపదేశము ననుస

లబ్ధములగును. అందువలన నిందుదహరించు ప్రమాణముల ప్రమాణములు కావు ఖండత్రయాత్మకమైన పురాణములు తాళపత్ర ప్రతులు కలవు.

# కృష్ణానదీ జన్మ కధనము

"గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యాదికా స్తథా।
సహ్యపాదోద్భవానద్యః స్మృతాః పాపభయాపహాః॥"

అని విష్ణుపురాణమున సహ్యాద్రియందుఁ బుట్టిన నదులను వ్యాసభగవానుఁడు వర్ణించెను. శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మతో కలియుగ ధర్మములం జెప్పుచు, కలియుగము నందు జన్మించు జనులు అల్పాయుష్కులుగను, కర్మలయం దల్ప శ్రద్ధఁగలవారుగ నుందురు. కనుక వారికికూడ స్నాన దర్శనాదుల వలననే క్రతుకర్మానుష్ఠాన జన్యఫలములు కలుగు నట్లు, పవిత్రములును, సర్వపాపహార ప్రభావంతములు నగు సలిలములతోఁగూడిన నదీనదములను, పుణ్యహ్రదములను సృజింపుమనియు, తాను "కృష్ణా"నది నగుదునని యీశ్వరుని "వేణి"యగు నట్లాజ్ఞాపింతుననియు నానతిచ్చెను. భగవదనుజ్ఞ ననుసరించి బ్రహ్మయు, తీర్థస్నాన పానాదులచేతనే, దురిత క్షయ మొనర్పఁజాలు నిర్మలోదక పూరితంబులగు తీర్థంబులు కల నదులను పవిత్ర క్షేత్రంబులను పర్వతంబులను సృజించెను. సహ్యాద్రియొక్క ఉత్తరశృంగమున బ్రహ్మనారాయణునిఁ గూర్చి తపంబొనర్చెను. అందువలన దానికి "బ్రహ్మనగ" మని పేరు కలిగెను. అప్పుడు శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మ

దేవునికి "శ్వేతాశ్వద్థ" రూపమున ప్రత్యక్షమయ్యెను. ఇట్లు యీశ్వరునిఁ గూర్చి వేదములు మూర్తివంతములై సహ్యాగిరి దక్షిణ శృంగమున తపంబొనర్చెను. అప్పు డీశ్వరుఁడు "ఆమలకవృక్ష" (ఉశిరిచెట్టు) రూపమున సాక్షాత్కరించెను. కొంతకాలమునకు శ్వేతాశ్వద్థము జలమయమై ప్రవహింప మొదలిడెను. అందువలన దీనికి "కృష్ణా" యని పేరు కలిగెను. మరికొంతకాలమునకు ఆమలకవృక్ష రూపమున నిలసిన యీశ్వరుఁడు కూడ భగవదాసతి జలమయమై "వేణీ" యను పేరు వహించి తానుకూడ ప్రవహించి కృష్ణలోఁ గలిసెను. అందుచే నిది "కృష్ణవేణి" యను పేరుతో ప్రసిద్ధిఁగాంచినది. కనుకనే పురాణములలో "కృష్ణా కృష్ణాంగ సంభూతా" అనియు "కృష్ణా విష్ణు తనుస్సాక్షా ద్వేణీ దేవో మహేశ్వరః తయోస్సంగమోయత్రకోటి తీర్థసమాస్సృతం" అని నిర్వచింపఁబడినది. ఈ రెండును "సతారా" పట్టణమున కైదుమైళ్ళ దూరములో కలియుచున్నవి. అక్కడనుండి యేకముఖమై "కృష్ణవేణి" ప్రవహించు చున్నది. ఈ కృష్ణవేణియందు తుంగభద్ర, నారాయణి, కుముద్వతి, నైష్ణవి, విశాల, విజయ, కకుద్మతి, మలాపహారిణి, కౌశిక, భీమనది, అరుణ, భాస్కరి, మూసి, వైఘు, తామ్రపర్ణి యను యుపనదులు మరికొన్ని కలియుచున్నవి. ఈ నదిని గూర్చి మహాభారతములో "సదానిరామయాం కృష్ణాం మందగాం మందగామినీం" అని వ్యాసమహర్షి వర్ణించియుండెను. మరియు నీ నది యుత్కృష్టమైనదని యనేక పురాణములు నిర్వచించినవి. గంగానది విష్ణుపాదోద్భవి

యగుటచేతను, కృష్ణ "కృష్ణాంగసంభూతా" అనియు "విష్ణుతనుస్స్వరూపిణీ"ను ప్రమాణముల వలన విష్ణు శరీరమే యగుటచేతను, యితర నదులకంటె నివి యత్యంత ప్రభావతములైన వనుటకు సందేహము లేదు. మరియు నిది పశ్చిమ కనుమలనుండి పూర్వ (తూర్పుగా) వాహినిగా ప్రవహించి, యీ దుర్గాక్షేత్రమునుండి దక్షిణముగా "వ్యాఘ్రేశ్వరము" (పులిగడ్డ) వరకు వచ్చి, అచ్చటనుండి రెండు వాహినులుగా చీలి యొకటి తూర్పుగను, మరియొకటి దక్షిణముగ ప్రవహించెను. తూర్పుగా ప్రవహించిన పాయకు "కృష్ణా" అనియు, దక్షిణముగా ప్రవహించిన పాయకు "వేణి" యనియు పేర్లు. వేణి యింతవరకు అంతర్వాహినిగా నడచినది. తూర్పుగా ప్రవహించిన "కృష్ణాతరంగిణి" "ఉభయనాగేశ్వర క్షేత్రము" కడలుపురి, లేక కదళీపురము (పెదకళ్ళేపల్లి) వరకు తూర్పుగానడచి అక్కడనుండి తిరిగి ఉత్తరవాహినిగా "హంసలదీవి" వద్ద సాగరమున కలియుచున్నది. అందువలన దీనిని "కృష్ణా సాగర సంగమ" మందురు. ఇచ్చట గొప్ప గోపాలక్షేత్ర మొకటి కలదు.

ఇది స్వయంభువమని కృష్ణామహాత్మ్యమున పేర్కొనబడినది. ఇంక వేణి యను నది పులిగడ్డ నుండి దక్షిణాభిముఖముగా ప్రవహించి సముద్రమునం గలిసెను. వేణి తొలుత సంగమించిన స్థలమునకు "సంగమేశ్వరము"ని పేరు. ఇది శివక్షేత్రము. తరువాత యీ వేణి దక్షిణముగ "కోటిమొగ" అను గ్రామమువరకు ప్రవహించి, అచ్చట

మూడుపాయలై, మొదటి పాయ తిరిగి తూర్పుగా నచ్చి "గుల్లలమోద" అను గ్రామమునద్ద "Kistna Havelock Point" (కృష్ణాహేవ్ లాక్ పాయింటు) అనుస్థలమున కల దీపగృహము (Light House)వద్ద కలియుచున్నది. దీనికి 'గోలుముట్టు పాయ' లేక 'బల్లలేరు' అని పేరు. రెండవ పాయ "నాచుగుంట, ఈలచెట్ల దిబ్బ" లను గ్రామముల మధ్యగా ఆగ్నేయ దిక్కుగా ప్రవహించి సముద్రమునఁ గలియు చున్నది. దీనిని 'నడిమి యేరందురు'. ఇంక మూడవపాయ "లంకవేణి దిబ్బ" మీదుగా ప్రవహించి "చాపలమంజి" అను తావున "బీకన్" (Beacon) వద్ద కలసినది. ఇట్లు యిది మూడు పాయలుగా జడకుచ్చులవలె నుండుటచే దీనిని "వేణి" యను పేరుతో వ్యవహరించిరి. కనుక దీనికి 'త్రివేణీ సాగరసంగమము'ని పేరు. ఈ కృష్ణవేణీ నది శక్తి ప్రభావము లధికములని వేరే చెప్పనక్కర లేదు. అనగా యేనది ప్రవాహమునకు యెదురు నడుచునో దానిశక్తి అధికము. అట్లు అన్ని నదులను ప్రవహింప నేరవు. శ్రీ విష్ణు పాదోద్భవి యగుటచే గంగానదియు సాక్షాద్విష్ణు తనూద్భవి యగుటచే నీ కృష్ణానదియు తప్ప మిగిలిన యేనదులకు నిట్టి శక్తి ప్రభావములు లేవు. స్కాందము సహ్యాద్రిఖండము అష్టాదశోధ్యాయమున "కృష్ణామహాత్మ్యము" నుఁ గూర్చి ఋష్యాదులు, 'కృష్ణామహాత్మ్యమతులం శ్రోతుమిచ్ఛామ హేవయం' అని నారద మహర్షిని యడిగినట్లును; 'శృణ్వంతుమున యస్సర్వే కృష్ణా మహాత్మ్యం చోత్తమం' అని ప్రారంభించి 'స్నానం దానం జపోహోమ స్స్వాధ్యాయః

పితృతర్పణం యఃవమాత్రింతు మోక్షుర్యాదనంతం ఫలమ
శ్నుతే' అని నారదు డుపదేశించినట్లును కలదు. మరియు
కొన్ని నదులు తమ శక్తి ప్రభావములను కొంత కాలము
మునకు కోలుపోవు నియు, యీ కృష్ణానది మాత్రము కేవ
లము హరిహరాత్మకమైన దగుటచే అన్ని నదులవలెఁగాక.
తన ప్రభావమును విడునకపోగా యితర నదుల శక్తినిఁగూడ
తానే గ్రహించి ప్రవర్ధమాన మగుచుండునని 'కతాకృష్ణే
వాఽవశిష్యతే' అను పురాణోక్తి వలన తెలియుచున్నది.
ఈ నదీ జలముల కిట్టి ప్రభావముండునా? అను సందియము
పాఠకులకు కలుగవచ్చును. నదీ సలిలముల కిట్టి ప్రభావ
మున్నదన్నప్పుడు పరిహసించిన పాశ్చాత్య దేశస్థులు కొంద
రును, ఆర్యావర్తమున కూడ పాశ్చాత్య విద్యా విజ్ఞాన
వేత్తలు కొందరును కలరు. కాని సుమారు పదిహేను
సంవత్సరముల క్రిందట కలకత్తా 'ట్రాపికల్ మెడికల్
కాలేజీ' (Tropical Medical Collage) లో, పాశ్చాత్య
ప్రకృతి శాస్త్రవేత్తలును, రసాయన శాస్త్ర కోవిదులును,
పదార్థవిజ్ఞాన శాస్త్ర పండితులును పలువురు "గంగానదీ
నీరము"ను తెప్పించి,దానియందుఅనేకవిధములైన విషక్రిము
లను వేసి పరీక్షించిరి. ఆ క్రిములన్నియు నశించిపోయినవి.
ఆ నీరు చూచుటకెంత కలుషముగ కన్పించుచున్నను. ఆ
నీటియందు ఆరోగ్యమునకుఁ జెరుపుఁగల పురుగులేమియు లేవ
నియు, మనము వేసినను అట్టి విష క్రిములు బ్రతుకఁజాల
వనియు నిర్ణయించిరి. మరియు దీని మహాత్మ్య మెన్నియో

యుగములకు పూర్వమే మన భారతీయులు కనుఁగొని, ఈ
నది మహాపవిత్రమైనదనియు, సర్వక్రిమి సంహారమును,
సర్వరోగహర సమర్థమునై యున్నదని పురాణములయందు
వ్రాసియున్నారు. ఇందుకు పాశ్చాత్య ప్రకృతి రసాయన
శాస్త్ర పండితులు ఆశ్చర్యమొంది యిట్టి పరమపవిత్రమైన
నది జలములకు పావనమని తలచు సనాతన ధర్మ నిరతులను
మన మూర్ఖపింప రాదనియు, వారెన్నడో ఈ తీర్థమహిమను
గుర్తించిరనియు, మనము వారిని మూర్ఖులనుకొనుట, మన
మూర్ఖత్వమును వెల్లడిపఱచుకొనుట యగుననియు,
"మాంచెస్టరు గార్డియను" (Manchester Gardian) యను
పత్రికలో ప్రకటించిరి. దీని యనువాదము 1932 సంవత్సరం
మే నెల 5 వ తేదీన వెలువడిన 'హిందు' పత్రికలో ప్రక
టింపఁ బడినది. యిట్టి పుణ్య నదులలో "కృష్ణవేణి"
యొకటి.

## తీర్థములు - క్షేత్రములు

ఈ నదికి జన్మస్థానము పడమటి కనుమలలోని సహ్య
గిరి. దీని తీరమున అనేక తీర్థములును, క్షేత్రములును కలవు
తీర్థములనగా, దేవతలచేతను ఋషీశ్వరులచేతను, సిద్ధుల
చేతను, ఆర్యులచేతను, తపస్సు చేయబడి తత్తపఃఫలమును
ఆయా ఘట్టములు గల తీరములందు ధారాగ్రహీతము
చేయఁబడుటచేతను, వారి సాన్నిధ్యము వలనను నిత్యపావనము
కలిగి మహిమాన్వితములైన నదీతీర ఘట్టములు. క్షేత్రము
లనగా సిద్ధ దేవతాదులచేతను, ప్రభువులచేతను, తాను తమ
ఉపాస్యదైవతములను ప్రతిష్ఠింపబడిన దేవాయతనములు.

ఇట్టి వెన్నియో యీ నది యిరుపార్శ్వములను గలవు. కృష్ణా తీరమున గల తీర్థములు 60.

1. అనంత
2. అష్టతీర్థ
3. అఘహారి
4. అమరజ
5. ఆమలక
6. ఆదిత్య
7. ఇంద్ర
8 కకుద్మిని
9. కంక
10. కర్కోటక
11. కుబ్జేశ్వర
12. కులతారక
13. కౌశికి
14. క్రౌంచ
15. కూర్మ
16. చక్ర
17. జంబు
18. జాతిస్మర
19. పౌలస్త్య
20. ఫల్గున
21. పాతాళగంగ
22. బ్రహ్మ
23. భాంత
24. భైరవ
25. త్రిశూల
26. నారాయణ
27. నిర్జర
28. మధు
29. మహాతీర్థ
30. మార్కండేయ
31. మలాపహారిణి
32. మునితీర్థ
33. ముక్తితీర్థ
34. మూర్తిదర్శన
35. దుర్గా
36. యజ్ఞవాట
37. రుణాపహారణ
38. నృసింహ
39. లింగతటి
40. విష్ణు
41. రుద్ర
42. విశాల

కాని యతఁడు వినిపించుకొనలేదు. విఘ్నేశ్వరుఁడు శివ లింగమును యచ్చట పాదుకొల్పెను. అంత రావణుఁడు వచ్చి జరిగిన యుదంతమును తెలిసికొని తన బలమునంతయు వినియోగించి యా లింగమును పెకలింప ప్రయత్నించెను. అప్పుడా లింగము గోకర్ణాకృతిగ సాగెను. అందువలన దీనికి "గోకర్ణక్షేత్ర"మని పేరు కలిగెను. రావణుఁ డతి బలమును యుపయోగించుటచేత "మహాబలేశ్వర" మనికూడ పేరు కలిగినది. నరహరిపురము (నర్సోవాడా) గాణుగాపురము (కుంకడ్డి ప్రదేశము) ఇవి దత్తాత్రేయ అవతార స్థలము. శ్రీశైలము, మల్లిఖార్జున క్షేత్రము ఇక్కడ దేవేరి భ్రమరాంబ "శ్రీశైల శిఖరందృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అను ఆర్యోక్తి కలదు. ఇది త్రిలింగదేశ సరిహద్దులలో పశ్చిమ సరిహద్దుగా చరిత్రకారులచే పరిగణింపఁబడినది. మున్ను బౌద్ధారామముగ నుండెడిది. వీరశైవులకాలమున మార్చఁ బడినది. ముక్త్యాల (ముక్తిపురక్షేత్రము) వేదాద్రి, జగ్గయ్యపేట సమీపమునఁ గలదు. యోగనారసింహక్షేత్రము సాలిగ్రామశిల. కృష్ణలో నుండును. పిశాచగ్రస్తులు పెక్కండ్రు యీ స్వామిని సేవించి స్వస్థులగుచున్నారు. అమరావతి పంచారామములలో నొకటి. అమృతలింగఖండము దేవేంద్రునిచే ప్రతిష్ఠింపఁబడినది. దీనినే "అమరారామ" మందురు. పూర్వము బౌద్ధకేంద్రము. అపూర్వములైన చిత్రములు శిలలపై చెక్కఁబడి యున్నవి. శ్రీ కనకదుర్గాక్షేత్రము బెజవాడ. ఈమె పూసపాటివారి యిలువేల్పు. ఇంద్రకీలాద్రిపై నెలకొన్నది. సీతానగరం హనుమంతక్షేత్రము. ఉండవల్లి

రూపమును ధరించెను. అంతట దుర్గాదేవి అధివసించెను. ఇదియే యింద్రకీలాద్రి. ఇది నృసింహ క్షేత్రమైన 'మంగళ గిరి' వరకు వ్యాపించి యుండెను.

## కనకదుర్గ - బ్రహ్మచారిణి

శ్రీ కనకదుర్గాదేవి యవతార కథనమును గురించి. దేవాసురయుద్ధమున, దేవతలు జయముగాంచిన తరువాత యీ జయమునకు తమ పరాక్రమే కారణమని తలచి, దేవతలు మూలకారణమగు పరాశక్తిని గురించి మరచి ప్రగల్భములు పలుకుచుండగ నా పరాంబిక వారలనుగాంచి వీరు ప్రమత్తులై నన్ను మరచిరి. కనుక వీరికి తిరిగి పరాభవమును జేకూర్చినగాని జ్ఞానోదయము కలుగనేరదని తానొక యక్షాంగన రూపమును ధరించి వారిని పరాభవించెను. నంత యింద్రాది దేవతలు, యుద్ధమున తమకు గలిగిన జయమును, యక్షాంగన వలన తమకు గలిగిన పరాభవమును తలచుకొని యీచర్యయీ పరమేశ్వరి విలాసమని గ్రహించి, యామెను అనేక విధముల స్తోత్రములను జేసిరి. అప్పుడు వారికి పరాశక్తి హైమవతీ రూపమున ప్రత్యక్షమయ్యెను. అంత దేవతలందరు సంతసమంది 'తస్మిన్నేవాకాశస్త్రియ మాజగామ । బహు శోభ మానాముమాం హైమవతీం' అని పలికిరి. ఇచట దుర్గకు "ఉమా - హైమవతీ" శబ్దములు ప్రయోగింపబడినవి. అందువలన యీమెకు 'కనకదుర్గా'భిధానము కలిగినదని దేవీ భాగవత

మునఁ గలదు. ఇది దుర్గా ప్రధానమయిన క్షేత్రము. దుర్గ అనగా పార్వతియే. ఈమె యీశ్వరుని యిచ్ఛాశక్తి. ఈమెను 'మహామాయ' యని కూడ యందురు. ఈమె దేశమున కొక పేరుతో పూజింపఁబడుచున్నది. మొత్తము మీద ఈశక్తి పూజను హిమవత్పర్వతములోని 'కైలాస నాధము' నుండి 'కన్యాకుమారి' అగ్రమువరకును అన్నిమత ములవారు నంగీకరించి కొలుచుచునే యున్నారు. యెవరు ఏ పేరుతో పిలచినను శాంకరికి 'దుర్గా' నామమన్వర్థమైనది. "దుర్గ" అనగా రక్షించు శక్తి కలది అని అర్థము. ఈమె 'దుర్గము'వలె భక్తుల కనపాయియై కాచియుండుశక్తి కలద గుటచేతనే ఈమెకీపేరు ప్రియమైనది. ఇట్టి రక్షణశక్తి కలవ గుటచేతనే కోటలకు దుర్గములని పేరు. 'దుఃఖేనాపి-గంతుం-అశక్యా - దుర్గా' అని విగ్రహము. అనగా అతికష్టముచేత గాడా పొందుటకు సాధ్యముకాని శక్తి కలదని అర్థము. దుర్గా పీఠములు నూట ఎనిమిది యున్నట్లు శాక్తేయ తంత్ర ములందు వర్ణింపఁబడి యున్నవి కాని అందు పదునెనిమిది పీఠములు మాత్రమే ముఖ్యములని తంత్రకారులు పేర్కొ నిరి. ఆ పదునెనిమిదింటిలో అమ్మవారి నయశ్చర్యా భేద ముల ననుసరించి ఋష్యాదులును, యుపాసకులును పలు నామముల స్తుతించి యుండిరి. అందు రౌద్రాంశమున విల సిల్లు మూర్తికే 'దుర్గ' యని పేరు. ఈ జగన్మాత మన భారతదేశమునకే దుర్గమువలె నలునైపులను వెలసి కాపాడు చున్నది. తూర్పుదిశను 'జగన్నాథ క్షేత్ర' (Puri) మునకు సమీపమున 'భువనేశ్వరి' అనియు, దక్షిణదేశమున, కన్యా

కుమారి యగ్రమున 'కౌమారి' అనియు, పశ్చిమమున, బృందావనమందు 'రాధాదుర్గ' అనియు, ఉత్తర దిక్కున హిమాచల ప్రదేశమున 'హైమవతీ' అనియు, వెలసి యున్నది. అష్టాదశ దుర్గలలోను తొమ్మిది బాల దుర్గలు, తొమ్మిది ప్రౌఢ దుర్గలు, ద్వివర్ష బాల మొదలు దశవర్ష బాల పర్యంతము 'కౌమారి, బాలత్రిపురసుందరి కల్యాణి కామాక్షి, ఉమా, మీనాక్షీ, సుభద్రా, సతీదేవి,' అని పేరులు. ఇంక ఉత్తర (ప్రౌఢ) దుర్గలను గురించి శాస్త్రీయ తంత్రములందు, ప్రథమం శైల పుత్రీతి — ద్వితీయం బ్రహ్మచారిణీ.

తృతీయంచంద్రఘంటేతి - కూష్మాండేతి చతుర్థకం
పంచమంస్కందమాతేతి - షష్టం కాత్యాయనీతి చ
సప్తమం కాళరాత్రిశ్చ - మహాగౌరీతిచాష్టమం
నవమంసిద్ధిదాప్రోక్తా - నవదుర్గాః ప్రకీర్తితాః ॥

అని నవదుర్గలను పేర్కొనిరి. ఇందీమె రెండవది. ఈమె పేరు 'బ్రహ్మచారిణీ దుర్గ' ఇంక నిట్లు, 'స్థల దుర్గ, నదీ దుర్గ, వన దుర్గ, పర్వత దుర్గ, సాగర దుర్గ, గ్రామ దుర్గ, పట్టణ దుర్గ, రణ దుర్గ, ఛండీ దుర్గ, శూలినిదుర్గ,' అని సేవింపఁబడుచున్నదనియును, యెచ్చట రక్షణ వ్యాపారము జరుపుశక్తి కలిగియున్నదో అది అంతయు దుర్గా స్వరూపమేయనియు, ఇందువలన నీమె జగద్రక్షకత్వము, జగద్వ్యాపకత్వము, జగన్మాతృత్వము ప్రకటనమగుచున్నదనియు,

"దేవీభాగవతము" లోను, "దేవి దుర్గాసప్తశతి" లోను నిర్వచింపఁబడినది. వెండియు నీమెను, హిమాచల ప్రదేశమున "హైమవతి" యనియు, కాశ్మీరమున "శైలపుత్రి" అనియు, వంగదేశమున "కాళి"యనియు, గయాక్షేత్రమున "గౌరి"యనియు, వారణాసిని "విశాలాక్షి"యనియు, హరిద్వారమున "మహామాయ" యనియు, ఉజ్జయినీనగరమున "ఓంకారి" యనియు, గుజరాతులో "జోగీశ్వరి" యనియు, ఉత్కళమున "వారాహి" యనియు, మహారాష్ట్ర దేశమున "వింధ్యవాసిని" యనియు, పశ్చిమమున బృందావనమున "రాధ"యనియు, ఆంధ్రదేశమున "భ్రమరాంబ"యనియు, కర్ణాటకదేశమున "చాముండేశ్వరి" యనియు, దక్షిణమున "కామాక్షి" యనియు, మళయాళ దేశమున "భగవతి" యనియు, మధురక్షేత్రమున "మీనాక్షి" యనియు, కన్యాకుమారి అగ్రమున "కుమారి" యను నామములతో విరాజిల్లుచున్నది. ఇందు సుందరమూర్తికి "బాల, త్రిపురసుందరి, మీనాక్షి, కామాక్షి, జ్ఞానప్రసూనాంబ" మున్నగు లలిత నామములతో ఉపాసకులు యుపాసింతురు. "లలిత" అనునది కూడ ఆమె కొక పేరు. మరియు నీ జగదీశ్వరి యీ లోకమున నేగాక వేదవదనమందు "గాయత్రి"గను దేవలోకమున "ఇంద్రాణి"గను "బ్రహ్మలోకమున "సరస్వతి"గను సూర్యబింబమున "ప్రభాదేవి" గను, శివసాన్నిధ్యమున "పార్వతి" గను, వసిష్ఠాశ్రమమున "అరుంధతీసతి" గను, సప్తమాతృకలలో "వైష్ణవి" గాను పూజింపఁబడుచున్నది. ఈ దుర్గాదేవిని గూర్చి

"దుర్గమోనామదనుజో - ఆసీద్వైలోక కంటకః
దేవప్రార్థనయా దేవీ - దుర్గమం నిజఘానహ
తదాతత్తేజసావ్యాప్తం దదృశుః కనకప్రభం
దేవాస్సర్వేస్తుతిం చక్రుస్సర్వోప నిషదాంగకైః
దేవీం కనకదుర్గేతి ముదాతుష్టీవు రాదరాత్"

అని సహ్యాద్రి ఖండములోనే వర్ణించిరి. ఇందువలన లోక కంటకుండైన దుర్గమాసురుని దేవతల ప్రార్థనచే దేవి సంహరించినట్లును అప్పుడామె తేజస్సు బంగారము వలె వ్యాప్తము కాగా దేవతలందరు ఉపనిషత్తులతో "కనక దుర్గా" యని స్తుతించినట్లును, తెలియుచున్నది. మరియు నీ యింద్రకీలాద్రి స్వర్ణగర్భయనియు, దాని నధిష్టించి యుండుటచే, నీ దుర్గ కూడ స్వర్ణమయియైనట్లు

"తంకీలాద్రింస్వర్ణమయం తద్రూపాం జగదంబికాం
ఇంద్రాదిదేవసం సేవ్యాం తదగ్రె దివ్యరూపిణీం"

అను ప్రయోగమువలన తెలియుచున్నది. ఇందువలన యీమె "కనకదుర్గ" యైనట్లు స్పష్టమగుచున్నది. తరువాత "మాధవవర్మ" అనురాజు రాజ్యము చేయుచున్నప్పుడు, తనకుమారుడొక "తెలికుల" బాలకుని చంపినట్లును, ప్రభువు తన కుమారుడొనర్చిన హత్యానేరమునకు మరణ దండనము విధించినట్లును అందుకా దుర్గాదేవి రాజు ధర్మ నిరతికి మెచ్చి, చినుకుకు చిన్నమునంతున కనకవర్షమును

నా బాలకులమీద కురిపించినట్లును, నంత నా బాలకు రు పురు సజీవులై రనియు, అది మొదలు యీ దేవికి "కనకదుర్గ" నామము సార్థకమైనదనియు నొక యైతిహ్యము కలదు. ఈమెకు నివాసమగుకతన నీ పురమునకును "కనకపురి, కనక వాడ" లను పేరులు కలిగిన ట్లొక శాసనములోఁ గలదు ఇంద్రకీలుఁడు కోరిన వరమును సఫల మొనర్చుటకు దేవ, ఋషి, సిద్ధ, గంధర్వాది బృందములయొక్క ప్రార్థన మంగీక రించి పరదేవియైన దుర్గాంబిక మహిషాసురుని సంహరించు టకు ధరించిన రూపముతోనే యీ పర్వత హృదయపీఠమం దధివసించెను.

## శ్రీ దుర్గాదేవి వర్ణనము - ఆదిశంకరులు

ధృవమూర్తి స్వయంభువమైనది. అతిభీషణమైన విగ్రహము. అష్టభుజములు కలిగి 'అరి, శంఖ, ఖేట, శూల, పాశ, అంకుశ, మార్గి, సాయకము'లను అష్టవిధ ఆయుధ ములను ధరించి యుండెను. సింహావాహనా రూఢయై, మహిషాసురుని తలపై శూలముతో పొడుచుచున్న వైఖరి తోచుచుండెను. స్వరూపధ్యానమున

'అరిశంఖ ఖేట శూలక పాశాంకుశమార్గి సాయకాన్ దధతీన్ సింహ స్కంధాగ్నిశిఖాం దుర్గాం దేవీం ప్రపద్య ఇహ శరణమ్.'

అని వర్ణింపఁబడినది. ఇందు 'అగ్నిశిఖాం' అనుటకు కారణము దేవి పరమేశ్వరుని అర్ధశరీరము నాక్రమించు

కొనియు, నాఁటితో తృప్తిపడక యీశ్వరుని దక్షిణపార్శ్వ మునుఁగూడ తన రక్తాంత నేత్రములతో చూచుసరికి, తన మూర్తియంతయు, అరుణోదయరాగ శోభతో వెలుఁగుచు 'తామగ్నివర్ణాం తపసాజ్వలంతిం' అను ఉపనిషద్వాక్యమును సార్థకపర్చుచు అగ్నివర్ణముఁగలిగి భక్తులు చూచుటకు కూడ వీలులేక అతిభయంకరముగ నుండెడిదట. ఆమె దృష్టికి యెదురుగ నెవ్వరయినను వచ్చినచో వారు చచ్చి పోయెడివారట. ఆదిశంకరాచార్యులు వారీక్షేత్ర దర్శనము నకు వచ్చినప్పుడీయు దంతమును విని యీయామె యెప్పుడిటు లనే యున్నచో కలియుగమున నల్పమనస్కులయిన మాన వులు పూజాదులొనర్చుటకు వీలు వుండనేరదనియు, ఆమెను దర్శింపఁగోరు భక్తవరుల కట్టి యభీష్టము నెరవేరదనియూ తలచియు నీమె బ్రహ్మచారిణి యగుటచే నింత తీక్ష్ణమూర్తిగ నున్నదని గ్రహించి, ఆమె దృష్టిని తగ్గించుటకు శాంతి యంత్రమునుఁ జెక్కించి అమ్మవారికి వామపార్శ్వమున ముందుగ ప్రతిష్ఠించిరి. దీనికి 'శ్రీచక్ర' మనియు 'మేరు చక్రమ' నియు పేర్లు. అప్పటి నుండియు భక్తులకు దుర్ని రీక్ష్యగా నుండు యీయామె తీక్షత (రౌద్రము) తగ్గి భక్తులకు వికసన్ముఖోల్లాసినియై, మందస్మిత వదనారవిందయై కనపడు చున్నది. ఈ దుర్గాదేవి పామరులకు పాషాణాకృతిగ కన్పిం చినను తన్ను పాసించు భక్తులకు స్వర్ణాకృతితో దర్శన మిచ్చుచుండునట. ఇట్లు యీయామె స్వర్ణమయ మూర్తిని దర్శనము చేసినవారు పెక్కురుకలరు. ఇంకొక విశేషమేమన శ్రీ విద్యోపాసకులకు మంత్ర శాస్త్రమునఁగాని, అనుష్ఠాన

మునఁగాని వారికేమైన సందేహములు కలిగిన యెడల వారొక రాత్రి దేవిని దర్శించి కొండపై పరుండినచో తల్లి స్వప్నమున దర్శనమిచ్చి వారి సందేహములు తీర్చి పంపుచుండునట. ఇట్లిప్పటికిని జరుగుచున్నదనియు, తనకట్టి సందేహ నివృత్తి చేసినదనియు, బ్రహ్మీభూతులగు శ్రీ కళ్యాణానంద భారతీ స్వాములవారు యొకపరి సభలో దేవిని గురించి యుపన్యసించుచు చెప్పిరి. మరియు దుర్గకు వామభాగమున నొక చిన్న గణపతి విగ్రహము కలదు. ఇది సుమారు 9 అంగుళముల యెత్తు కలిగి అతి లావణ్యముతో నొప్పారు చున్నది. ఇది లక్ష్మీ గణపతి 'విగ్రహమందురు.'

## మల్లేశ్వరుఁడు - బ్రహ్మప్రతిష్ఠ

యీ మల్లేశ్వరుని గూర్చి స్కాందమున బ్రహ్మ యీశ్వరుని గురించి తపంబొనర్చుటయేఁగాక యీశ్వరునికి ప్రీతిగ శతాశ్వమేధములను చేసినట్లును, ఆ పరమ శివుఁడు మెచ్చి జ్యోతిర్లింగ రూపమున బ్రహ్మకు దర్శన మిచ్చి బ్రహ్మలోకము నొసంగెననియు నావిధాత యాలింగమును మల్లి కదంబక పుష్పములచే నర్చించెననియు నందువలన 'మల్లికేశుఁడ'ని చెప్పఁబడుచున్నదని స్కాంద పురాయణములో నిట్లుకలదు.

'జ్యోతిర్లింగ స్వరూపేణ బభౌస ర్వేశ్వరశ్శివః
తివాతంపూజ యామాసదేవం మల్లికదంబకైః

దర్శనం బ్రహ్మణే దత్వా బ్రహ్మలోకం దదౌశివః
తదాప్రభృతి దేవేశం మల్లికేశం వదంతిహి॥'

ఇందువలన నిక్కడ అనాదిగనే బ్రహ్మచే ప్రతిష్ఠిత మగు లింగమున్నట్లును. ఆ దేవుని పేరు 'మల్లికేశలింగమే' నియు తెలియుచున్నది అది కాలవశమున అంతర్హితమై యున్నది. ఈ విషయమును శ్రీ శంకర భగవత్పాదుల వారు గ్రహించి, అమ్మవారొంటరిగ నుండుట యీ దేశ మునకు క్షేమదాయకముకాదని నిరూపించి, ఈ అమ్మవారి దేవాలయమునకు, ఉత్తరపు ప్రక్క మల్లికేశుని ప్రతిష్ఠించిరి అప్పుడు అమ్మవారి ఉత్సవ విగ్రహమును తీసుకొని వచ్చి యిచ్చటనే ప్రతిష్ఠించి కళ్యాణ మొనర్చిరి. అప్పటి నుండియు ప్రతి సంవత్సరము చైత్రశుద్ధ పౌర్ణమికి యిక్కడ దుర్గామల్లి కేశులకు వసంత కళ్యాణము పంచాహ్నిక దీక్షతో జరుప బడుచున్నది. ఇదియే అమ్మవారికి బ్రహ్మోత్సవము. వసంతఋతువులో జరిగించుటచే దీనికి వసంత కల్యాణమని పేరు. అప్పటినుంచియు కౌతుకబేరముతప్ప అమ్మవారి కోవెలలో ఉత్సవబేరములుంచు యాచారము లేదు. ఈ మల్లికేశ్వరుండే ఈ క్షేత్ర పాలకుడు. ఇచ్చట దేవీ యాల యము దక్షిణ భాగమునందును, ఈశ్వరాలయము వామ భాగమునందును నుండుటచే నిది శక్తి ప్రాధాన్యమైన క్షేత్ర మని చెప్పెదరు. ఇటీవల యీ ఆలయమునకు మంటప ప్రాకారాదులను కొండక్రిందికి మెట్లును కట్టింపబడి జీర్ణోద్ధర ణముం గావింపబడినది.

# విజయుఁడు - విజయేశ్వరుఁడు

ద్వాపరయుగమున అర్జునుఁడు పాశుపతము కొరకు ఈశ్వరునిఁగూర్చి తపంబొనరించుచునట్లును (అట్టిస్థలమున నొక మంటపము కలదు.) అతని తపశ్శక్తికి మెచ్చి ఈశ్వరుఁడు వరమును ప్రసాదింప కిరాతవేషమునరాగా వానితో నర్జునుఁడు పోరిగెలిచి పాశుపతాస్త్రమును సంపాదించెను. అందుకు పరమేశ్వరుఁడు మెచ్చి బ్రహ్మాస్త్రమైన పాశుపతము నిచ్చిన దేఁగాక నీవు నన్ను పోరున జయించితివి కాన నీ విజయ చిహ్నముగా నీ నగరమునకు "విజయపురి" యను పేరు వెలయుఁగాక అని వరమిచ్చి అంతర్ధాన మయ్యెను. అట్లు అర్జునుఁడు విజయమును సాధించుటచే 'విజయుఁడ'ను పేరు సార్థక పఱచుకొనుట కేఁగాక నా పరమేశ్వరుని వాత్సల్య మున కచ్చెరువంది తచ్చిహ్నముగ అమ్మవారి గుడికి దక్షిణ భాగమున, యిప్పుడు యింద్రకీలాద్రికి దక్షిణపు వైపున నొక శివాలయమును కట్టించి ప్రతిష్ఠించెను. ఇది విజయునిచే ప్రతిష్ఠింపఁబడుటవలన 'విజయేశ్వరుడ'ని పేరు. మరియు దేవేరియైన దుర్గా కటాక్షముననే పాశుపతాస్త్రము లభ్యమైనదని తలచి అర్జునుఁడీ అమ్మవారికి 'బ్రహ్మాస్త్రేశ్వరి' అని పేరుపెట్టుకొనెను. ఈ దేవాలయము కొండలో పూడిపోయి, యిటీవల ప్రభుత్వమువారు పగులకొట్టుచుండగా కానిపించి నది. దీనిని పండిత వేమూరి శ్రీ రామశాస్త్రిగారి ప్రోత్సాహమున యుదార పురుషులు జీర్ణోద్ధరణమునుఁ గావించిరి. ఇప్పుడీ కథను బోధించు 'కిరాతార్జునీయ ఘట్టము'ను దుర్గా

అమ్మవారి ఆలయమునకు యుత్తర భాగమున సుధా విగ్రహ ములతో నిర్మించిరి.

## దుర్గా కుండము - చింతామణి దుర్గ

అమ్మవారి కభిముఖముగ ఆ జనేయాలయము కలదు. దుర్గాలయమునకు పశ్చిమమున చిన్న సరస్సు కలదు. దీనికి దుర్గా కుండమని పేరు. దీనినే చీకటి కోనేరందురు. ఇందెప్పుడును జలముండును. దీని మధ్య భాగమున ఉన్న గుంట కలదు. ఇది యేకాలములోను యెండదు. దీనికి కారణము దీనిలో నొక యంత్రము పూర్వులచే ప్రతిష్ఠింపఁబడినది. ఇది వరుణ యంత్రమని పెద్దలు చెప్పుదురు. ఈ సరస్సుకు శ్రీ మల్లాది వెంకట సుబ్బారాయుఁడు శాస్త్రిగారు మెట్లు కట్టించిరి. దీనికి దక్షిణమున మరియొక చిన్న సరస్సు కలదు. దీనికి 'అంబాకుండమ'ని పేరు. ఈ సరోవరములో దక్షిణ భాగమున నొక గుహకలదు. ఈ గుహకు పశ్చిమమున 'తూర్కరాజు' చెక్కించిన శాసనము కలదు. దీని సమీపమున చిన్న దుర్గా విగ్రహము కలదు. దీనికి 'చింతామణి దుర్గ' యని పేరు. ఇక్కడనే పూర్వమొక శివలింగముకూడ యుండెడిదనివాడుకకలదు. నేడు అది కానరాదు. పూర్వము నైజాము ప్రభువువద్ద 'అక్కన్న, మాదన్న'లను బ్రాహ్మణ సోదరు లిరువురు మంత్రిదండ నాయకులుగ నుండిరి. వీరు దుర్గా దర్శనమునకు వచ్చి, కృష్ణాస్నానముఁజేసి శ్రాద్ధాదులచే పితరులం దృప్తులం గావించి, శ్రీ దుర్గాదేవికి పూజా

దలోంకర్పి బ్రాహ్మణ సమారాధనలు చేసినట్లు చరిత్ర సాధనములు కలవు. వారిచే కట్టింపబడిన కట్టడము లను 'అక్కన్న మాదన్న చావడు'లందురు. వారందు వసించెడివారని వినికిడి. ఆలయమునకు దక్షిణమున పెద్ద నాగుపుట్టకలదు. ఇందు నాగేంద్రుడుండును.

## మల్లిఖార్జునుడు – భ్రమరాంబిక

ఈ మల్లిఖార్జునాలయము బజారులో కలదు. కనుక దీనిని బజారు శివాలయమందురు. ఇదియు నతిప్రాచీనమైనది. ఇందు అనేక శిలాశాసనములు రాతి స్థంభములపై చెక్కబడి యున్నవి. మరికొన్ని శాసన స్థంభములు మంటపమున వదిలవరుపబడి యున్నవి. ఈ ఆలయమున నూతనముగా శ్రీవెంకటేశ్వర శ్రీరామచంద్ర, నృసింహ, గోపాలాలయములు ప్రతిష్టింపబడినవి. ఇచట ప్రతి శివరాత్రికి గొప్ప కళ్యాణోత్సవము జరుగు చుండును.

## మొగల్‌రాజపురం - ధనపుకొట్లు

బెజవాడకు తూర్పుగనున్న 'మొగల్‌రాజపురము' కొండమీద మూడు గుహద్వారములు మూసినట్లు కనపడు చుండును. అవి దుర్గాదేవి దృష్టికి యెదురుగనున్నవి. ఇవి అమ్మవారి ధనపుకొట్లు అనియు, అమ్మవారిదృష్టి ఆ కొట్ల

మీాదకు కలదనియు ప్రతీతి. ఈ కొండక్రింద మూడు గుహలును, వానిముందు కొండలో మూడు మంటపము లున్నూ కలవు. ఇవి పూర్వము బౌద్ధ సన్యాసులు వసించు టకు నిర్మింపఁబడిన మఠములుగా తోచుచున్నది

## ప్రతాపరుద్రుఁడు - కళ్లేపల్లి కైఫీయతు

ఓరుగంటి ప్రతాపరుద్రుఁడీ యమ్మవారి దర్శనము నకుఁ వచ్చినపుడు, యీ దేవాలయము శాక్తేయుల స్వాధీన మై ఆదిశంకరాచార్యులవారు స్థాపించిన యంత్రముల యా చారములకు విరుద్ధముగా నరబలు లిప్పించుట మాచి సహిం పక చింతించి, పండితులను విచారించగ నిట్టి వామాచార మును మాన్చుటకు తమ వశముఁగాదని చెప్పిరట. అప్పుడు చల్లపల్లి సంస్థానాధీశులకు కబురుపంపగా పెద అంకినీడ్రప్రభువు, కళ్ళేపల్లిలో శ్రీ దుర్గానాగేశ్వరస్వామి కోనెలలో అర్చకు లును, పూర్ణ మంత్ర దీక్షాపరులగు బుద్ధు ఉమాపతి, ఛలపతి గార్లను సోదరులను పంపెనట. వారు తిరిగి శాంతి యంత్రములఁ బ్రతిష్టించి పైన చెప్పిన వైదుకార్చన విధాన మును నిలిపిరట. ఈ విషయమును మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోని లోకల్ రికార్డ్సు మెకాంజి (Mecanjee) కలక్షన్సులో నున్నదని, మా గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "కళ్ళేపల్లి కైఫీయతు" లో వ్రాసిరి. ఈ బుద్ధు సోదరద్వయము, తాము యుపాసన కొరకు కాశీనుంచి తెచ్చుకొనిన విశ్వనాథ లింగమును

పర్వతపాదమున ప్రతిష్ఠించి యుండిరి. అదియే బ్రాహ్మణ వీధిలో బుద్ధువారి శివాలయమని నేటికిని ప్రసిద్ధిగ నున్నది.

మరియు నీ ఉమాపతి శాస్త్రిగారి యుపాసనకు యీ తల్లి ప్రత్యక్షమై నీకు నా దక్షిణభుజమును యిచ్చుచున్నాను. దీనిని మీరు మీ వంశ పరంపరా కొలుచుచుండుడు. నా దక్షిణ బాహువునకు నేను చెప్పిన ఓషధరాజమును తెచ్చి యా రసమును పూయుము. తిరిగి సంజీవకరణి సాదృశ్యమున నా భుజము మొలుచునని చెప్పి యామె దక్షిణ బాహువు యొక్క శకలమును నా భక్తుని కొసంగెనట. వారును ఆ దేవి యానతిని యామెను మెప్పించి, ఆ యోషధీరసమును మంచిగంధమున కలిపి పూయగా నామె శిలావిగ్రహము సర్వాంగసుందరమై యథాతథముగా నుండెనట. అంత నా యుపాసకుండా బాహుశకలమునుం గైకొని, పెద కళ్లేపల్లికిం జని దానిని తమ దేవతార్చనమునందుంచి పూజించుకొనుచు నా తల్లి యనుగ్రహమునకు పాత్రులైరి. నేటికిని వారి సంతతి వారందరు శ్రీ విద్యోపాసనమును పరంపరగా నుపదేశ మందుచు పూర్ణ దీక్షాపరులై విలసిల్లుచున్నారు. ఆ దేవి యనుగ్రహముననే వారి యింట సంగీత సాహిత్యములు తాండవించుచుండును. బ్రహ్మశ్రీ బుద్ధు త్రిపురసుందర శాస్త్రి నాగభూషణం శాస్త్రిగార్లు ఉద్దండ పండితులు ఉమాపతి గారికి ప్రపౌత్రులు నేటికిని శ్రీ విద్యయందు పూర్ణ దీక్షా పరుండై సంగీతమున చక్కని పాండిత్యము కలిగి, ఆ దుర్గాదేవి బాహుశకలమును బుద్ధు వెంకటరత్నముగారు పూజించు చుండిరి. ఈ విషయము కళ్ళేపల్లి కైఫీయతులో నున్నది.

# దుర్గాక్షేత్ర మహాత్మ్యము

తొల్లి నైమిశారణ్యమున పౌరాణిక శ్రేష్ఠుండగు
సూతమహాఋషిని, శౌనకాది మహామునీశ్వరులు, మహో
త్తమ మైనదియు, ఆశ్చర్యమును కలిగించునదై అనంతఫలము
నిచ్చునదియునగు కృష్ణా మాహాత్మ్యమును వినఁగోరుచున్నా
మని యడుగఁగా సూతమహర్షి వారితో నిట్లు చెప్పఁదొడం
గెను. పూర్వ మీ మాహాత్మ్య మీశ్వరుఁడు స్కందునకుఁ
జెప్పినట్లు స్కందునివలన బ్రహ్మయు, బ్రహ్మవలన తాను
వింటినని నారదుఁడు ఋషీశ్వరులకుఁ జెప్పెను. ఏ నదీ యుద
కాంజలులచేత దేవతలును, పితృగణములును, ఋషీశ్వరు
లును తృప్తులగుచు, తర్పణవిడిన మానవులను ధన్యులచేయు
చున్నారో, అట్టి కృష్ణామహాత్మ్యమును వినవలసినది.
రావణునిచేత ప్రతిష్ఠింపఁబడిన గోకర్ణక్షేత్ర మాహాత్మ్యమును
ముక్త్యాల, వేదాద్రి, శ్రీశైలక్షేత్ర మాహాత్మ్యములు శ్రీ
శైల ఖండమున యిదివరకు నాచేత జెప్పఁబడినవి. ఇంక నీ
లోకమునఁగల మానవుల యార్తినిఁ బోగొట్టఁజాలినట్టియు,
భక్తుల కోర్కెలనుఁ దీర్చునట్టియు, పరమ కరుణానిధియైన
శ్రీమన్నారాయణుఁడు వైకుంఠమునుండి శ్రీదేవి భూదేవి
సహితుఁడై కృష్ణానదిని దర్శింపవచ్చెను. అప్పుడు దేవతలును,
అప్సరోగణములును, గంధర్వాదులును స్వామి దర్శనమునకు
వచ్చి, సేవించి, ఓ దేవదేవా! యీ కలియుగము పాప
భూయిష్ఠమైనది. భక్తుల ననుగ్రహించుటకు తమరు దయచేసి
తిరి. కాన "శేషశాయి" రూపమున యిందే వేంచేసి

యుండుఁడని ప్రార్థింప భక్తవత్సలుండగు భగవంతుఁడు భక్తుల కోర్కెలనుఁ దీర్చుటకై యీ క్షేత్రమున "అర్చా" (విగ్రహ) రూపమున నవతరించెను. అందువలన దీనికి "అనంతక్షేత్రమని" పేరు కలిగెను. ఈ క్షేత్రమున యెవరు స్నానముచేసి గరుడధ్వజుని నమస్కరింతురో వారియొక్క పాపములన్నియు పలాయనమగును. మరియు నీ క్షేత్రమున స్నానము, దానము, స్వాధ్యాయము, పితృతర్పణము యవ (లవ) మాత్రము చేసినను అది అనంతఫలము నిచ్చును. తరువాత ఈ కృష్ణానది పతి సంయోగకాంక్షచే, సాగరగామియై యింద్రకీలాద్రికిం బోయెను. అచ్చట పర్వతుని తనకు మార్గము నిమ్మని వేడెను. అద్రిరాజంగీకరింపలేదు. దేవతలు పర్వతునితో నీ కృష్ణవేణి పతి సంగమాభిలాష కాంక్షించుచున్నది. కనుక కొంచెము మార్గమిమ్మని వేడిరి. అంత ఇంద్రకీలాద్రి దేవతల ప్రార్థన మంగీకరించి కొంచెము సొరంగ మార్గము నిచ్చెను, అందు కృష్ణవేణి ప్రవేశించి హుంకరించి పర్వతునితో పోరి కొంతభాగమును పగులగొట్టి యిక్కడికి రెండుకోసుల దూరమునకుఁ గొనిపోయి నిలిపెను. ఆ పర్వత శకలమే నేడు "యనమలకుదురు" తావున నెలకొనియున్నది.

## దుర్గమాసురుని వధ

పూర్వము "దుర్గమాసురుఁ"డను లోక కంటకుడైన దైత్యుఁ డొక డుండెడివాడు. దేవతల ప్రార్థనచే దుర్గాదేవి.

యా దుర్గమాసురునిదునుమాడెను. అప్పుడా దేవి బంగారురంగు గలమేనిచ్ఛాయతో భక్తులకును దేవతలకును దర్శనమిచ్చెను. అప్పుడు దేవతలు సంతుష్టాంతరంగులై ఉపనిషద్వాక్యములచే "కనకదుర్గా" యని స్తుతించిరి. దుర్గమాసురుని సంహరించుటచే నీ దేవికి "దుర్గాభి" దానము కలిగినది.

## మహిషాసుర మర్ధని అవతారము

తరువాత దేవతల మొరవిని మహేశ్వరి 'మహిషాసురుఁడ'ను రాక్షసేశ్వరుని సంహరించెను. అంత దేవతలు హర్షధ్యానము లొనరించుచు ఈ"మహిషాసురమర్ధని" యవతారముతోనే, ఈ పర్వతముమీద నివసించి యుండునట్లు ప్రార్థించిరి. ఈదేవియు మున్ను యింద్రకీలుని తపస్సునకు మెచ్చి వరమును కోరుకోమనిన యతనియందే యుండుమని కోరగా నట్లే యుండునని వరమిచ్చుటచేత, భక్తుని కోరికను నెరవేర్చుటకై, అష్టభుజములు కలిగి వాటియందు అష్ట విధాయుధములను ధరించి సింహవాహనారూఢయై, మహిషాసుర సంహారావతారమున నీ యింద్రకీలాద్రి నధిరోహించి యుండెను. కనుక ఈమెకు 'మహిషాసురమర్దని' యని మరియొక పేరు.

## శుంభ నిశుంభులను జయించుట

మరియు నీ దుర్గ, దుర్గమాసుర మహిషాసురులే కాక దేవతలను బాధించుచున్న 'శుంభ నిశుంభుల'ను ఇరు

పురరాక్షస సోదరులను యుద్ధములో జయించెను. అందు వలన దేవతలీ దేవికి 'జయదేవి' యని పేరుఁ బెట్టిరి.

## ఈశ్వరునకు మల్లికేశుఁడను నామము కలుగుట

ఈ యింద్రకీలాద్రిని బ్రహ్మ యీశ్వరునిఁ గురించి తపం బొనర్చుటయేగాక యీ క్షేత్రమున కృష్ణా తీరమున యీశ్వర ప్రీతిగా నూరు అశ్వమేధ క్రతువుల నొనర్చెను. అంత ఈశ్వరుఁడు సంతుష్టుఁడై 'జ్యోతిర్లింగ' స్వరూపమున బ్రహ్మకు ప్రత్యక్షమై కోరిన వరముల నిచ్చుటయేగాక బ్రహ్మలోకాధిపత్యము నిచ్చెను. అంత బ్రహ్మ జ్యోతిర్లింగ రూపమున ప్రత్యక్షమైన పరమ శివుని మల్లికాకదంబ పుష్ప ముల చేత పూజించెను. అందువలన దేవతలందరు నీదేవి 'మల్లికేశుఁడ'ని వ్యవహరించిరి.

## పాండవులు తపస్సు చేయుట

ఇక్కడ కొంతకాలము పాండవులు తపస్సుచేసిరి. అందర్జునుఁడు తపస్సుచేసి మల్లికేశుని మెప్పించి కిరాత వేష మున తన్ననుగ్రహింప వచ్చిన ఈశ్వరునితో పోరిజయించి పాశుపతమును సంపాదించిన కారణమున, యిది 'ఫల్గుణ క్షేత్రమ'ని కూడ చెప్పఁబడుచున్నది. ఈ క్షేత్రమున నెవ్వరే కోరికలను కోరి సేవింతురో వారి కోరికలన్నియు సిద్ధించును.

## బెజవాడకు పలునామములు

కృష్ణానది కృష్ణాంగ సంభూతమై, అనేక లోకోపకా రములైన బీజములను తీసుకునివచ్చి ఈ క్షేత్రమున నాటు

టచే 'బీజపురి' అనియు, యీ యింద్రకీలాద్రి స్వర్ణగర్భ యగుటచేతను, దుర్గాదేవి. దేవతలకు "కనకప్రభ" లీను కాంతితో దర్శన మిచ్చుటచేతను 'క న క పు రి, కనక వాడల'నియు, కష్ణానదీ పర్వతునితో పోరిజయించుటచేతను, దుర్గాదేవి దుర్గమాసుర, మహిషాసుర, శుంభ నిశుంభాది దైత్యులను సంహరించి జయించుట చేతను 'జయపురి' యనియు అర్జునుఁడు తపంబొనర్చిన కారణమునను, ఈశ్వరుని నోడించి పాశుపతాస్త్రముంగొని విజయము చేకొనిన కారణ ముచేత 'ఫల్గున' 'క్షేత్రము' 'విజయవాడ' లను పేరులు ప్రసిద్ధి గాంచినది.

## క్షేత్ర మహిమ

సాక్షాత్తు విష్ణు తనువునుండి జనించి కృష్ణయను పేరు గలిగియుండుటచేతను పరమేశ్వరుఁ డంతర్వాహినియై యుం డుటచేతను, సర్వ తీర్థములు యిందు సంగమించుట వలనను యిది సర్వ తీర్థమయి యైనది. ఇట్లె యీ యింద్రకీలాద్రి సర్వదేవమయమైనది యగుటవలనను, మల్లేశ్వరుఁడు సర్వ దేవాత్మకుడగుటచేతను, యీ క్షేత్ర మహాత్మ్యము చెప్పనలవికాదు. ఈ దుర్గాక్షేత్ర మహాత్మ్యమును విన్నంత మాత్రమున పాపములన్నియు పలాయనమగును. యెవరు ఈ క్షేత్రమున స్నానముచేసి, సర్వదుఃఖములను పోగొట్టు నట్టి దుర్గాదేవిని, మల్లికేశ్వరుని దర్శనము చేయుదురో వారు నిత్యులై దేవలోకమునవసింతురు. వెండియు నీక్షేత్రమున

పితృదేవతలకు పిండప్రదానముఁ జేసిన వారికి కలుగు ఫలమును చెప్పెదను వినుడు; అట్లు శ్రాద్ధముచేసిన కర్తయొక్క పది తరముల పూర్వులును, ముందు పదితరములవారును పునరావృత్తి రహితులై బ్రహ్మలోకమున సుఖించుచుందురు. వెండియు కృష్ణాతోయముల కృతస్నాతులై హిరణ్యశ్రాద్ధముఁ చేసినవారికి అనంతమైన ఫలము కలుగకలదని యీశ్వరుఁడు పలికెను. ఈ క్షేత్రమున బ్రాహ్మణులందరు యీశ్వరస్వరూపులే సందియము లేదు. అట్టివారిని దర్శనము చేసిననే పాపములన్నియు పరిహారమై పోవును. వారికిచ్చు సువర్ణ వస్త్రదానములు మేరుపర్వతమును దానమిచ్చిన దానితో తుల్యములగును. దీనికి తూర్పుగా మహాపుణ్యప్రదమైన సోమతీర్థమును, తరువాత బ్రహ్మతీర్థమును, చక్రతీర్థమును, వరుసగ కూర్మ తీర్థమును శంఖతీర్థమునుఁ గలవు. వీనిని స్మరించుటవలననే సర్వ పాపములు నశించును. ఈ క్షేత్రమున స్నానదానములొనరించుటవలన అనంతమైన పుణ్యఫలముఁగలిగి పునరావృత్తి రహితులై బ్రహ్మలోకకూడ సంతసించు చుందురు.

శ్రీరామచంద్రపరమాత్మచే కృష్ణ కిరుతటములను శ్రీ రామేశ్వరలింగములు ప్రతిష్టింపబడెను. అందువలన నిది ఉభయరామేశ్వరమైనది. తరువాత శ్రీకాకుళ మను ముక్తి ప్రదమైన మహత్తర క్షేత్రమొకటి కలదు. అక్కడ స్నానముచేసిన వారికి కలుగు సుకృతము చెప్పనలవికాదు. పూర్వము అగస్త్యమహర్షి కృష్ణానది కిరుతీరములగల సమస్త

పుణ్యతీర్థములందును స్నానమాడి, చివరకు శ్రీకాకుళమునుఁ జేరెను. అక్కడ చతుర్భుజ సహితుఁడును, శంఖచక్రగదా ధరుఁడును శ్రీ భూనీళా సహితుఁడైన శ్రీ మహావిష్ణువు శ్రీకాకుళ నాయకుఁడను పేర విజయము చేసియుండెను యెవరైనను కృష్ణానదీతోయములందు స్నానముఁజేసి, శ్రీకాకుళేశ్వరుని చూచినంత మాత్రమున వారు ముక్తినిఁ బొందుదురు. ఇచ్చట యెవ్వరే కోర్కెలు కోరుకొన్నను వారికోర్కెచెల్లి నెరవేరును. నిశ్చయము. మరియు నీ క్షేత్రమున దేవహ్రదము, బ్రహ్మహ్రదము, రుద్రహ్రదము చక్రతీర్థము, వేధస విష్ణు సూర్యసోమ తీర్థములునుఁ గలవు. పాపవినాశన తీర్థమొకటి కలదు. ఇచ్చట స్నానము చేసిన వారికి మోక్షము కరతలామలకమగుననియు, బ్రహ్మహత్య సురాపాన గురుతల్పగమనాది మహాపాపములుకూడ ఒక్కసారి స్నానముచేసి నంత మాత్రమున హరించి పోగలవని స్కందునిచే పలుకబడెను. ఇచ్చట క్షేత్రపాలకుఁడు మల్లికేశ్వరుఁడే. ఈ దేవునికి ఏకరాత్రి పసన్న మల్లికేశ్వరుడనిపేరు. అనగా యీకాకుళక్షేత్రమున స్నానమొనరించి ఒకరాత్రి శ్రీ మల్లేశ్వరుని దేవాలయములో శయనించినవో నతనికి శ్రీ స్వామి ప్రత్యక్షమగు కతన 'ఏకరాత్రి ప్రసన్న మల్లికేశ్వరుఁడ'ను పేరుకలిగెను. ఇట్లె కృష్ణకు నిరుతటములను సోమేశ్వర, ముక్తేశ్వర, నాగేశ్వరలింగములనుకూడ శ్రీ రామచంద్రుఁడే ప్రతిష్ఠించెను. దీనికి పాపనాశనమని పేరు. ఇచ్చట స్నానముచేసి పిండపితృయజ్ఞము చేసినవారు దేవతలతోనహా స్వర్గమున సుఖము ననుభవించుచుందురు. ఇచ్చట

సోమేశ్వరుని ప్రసాదముచేత సర్వదేవతలు సంతోషాయత్త చిత్తులై సిద్దినిఁబొందిరి. ఈ క్షేత్రమున దానముచేసిన కోటి గుణ ఫలమునిచ్చును అందువలన దీనికి 'కోటిఫలి' యను పేరు కలిగెను. దీనినే నేడు కోటిపల్లియని వ్యవహరించు చున్నారు. ఈరెండును ఉభయ సోమేశ్వల క్షేత్రములు దీనికి దక్షిణభాగమున నొక క్రోసెడు దూరమున శుక్లతీర్థము కలదు. ఇది గణపతి క్షేత్రము. (దీని నిప్పుడు వెల్లటూరు అని పిలుచుచున్నారు.) ఈ క్షేత్రమునకు దక్షిణముగా వ్యాఘ్రేశ్వర తీర్థము కలదు. ఈ క్షేత్రమును దర్శించుట చేతనే వారివారిపాపములనుండి విడువబడుచున్నారు. ఇచ్చట వరదరాజను మహావిష్ణువును పార్వతీసహితశంకరుఁడునుగలరు. ఇచ్చట స్నాతులగువారికి సురాపానాది పంచమహాపాతక ములు పరిహారమై ముక్తిని చూరగొందురు. ఈక్షేత్రమును దర్శించుటచేతనే సర్వ పాపములనుండి విడువఁబడుదురు. ఇచ్చట జగన్మయుఁడగు విష్ణువును ఇంద్రాది దేవతలును సమస్త మహర్షులను సేవించుచుందురు. ఇచ్చట కృష్ణా సలిల ములందు స్నానమొనర్చువారికి సహస్ర జన్మార్జితమైన పాత కములు కూడా వెంటనే తొలగిపోవును. ఏలననగా విష్ణు పాదోద్భవియైన గంగానది మర్త్యులకెట్లు మోక్షమును చేకూర్చునో నట్లె యిది సాక్షాద్విష్ణు శరీరమే యగుటచేత నట్టి ఫలమును నిచ్చును దీనితరువాత నరకోత్తారక క్షేత్రము కలదు. అనగా నడకుదురు. ఇచ్చట స్వయంభువమైన పృథివీ లింగము కలదు. ఈ లింగము పశ్చిమాభి ముఖముగాకలదు. ఇచ్చట స్నానముచేసి పితృదేవతలకు తర్పణవిడిన వో సప్త

పురుషులు, పూర్వులు సప్తపురుషులు పరలంకూడ నరకా దుల నుండి విముక్తులై పుణ్యభాజలగుదురనియు నిది మహోత్తమమైన క్షేత్రమని స్కందునిచే పలుకఁబడెను.

ఇది స్కాందపురాణము సహ్యాద్రి ఖండములో శ్రీ కృష్ణామహాత్మ్యమున శ్రీకాకుళాది క్షేత్ర ధనము కల యిరువది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము - తరువాత చెప్పెదనువినుఁడు. మధ్య వ్యాఘ్రపురమువద్ద కృష్ణా - వేణీ నదులు చీలినవి. ఇచటనే వశిష్ఠమహాఋషి ఆశ్రమము. వ్యాఘ్రపాదమహర్షియాశ్రమమును కలవు. ఈ వశిష్టాశ్రమ మున కొంతకాలము సీతామహాదేవి యుండి ధర్మములను వినెను. అందువలన దీనికి అవనిజాపురమని పేరు కలిగెను ఇక్కడ శ్రీ లక్ష్మీపతిని శ్రీరామచంద్ర పరమాత్మ వేణి నదికి యిరుపార్శ్వముల ప్రతిష్ఠించెను. అందువలన దీనిని ఉభయనారాయణ క్షేత్ర మందురు. ఈ నారాయణక్షేత్రము నంటి "నారాయణ సరోవరము" కలదు దీని మహాత్మ్యము నద్భుతమైనది. ఈ సరస్సులో హాని, యిక్కడ నదీతీరమునఁ స్నానము చేసినవారికి కలుగు పుణ్యఫలము చెప్పుటకు నలవి కాదు. ఇచ్చట నూరుకోట్ల తీర్థములు సదా సన్నిహితములై యుండును. ఈ స్వామి దర్శనమువలన మూడు జన్మముల నుండి వచ్చు పాపసంచయములు పటాపంచలై పోవును. ఇచ్చట స్నానము, దానము, జపము, హోమము, అనంత మైన ఫలమునిచ్చి మోక్షమును చేకూర్చును. ఇచ్చట దేవ, ఋషి, పితౄతర్పణము లొనర్చినవారికి కోటి జన్మములనుండి

నిడువని పాపసంచయములు నశించి జన్మరాహిత్యము సిద్ధించును. దీనికి దక్షిణమున క్రోశెడుదూరమున ముక్తిక్షేత్రమును, వేణిసాగర సంగమమున "దుర్గా (గణిపేశ్వర) సంగమేశ్వర తీర్థములను క్షేత్రములునుఁ గలవు. వ్యాఘ్రపురమునకు తూర్పుభాగమున ఉత్తమమైన కుమారక్షేత్రము కలదు. ఇది సుప్రసిద్ధ సుబ్రహ్మణ్య క్షేత్రము. (దీని నిప్పుడు మోపిదేవియని పిలుచుచున్నారు) దీనికి తూర్పున క్రోశ తీర్థము కలదు. ఇందు స్నానముచేసిన వారికి ముక్తి కరతలామలకముగ నుండును. ఇదియు పితృదేవతలకు ప్రీతికరమైనది. శివవిభూషణమైన చేకువనక్షేత్రము కలదు. ఇక్కడ అగస్త్యమహాఋషిచే పూజింపఁబడిన "రామేశ్వరుఁడ"ను దేవుఁడు కలడు. ఇక్కడ కృష్ణాతీరమున స్నానము సాయుజ్య కారణమైనది. ఈ క్షేత్రమున పితృదేవతలకు పిండ ప్రదానమొనర్చినచో తిరిగి మాతృగర్భ నరకమునుఁ బొందరు. అనగా జన్మరాహిత్యమును పొందుదురు. ఈ క్షేత్రమునకు తూర్పున యెక్కడ నాగేశ్వరుఁడను దేవుఁడు కలడో యెక్కడ కృష్ణానది యుత్తరవాహినిగా ప్రవహించుచున్నదో దానిని కర్కోటక క్షేత్రమందురు. దీనినే దక్షిణ కాశి యందురు. కదళీషండ మధ్యభాగమున నీ లింగము నాగ రూపమున కర్కోటకాది నాగులకు దర్శనమిచ్చుటచే దీనిని కదళీపురమనియు, యిందుఁగల యీశ్వరుని నాగేశ్వర లింగమనియు పేర్కొందురు. ఇచ్చట కృష్ణలోని జలము స్నానము చేసినను, పానముచేసినను, బ్రహ్మహత్యాది పంచమహా పాతకములు తొలగిపోఁగలవు. ఈ క్షేత్రమున కర్కోటక

రూపముతోనున్న శిలాలింగమును వశిష్ఠుడు పూజించి సిద్ధినిఁ బొందుటచే నిది "వశిష్ఠక్షేత్ర"మనికూడ ప్రఖ్యాతిఁ గాంచి నది. ఈ క్షేత్రమున అనేక కుండములు కలవు. అందు "నాగ కుండము" ముఖ్యమైనది ఇది నాగేశ్వరాలయమునకు ఉత్తర భాగమునఁ కలదు. ఇందనేక తీర్థములు అంతర్హితములై యున్నవి. ఇది సుఖప్రదమైనది. పాపహరమైనది. ఇక్కడ బ్రహ్మకుండము, రుద్రకుండములు కలవు. ఇందులో స్నాన, దానములు స్వల్పముగా చేసినను అనంత ఫలప్రదములగును. వశిష్ఠ, విశ్వామిత్రులు వివాదపరులై యీ క్షేత్రమున తపస్సు చేసిరి. అందు వశిష్ఠుఁడు యీశ్వరుని గురించి తపంబొనర్చి సిద్ధినిఁ బొందెను. అందువలన విశ్వామిత్రుఁడు విష్ణువునుఁ గూర్చి తపంబొనర్చెను. అంత శ్రీ మహావిష్ణువు వేణుగోపాల రూపమున ప్రత్యక్షమై విశ్వామిత్రునికి కోరినవరములనిచ్చి. సిద్ధునిఁజేసెను. కనుక దీనికి విశ్వామిత్ర క్షేత్రమని కూడ పేరు కలిగినది. కృష్ణానది సాగరునితో సంగమించిన స్థలమున స్వయంవ్యక్తమగు వేణుగోపాలక్షేత్ర మొందు కలదు. ఇక్కడ మున్ను హంసలును, పరమహంస రూపులగు ఋషీశ్వరులు నుండుటచే "హంసలదీవి" యని వాకొనిరి. సూర్యుఁడు కన్యారాశిగతుఁడై యుండగా యొక్కసారి యీ సాగర సంగమ క్షేత్రమున స్నానమొనరించినచో సర్వకామములు సిద్ధించును. ఈ క్షేత్రమున పిండప్రదాన మొనర్చిన మూడుకోట్ల తరములవరకు పితృదేవతలు కులము నుద్ధరింపఁ బడుదురు. ఇంద్రాది సర్వదేవతలును కృష్ణా సాగరసంగ స్నానాభికాంక్షులై యీ హంసలదీప మందు వసింతురు.

కార్తీక మాసమందును, వైశాఖమాసమందును, ఆషాఢ మాసమందును, మాఖమాసమందును, గ్రహణకాలమందును, సంక్రాంతుల యందును, యేకాదశి తిథియందును, పుష్కరము దును యీ కృష్ణాసాగరసంగమస్థలమున స్నానముచేసి వేణుగోపాల దేవుని సేవించిన వారలకు నూరు తరములవారు తరింతురు. ఈ క్షేత్రమహాత్మ్యమును చెప్పుటకుగాని, తెలుసుకొనుటకుగాని యెవ్వరు సమర్థులుకారు. దేవ ఋషి సంఘములుకూడ యిట్టిస్థితిని పొందుదురు. ఎక్కడ సముద్రోదకములతో నదీ యుదకములు కలియునో అక్కడ సమస్త తీర్థములు నివసించునని తెలియుచున్నది. ఇది నాకు తెలిసినంతవరకును మీకుచెప్పితిని అని సూతుడు చెప్పెను. ఇది స్కాంద పురాణములో సహ్యాద్రి ఖండమున కృష్ణా మహాత్మ్యమునందు ఉభయ నాగేశ్వర క్షేత్రాది వర్ణనముం గల ముప్పదియవ అధ్యాయము సంపూర్ణము.

## దుర్గాంబా కుండ మాహాత్మ్యము

శ్రీరామచంద్రపరమాత్మ వనవాసమున పంచవటి యందు సీతాలక్ష్మణ సమేతముగ నున్నవారై తమ దర్శనమునకై వచ్చిన అగస్త్యమహర్షిని గూర్చి యిట్లు అడిగెను. శ్రీశైల మహాత్మ్యమును, వేదాద్రిదేవ మహాత్మ్యమును మీచేత వర్ణింపబడినవి. కాన యిప్పుడు దుర్గాంబాకుండ మహాత్మ్యమును, యెవనిచేత నా క్షేత్రమున తపస్సు చేయబడినది? ఎవరికి దుర్గాదేవి వరములను కటాక్షించినది?

ఎవరికి దుర్గాదేవి ప్రసన్నురాలైనది? దుర్గాకుండ మెవరిచే ప్రతిష్ఠింపఁబడినది? ఏమంత్రముచేత నుత్తమఫలము కలుగు నను విషయములు విస్తరముగా చెప్పవేడెదనని యడుగగా, అగస్త్య మహాముని ఓ రాఘవా! దుర్గాకుండ మహాత్మ్యము మును చెప్పెదను వినుము. ఏకుండమును స్మరించునంత మాత్రమున మానవులు కృతార్థులగుదురో అట్టి సరోవర మతిప్రభావముతో కూడుకొనినదై దుర్గాదేవి దేవాలయము నకు నైరుతి కోణమందు ఈశ్వరునిచే నిర్మింపఁబడినది. భూలోకములో పాపములను పోగొట్టజాలిన వెన్ని పుణ్యనదులుఁ గలవో, స్మరించినంత మాత్రమున పుణ్యమునిచ్చు యెన్ని పవిత్రతీర్థములు కలవో, అవి అన్నియు, ఈశ్వరాజ్ఞ వలన ఈ దుర్గాకుండమును ప్రవేశించు యున్నవి. అందువలన నిది మంగళ ప్రదమైనది. ఇందు ప్రవేశించిన పుణ్యనదీ జలము లేవియనగా, గంగానదీ, బ్రహ్మపుత్ర, శ్వేతభద్ర, సరస్వతి, యమున, తమసానది, విపాశ, బాహుద, సింధు, తాపినీ, రేవా, ముచికుంద, పినాకిని, సోమోద్భవ, శోణ భద్ర, జామదగ్ని, మహానది, శీఘ్ర, పయోష్ణి, వింధ్యా, చర్మణ్వతి, అరుణానది, విధూతపాప, వ్యాఘ్రనది, గోమతి, గండకీ, సరయూనది, విశాల, విమల, శరావతీ, వేగవతీ, భోగవతీ, అమృతాపగా, చంద్రభాగ, సూర్యభాగ, బ్రహ్మణీ, ఇంద్రనదీ, వైనతేయా, సప్త గోదావరీ, మలా పహారిణీ, భీమాదూర్వాసా, అమరావతీ, సహ్యాకేయా సింహానది, మహానదియైన కృష్ణవేణి, తుంగభద్ర, బ్రహ్మ నదీ, ప్రణవాక్షరనదీ, భీమస్వనా, భృగునది, ఉత్తరవినా

కిని, సువర్ణముఖి, వాశిష్ట, విష్ణుపదోద్భవా, కుముద్వతి, దక్షిణపినాకినీ, అమరప్రియ, కావేరి, తామ్రపర్ణి, మహేశా, వేణుభేదినీ, ఈ నదులన్నియు నెప్పుడును వాటి స్వీయమైన హాంశములతో ఈ కుండమున ప్రవేశించి యుండును. యిది శివాజ్ఞ. ఇందువలన ఈ కుండమున స్నానముచేసిన వారలకు సర్వ నదులయందు స్నానముఁజేసిన ఫలము కలుగఁగలదు. సందేహము లేదు. ఇంకను శ్రీరామచంద్రా వినుము. ఇల్లె లోకమున ప్రసిద్ధములైన తీర్థములును, దేవేంద్రాది దేవత లును ఈ కుండమున ప్రవేశింతురు. తీర్థముల వివరమును వినుము. విష్ణుపాదోదక తీర్థము. తీర్థశ్రేష్ఠమైన మణికర్ణిక, జ్ఞానవాపి, బ్రహ్మవాపి, రుద్రవాపి, అర్కతీర్థము, చంద్ర తీర్థము, తీర్థోత్తమమైన అగస్త్య తీర్థము, దుర్గాతీర్థము, శక్రి తీర్థము, కామాక్షీతీర్థము, కామేశ్వరమహాతీర్థము, త్రిపుర సుందరీ తీర్థము, భృగుతీర్థము, కేదారతీర్థము, యక్ష తీర్థము, కర్దమ తీర్థము, స్వర్ణతీర్థము, శుక్ర తీర్థము, మహోత్తరమయిన వైఖానస తీర్థము, ప్రహ్లాద తీర్థము, శ్రీగుండము, తీర్థశ్రేష్ఠమైన పిప్పలతీర్థము, ప్రభాసతీర్థము, గోకర్ణతీర్థము, కపిలతీర్థము, ప్రయాగ నారాయణతీర్థము, వినాయకతీర్థము, నారదతీర్థము, సౌమ్యరుద్రమహాలయ తీర్థము, సిద్ధాశ్రమమునఁగల సిద్ధతీర్థము, విశ్వామిత్రతీర్థము, భాస్కరతీర్థము, శైలతీర్థము, పద్మతీర్థములు ప్రవేశించి యున్నవి. ఇంకను ఓ రఘువంశభూషణా! ఛాయాదేవి తీర్థము, గోపద (గొవ్వూరు) తీర్థము, సుధాకుండము, క్షీర కుండము (పాలకొల్లు), క్రౌంచతీర్థము, వజ్రస్యతీర్థము, శంఖు

జంబుతీర్థములు, కుమారతీర్థము, బాణతీర్థము, పౌలోమి తీర్థము, మంగళతీర్థము, సర్వతీర్థములందును యుత్తమమైన శారదాతీర్థము, గాంధర్వతీర్థము, ఏకామ్రతీర్థము, పృథుతీర్థము, పాపనాశనము, రోహిణీతీర్థము, చక్రతీర్థము, కుండలీతీర్థము, వైరోచనతీర్థము, ఋషితీర్థము, రత్నతీర్థము, (ఇందు ముత్యములు పండును) అగ్నితీర్థము, సారంగతీర్థము, శివ ప్రియమైన భస్మకుండము, అక్కడనేయున్న సుందరీతీర్థము, పాపవిమోచనతీర్థము, యజ్ఞతీర్థము, సోమతీర్థము, పంచాప్సరసతీర్థము, అశ్వతీర్థము, దర్దురతీర్థము, మాణిక్యతీర్థము, మనుతీర్థము, శక్రతీర్థము, చ్యవనతీర్థము, సర్వరోగహరసమర్థమైనట్టియు, ఏ తీర్థమున స్నానము చేసినచో వృద్ధులు తరుణవయస్కులగుదురో అట్టి అశ్వినీతీర్థము, గౌరీకుండము, ఏ తీర్థమున స్వాయంభువమనువు విష్ణువుయొక్క అనుగ్రహమునకు పాత్రుఁడై ప్రజాపతి పదవి నలంకరించెనో అట్టి మత్స్యతీర్థము, కూర్మతీర్థము, వరాహతీర్థము, నృసింహతీర్థము, అహోబలతీర్థము, ఏ తీర్థమున బలిచక్రవర్తి నిష్కాముఁడై, యజ్ఞమున శాస్త్రోక్త దక్షిణల నొసంగి సనాతనుఁడైన శ్రీ మహావిష్ణువును సంతుష్టపరిచెనో అట్టి బలితీర్థము. శ్రీ మహావిష్ణువెచట వామనావతారముగా ప్రభవించెనో అట్టి వామనతీర్థము, (ఈ తీర్థము శ్రీ వామనరూపమున నున్న విష్ణుపాదమున జనించి బలిచక్రవర్తి చేత పూజింపఁబడుచున్నది.) భూలోకమున సుప్రసిద్ధములైనటు వంటివన్నీఁ సర్వపాపములను హరించునట్టి యిట్టి తీర్థములన్నియు నీ దుర్గాకుండమున నుండును. అనగా యీ తీర్థములఁగల

ప్రధానాంశలు యీ కుండమున నావహించి యుండెను. అందువలన యెవరు యీ దుర్గాకుండమున స్నానమును చేయుదురో వారి కోరికలన్నియు నెరవేరును. అనగా సిద్ధించును. అట్టివారికి పునరావృత్తిరహితమైన బ్రహ్మలోక స్థితి కలుగును. ఋషులుకాని, చారణులు, సిద్ధులుకాని, యెవరుం మోక్షమును కాంక్షింతురో వారొక్కసారి యీ కుండమునకు నమస్కరించినచో శివసాయుజ్యమునుం బొందుదురు. కనుక వో రామచంద్రా! యిట్టి పరమాద్భుతమైన దుర్గాకుండ మహాత్మ్యము నీకు చెప్పంబడినది. వెండియు నీ కుండము అవ్యక్త మధురమైన కలకలధ్వనులు సేయుచుండు క్రౌంచ, పక్షులు, హంసలు, కారండకములు, బకములు చక్రవాకపక్షుల జంటల చేతను నిండినదై, మంగళప్రదమైన పరిమళము నిచ్చు శతపత్రకమలములు, ఎర్రపద్మములు, తెల్లపద్మములు కలువపూలయొక్క సువాసనచే విరాజిల్లుచున్న తోయములతో కూడకొన్నదై, మదించిన గండుతుమ్మెదల యొక్క ఝుంకార ధ్వనులతోను, చేపల చేతను, తాబేళ్ళ చేతను సేవింపంబడుచు, మొగలిపొదలచే కూడుకొని యుండి నిత్యము పుష్పించుచు ఫలించుచుండు కలిగొట్టుచెట్లను, అశోక, పున్నాగ, ఆమ్ల, ఆమ్రాతనవృక్షములును, కలిగి, సంపెంగ, పొగడపూల చేతను ఆ కుండతీరమున పుట్టిన, కొబ్బరి, నారింజ, నిమ్మ, దానిమ్మ వృక్షముల చేతను. అరటి పొదుల వల్లను వ్యాప్తమయి సరోవరములలో కెల్ల కొనియాడ తగినదై విరాజిల్లుచున్నది. ప్రతి దినమును రాత్రివేళ, క్రీడాసమయములందు

శ్రీ మల్లికేశ్వరుఁడు జగదంబా సహితుఁడై ఈ కుండతీర మున సంచరించుచుండును. మరియు పరాంబికయైన దుర్గాంబ నిత్యము దేవకన్యకలచే సేవింపఁబడుచు నిక్కడ యాడుకొనుచుండును. అందువలన నీ దుర్గాకుండము ముల్లో కములయందును ప్రసిద్ధిఁగాంచినది. ఇది సర్వతీర్థములలో నుత్తమమైనదియు, మల్లికేశ్వరునకు ప్రియమైనదియు నై యున్నది. ఈ దుర్గాకుండము యితరదేశములయందున్న పండితులచే 'అంబికా కుండ' మని కూడ పిలవబడుచున్నది. ఈ కుండమును నొక్కమారు స్మరించినంత మాత్రముచేతనే సర్వఫలములు నిచ్చునని చెప్పఁబడినది. ఈ తీర్థమాహాత్మ్య మును చెప్పుటకు ఈశ్వరు డొక్కడే సమర్థుఁడు. మాబోటి జనులము సమర్థులముకాము. ఈ కుండమున నెవ్వరు స్నానము చేయుచున్నారో, ఈ కుండములో తీర్థమును నెవ్వరు త్రాగుదురో వారు మానవరూపమును విడిచి దేవ త్వమునుఁ బొందుదురు. ఏ నరాధములు యిక్కడ తీర్థమును పాదప్రక్షాళనాదుల చేతను, గండూషాదుల చేతను, దోష ప్రచ్ఛాదులతో వారు బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రు లయిన నాలుగు వర్ణములవారును చండాలత్వమునుఁ బొందు దురు. ఈ అంబా కుండతీర్థమును, దీర్ఘరోగులు సేవించిన వో వారికి ఔషధము లెందుకు? దానము లెందుకు? తపస్సెం దుకు? ఇవి అన్నియు నిష్ఫలములని యర్థము. దుర్గాతీర్థ జల మును త్రాగినవారు రోగముల నుండి విడువబడుదురు. స్వర్గాది భోగము లొసంగుటకుఁగాని, పర్వతముల వంటి మహాపాతకములను హరించుటకుగాని యీ కుండములోని

జలములు సమర్థములైనవి. ఇందు స్నానమొనరించు జనులకు గాని యిష్టము లేకపోయినను ఒక్కసారి యీ కుండములోని జలమును స్పృశించినంత మాత్రముననే దరిద్రులకు ధనము చేకూరును. అనగా దరిద్రులు ధనికులగుదురు. విద్యార్థులకు విద్యయు, కారాగారబద్ధులకు బంధమోచనమును కలుగును. స్త్రీలకు సువాసినీత్వము స్థిరముగ నుండును. ఇది యీశ్వరునిచేత పూర్వము కుమారస్వామికి ఉపదేశింపఁబడినది. ఆ శంకరునిచేతఁ జెప్పఁబడిన సత్యసందేశమునే నేను యిప్పుడు నీకు చెప్పితినని. ఇది పద్మపురాణము. పూర్వఖండమున దుర్గాకుండ మాహాత్మ్యమును చెప్పుటయే ఏబదియవ అధ్యాయము సంపూర్ణము.

# శ్రీ కనకదుర్గా మాహాత్మ్యమ్-బ్రహ్మాండ పురాణము

తొల్లి నైమిశారణ్యమున శౌనకాది మహర్షులు, పురాణార్థ విశారదుఁడైన సూతమహామునిని శ్రీ దుర్గాదేవి మాహాత్మ్యమును దుర్గాకుండ మాహాత్మ్యమును చెప్పమని యడిగెను, ఇట్లు వారిచే యాచింపఁబడినవాఁడై సూతమహర్షి మహాదేవుఁడైన పరమేశ్వరునికి నమస్కరించి యిట్లు చెప్ప మొదలిడెను. పూర్వమొకప్పుడు శరత్కాల మేఘమునుఁ బోయిన శరీరచ్ఛాయ కలిగినటువంటిన్నీ, మహా తపశ్శాలియైనటువంటిన్నీ, వీణాపాణియైన నారదమహర్షి శ్రీమన్నారాయణుని కీర్తించుచు సంతోషాయత్తచిత్తుఁడై లోకములకు శుభములను చేకూర్చునట్టి యీశ్వరుని గురించి, ఓ దేవదేవా!

సంసార సముద్రమునుండి తరింపచేయతగినట్టిదియు, పుణ్య ప్రదమైనదియు, శుభములను చేకూర్చునట్టిదియు, పాపములను నశింపఁ జేయునట్టిదియు, నయిన శ్రీ మల్లికేశ మాహాత్మ్యమును, శ్రీ దుర్గాదేవి మాహాత్మ్యమును వినఁగోరుచున్నాను. దయతో చెప్పమని ప్రార్థించెను. అంత యీశ్వరు డిట్లు చెప్పెను. పూర్వము మాళవ దేశమునందు చంద్రవంశమందు పుట్టినటువంటిన్ని, సర్వ భూతములయందు దయాళువుగా యుండునట్టిన్ని హేమకీర్తి యను నొక మహాప్రభువు కలఁడు అతఁడు బహుజాగ రూకుఁడై చాలాకాలము రాజ్యమును పాలించెను. అతనికి పతివ్రతయైన "రత్నావళి" అను భార్యకలదు. ఆమెకు సంతానమె లేనందున చాలా చింతాక్రాంతురాలై భర్తనుఁ జేరి యిట్లు ప్రార్థించెను. హే నాథా! అపుత్రవంతులకు సద్గతులు లేవని పండితులు చెప్పుదురు. మన కపవర్గ మెట్లు కలుగును. ఓ ప్రభూత్తమా! యే యుపాయముచేత నాకు సంతానము కలుగును? అని యడుగగా బుద్ధిమంతుడైన హేమకీర్తిప్రభువు బాగుగా ఆలోచించి, పుణ్యతీర్థములం దిరిగి తపస్సు చేయుటకు నిశ్చయించుకొనెను. అంత కురు క్షేత్రము, హయగ్రీవక్షేత్రము, కేదారక్షేత్రము, బదరికా శ్రమము, నీలకంఠక్షేత్రము, నేపాలము, రుద్రమహాలయము, శ్రీశైల క్షేత్రము, జంబుకేశము, శుభప్రదమైన గోకర్ణ తీర్థమును సేవించి అక్కడనుండి అహోబిల క్షేత్రమును తరువాత వేదగిరిక్షేత్రముచేరి అక్కడ స్నానమును జేయుచు,

అక్కడ దేవాలయములను సేవించుచు సంతానకాంక్షచే చిరకాలము ఆయా క్షేత్రములందు తపం బొనరించెను.

కాని యెచ్చటను సిద్ధిని పొందలేదు. అంత యింద్రకీల పర్వతమును చేరి దుర్గాదేవిని దర్శించెను. తరువాత నా హేమ కీర్తి నిత్యము కృష్ణానదియందు స్నానమొనరించి ఆ దుర్గాకుండ తీరమున చాలాకాలము తపస్సుచేసెను. ఇట్లు చాలాకాలముఁగడచిన తరువాత కార్తీకమాసమున శుద్ధత్రయోదశి సాయం సమయమందు దుర్గాదేవి యాదంపతులకు చిరునవ్వుతో కూడుకొనిన ముఖారవిందము కలిగి నటువంటిదై భక్తాను మోదియగు జగదంబ వారికి, సుందరతరమైన కైలాస పర్వత శిఖరమందు కల్పవృక్షము యొక్క ఛాయక్రింద మంగళకరమైన స్వర్ణమంటప మధ్యమున రత్న స్థగితమైన సువర్ణపీఠమందు మధ్య భాగమున చక్కని కనుబొమ్మలు కలిగినటువంటిన్ని, సన్ననైన నడుమును, చిరునవ్వుతో కూడుకొన్న పద్మాకృతిఁగల ముఖమండలమును, సూర్యచంద్రాగ్నులు మూడు నేత్రములుగా కలిగియున్నటువంటియు, శిఖామకుటమున, బాలచంద్రరేఖ కలిగియున్నట్టియు, దివ్య పరిమళయుక్తమైన శ్రీగంధమును దేహమున నలందుకొని, దివ్యములయిన మాలలతోడను ఆభరణములతోడను నలంకరింపఁబడి కోటి మన్మధులకుఁగల సౌందర్యము రాశీభూతమై యున్న లావణ్యముతో కూడుకొనినదై, నిండు పదునారు వత్సరముల వయస్సు కలదై, తన యెనిమిది అరవిందములుఁబోలు హస్తములతో దివ్యాయుధములను ధరించి

న్నదై, సింహవాహనా రూఢయైన బాలత్రిపురసుందరీదేవి ప్రత్యక్షమయ్యెను. అప్పుడా రాజదంపతులా దేవినింజూచి పరమాశ్చర్యమునుం బొందిరి. తరువాత నా దేవికి నమస్కరించి, శ్వేతరక్త పద్మములచేతను, మల్లికా జాజీపుష్పముల చేతను, దేవమందార సంపెంగ పుష్పములచేతను, పూజించి నీవంటి కన్యకా సంతానమిమ్మని వేడుకొనిరి. అంత నాదేవి, వారి మాటలను విని సంతోషాయత్తచిత్తయై మీకు నా అంశచే నొక పుత్రికను నిత్తును. ఆమె వలన మీ కుల ముద్ధరింపంబడును. మీకు సద్గతులు కలుగునని చెప్పెను. ఆ దేవి పలుకులు విని యా రాజదంపతులు తమ స్వంత దేశమునకు పయనమై పోయిరి. ఇట్లుండ యొక శుభలగ్నమున నా రత్నావళిదేవి, దేవి యనుగ్రహమున గర్భమును ధరించెను. పదినెలలుం గడచిన తరువాత నామెకు కన్యారత్నముదయించెను. ఆ బాల తన తల్లిదండ్రుల యొద్ద శుక్లపక్షమునాటి చంద్రకళవలె నాటినాటికి, గంభీరమైన నాభియును, అత్యంతము విశాలమైన నేత్రములును, నూగారును అత్యంతసన్నమైన నడుమును, ఉన్నతములై, వృత్తాకారము కలిగి, కఠినములైన స్తనములచే ప్రకాశింపంబడుచున్న రూపమును సుకుమారములైన హస్తపద్మములును, శంఖమువంటి కంఠమును, చిరునవ్వు లొలుకు మోమును, దొండపండువంటి అధరమును, సౌందర్యమైన ముఖమును, చక్కని కేశపాశమును, మృదుమధురమైన వాక్కులుకలిగి యా బాలిక తండ్రిగారి యింటియందు "చంద్రకళా" అను పేరుతో చంద్రకళవలె దినదినాభివృద్ధిగా పెరుగుచుండెను. మరియు

నా బాలిక సర్వవిద్యల యందును కుశలురాలై సత్యశీలము కలది అయ్యెను. ఇట్టి కన్యకామణిని విదర్భదేశ రాజకుమారుఁడగు రత్నాకరుఁడను రాజకుమారున కిచ్చి పెండ్లి చేసెను. ఓ నారదా యీ కన్యాదానము వలన పదితరములవారు వారి పూర్వులు తరించిరి కనుక శ్రీ దుర్గాదేవి సర్వభక్త జనులచేతను సేవింపతగినది భక్తులు యీ తల్లిని యేకామిత ములు కోరినను వారి కా యీ కోర్కెలను యిచ్చుచుండు నని నారదునకు యీశ్వరుఁడు చెప్పినట్లు సూతుఁడు శౌన కాది మహర్షులకు చెప్పెను.

ఇది బ్రహ్మాండ పురాణము ఉత్తర ఖండమున రుద్ర నారద సంవాదములో దుర్గాదేవి మహాత్మ్యమునుఁ దెల్పు ముప్పదవ అధ్యాయము సంపూర్ణము.

# శ్రీ దుర్గాదేవి మాహాత్మ్యము - పద్మపురాణము

పద్మపురాణమున దుర్గాదేవిమాహాత్మ్యము. అగస్త్య మహర్షిచే శ్రీరామచంద్రమూర్తికి చెప్పబడినట్లు కలదు. అగస్త్య భగవానుఁడు ఓ రామా! సకల సౌభాగ్యములను వృద్ధిఁ బొందించునట్టిదియు నాచేత చెప్పఁబడుచున్నట్టియు శ్రీ దుర్గాదేవియొక్క మాహాత్మ్య కథను సావధానముగా వినుము. పూర్వమున నీదేవి యనుగ్రహమున నొక పిశాచ రూపమున తిరుగుచున్న బ్రాహ్మణునకు పిశాచత్వము పోయి మోక్షము నొందెను. భూలోకమున 'అవంతి' యను

దేశము కలదు. అందు 'కల్యాణపుర' మను నొక గ్రామ
మున యజ్ఞశర్మయను బ్రాహ్మణ పండితుడుండెను. ఆ
బ్రాహ్మణునకు వేదాధ్యయన పండితులును, సర్వ శాస్త్రార్థ
తత్వజ్ఞులను సమస్తాగమ వేత్తలునైన నల్వురు పుత్రులు
కలరు. వారిలో నాల్గవవాడు వేదవేదాంగ విశారదుడైన
దేవశర్మ అను కుమారుఁడు కలడు. అతను తీర్థయాత్రలు
సేవించు కోరిక తల్లిదండ్రుల యనుజ్ఞనుఁ బొందినవాడై
బయలుదేరెను. తొలు తొలుత శ్రీ జనార్దన క్షేత్రమునకుం
జని అచట లక్ష్మీకళత్రుఁడైన జనార్దనుని సేవించి, అక్కడ
నుండి అనంతశయనమున కుంజని అనంతశయనుఁడైన శ్రీమహా
విష్ణువుకు నమస్కరించి అక్కడ నుండి శ్రీ కన్యాకుమారి
అగ్రమునకుంబోయి కన్యాకుమారి కా దేవినికొలిచి, తరువాత
మధురానగరి నివాసినియైన మీనాక్షిని విధిపూర్వకముగ
పూజించి అక్కడనుండి శ్రీశైలమునకు వచ్చి మల్లికార్జునిం
గొలిచి, అక్కడ నుండి గోదావరి జన్మస్థలమగు త్ర్యంబక
క్షేత్రమునుఁజేరి సేవించి, భీమశంకరునికి ప్రణమిల్లి నర్మదలో
స్నానమొనరించి, కురుక్షేత్రమును, హరిద్వారమును,
రుద్రమహాలయములను క్షేత్రములం దిరుగాడి, బదరీనారా
యణమును, కేదారము, అలకనందాది క్షేత్రములనుఁజూచి
దేవప్రయాగ క్షేత్రమున కుంజని ప్రయాగ, మాధవుని
సేవించి, శ్రీనగరిలో స్థాణ్వీశునకు నమస్కరించి అటనుండి
వట ప్రయాగ కుంజని కల్యాణ ప్రదుఁడైన వటేశ్వరునిం
గాంచి మ్రొక్కి, అంత వారణాసింజొచ్చి విశ్వేశ్వర దేవునికి

నమస్కరించి, కపిలధారయందు స్నానముచేసి వృషభధ్వజుని చూచి, తరువాత శంఖకర్ణేశ్వరుని, నీలాద్రి క్షేత్రమున నీల మాధవుని దర్శనముఁజేసి, దాక్షారామమున కరుదెంచెను. సప్తగోదావరిని దర్శించి, భీమేశ్వరునకు మ్రొక్కి, కోటిపల్లి క్షేత్రమున కోటీశ్వరునిఁ దిలకించి, పాప వినాశన క్షేత్రమున స్నానమాడి కుండలీశుడైన మండేశ్వరుని కొరిగి, ముక్తీశ్వరుని, వ్యాఘ్రేశ్వరునిఁజూచి, బ్రహ్మసంవేద్య, రుద్రసంవేద్య క్షేత్రములను సేవించెను. తరువాత కదళీపురమున కేతెంచి నాగేశ్వరుని సేవించి అక్కడనుంచి, హంసల దీవికిం బోయి కృష్ణాసాగర సంగమ స్థలమున స్నానమాడి, మోక్షదాయకుండగు వేణుగోపాలమూర్తిని సేవించికొని, యక్కడనుండి తిరిగి శ్రీ కాకుళమునకువచ్చి ఆంధ్రనాయకునికి ప్రణమిల్లి అక్కడ పుణ్యతోయముల తీర్థమాడి ఏకరాత్రి ప్రసన్న మల్లికేశ్వరుని, దర్శించి, శ్రీ కనకదుర్గాక్షేత్రమునకుఁ జేరెను. అక్కడ కృష్ణవేణిలో స్నానముచేసి జగదంబికయైన దుర్గాంబకు నమస్కరించి యంత దుర్గాకుండమునుఁజేరి తత్తీరమున కూర్చొనెను మరియునా బ్రాహ్మణ శ్రేష్ఠుఁడు దుర్గా కుండమున దు సంధ్యావందనమును కనులుమూసుకొని. చేసి సర్వరోగనివారకుఁడైన మల్లేశ్వరుని. దుర్గామహాదేవిని ధ్యానించి కనులు తెరచునప్పటికి బ్రాహ్మణున కతి భయంకరమైన పిశాచమొకటి కనఁబడెను. దానిని చూచెను. ఆపిశాచము యొక్క సర్వాంగములు వికృతాకారము కలిగి తగుల పెట్ట బడిన చెట్టువలె కానవచ్చెను. అంతబ్రాహ్మణ పుంగవుఁడు నీవెవ్వరవని హస్తసాజ్ఞచే నా పిశాచమును యడిగెనట.

అప్పుడా పిశాచము, నేను పిశాచమునని ముమ్మారు పలికెను. నీ వెవ్వడవు? నీకీ పిశాచత్వ మేయల కలిగెను? నీ వెందుకు వచ్చితివి? నీకేమి కావలయునో యడుగుమని బ్రాహ్మణుఁడు పలుకగా పిశాచరూపముననున్న బ్రాహ్మణుఁ డిట్లు చెప్పెను, ఈలోకమున ఉత్కళదేశములో 'శోణపురమ' ను పెద్దపట్టణము కలదు ఆ పురమునందు నిరతాగ్నిహోత్రుఁడును, ఉంఛవృత్తిచే జీవించువాడను, వేదపారగుఁడును యజ్ఞక్రియలయందు కుశలుఁడును, ప్రతిగ్రహపరాఙ్ముఖుఁడు నైన 'ధర్మాభట్టు' ను బ్రాహ్మణుఁడు కలడు. నేనాతని పుత్రుండను. నా పేరు 'అంబాభట్టం'దురు నాకు "రేణుక" యను భార్యకలదు. సంతానము కలదు. ఆ భార్యచేతను బాలకులచేతను పాలకొరకై పీడింపఁబడినవాడనై ఆ దేశాధిపతియైన 'చంద్రపాలుఁడ'ను ప్రభువును చేరి నాకు పాల కొరకు రెండు గోవుల నిమ్మని యాచించితిని. అంత నా శ్రీమంతుఁడు తనకున్న గోవులలో రెండు ఆవులను నాకు దానమిచ్చెను. కాని నా చేతియందుదకమునుఁగాని, అక్షతలనుఁగాని, కుశలనుకాని సమర్పించి యుండలేదు. మరియు దానమిచ్చినపుడు 'శివార్పితం' అనియైన యనలేదు. ఇట్లు దానమును పుచ్చుకొంటిని. అప్పుడొక గంభీరమైన అశరీర వాక్కు యిట్లుపలికెను. ఓ బ్రాహ్మణుడా నీవు గోద్వయమును, విధిగర్హితమగు రీతిని దానము నుగ్రహించితివి, ఇది నీవుచేసిన దోషము.

కాబట్టి నీవు వేయిసంవత్సరములు యీ పాపఫలము ననుభవింపక తప్పదు. శీఘ్రముగా నీవు పిశాచత్వమును

పొందుదుము. పాపఫలమును భార్యగాని పుత్రులుగాని యనుఁభవింపరు. ఇట్లు అవిధిగ ప్రతి గృహీతలగువారు నరకమునఁబడుదురు. ఇట్లె క్షుద్రకర్మ పరాయణులును నరకము ననుభవింతురని పలికెను మరియు నీవిట్లు పిశాచరూపమున వేయివర్షములు తిరిగి, విజయవాడక్షేత్రమున దుర్గాదేవి నాశ్రయించి యుందుము. అక్కడ కొక బ్రాహ్మణశ్రేష్ఠుఁడు రాగలడు. ఆ విప్రపుంగవుఁడు నీ పిశాచత్వమును నా క్షేత్రములో నేఁ బోగొట్టి నిన్ను తరింపచేయఁగలడని పలికెను. నే నప్పటినుండియు పిశాచత్వమును పొంది సంచరించుచుంటిని. కనుక నే నిప్పుడు మిమ్ములను శరణాగతిని పొందుచుంటిని. నన్ని పిశాచత్వమునుండి విడిపింపుడని వేడుకొనెను. ఇట్లు తపస్సంపన్నుఁడును, బ్రహ్మవేత్తయునైన నా బ్రాహ్మణుఁడు పిశాచరూపమున నున్న విప్రునిం గొనిపోయి దుర్గా కుండమున స్నానముచేయించి వేదమాతయైనటువంటిన్నీ, చతుర్వింశత్యక్షర వర్ణయుతమై, మంత్రరాజమైన గాయత్రీ మంత్రమును, ఓంకారమును ఆదియందును పలికి తరువాత వ్యాహృతిత్రయమును తిరిగి ఓంకారమును నుండునట్లుగా నుపదేశించుటయేఁగాక, శక్తి పంచాక్షరీమంత్రము నుపదేశించెను. ఇట్లు పిశాచరూపమున నున్న విప్రవర్యుఁడు అంబాభట్టును, దేవీప్రచోదితుఁడైన బ్రాహ్మణునివలన బ్రహ్మవిద్యయైన గాయత్రీ, శక్తి పంచాక్షరీమంత్రములను గ్రహించి మిక్కిలి శ్రద్ధాన్వితుఁడై, అనేకసంవత్సరములు నియమబద్ధుఁడై తపం బొనర్చెను. ఇట్లు గాయత్రీదేవీ మంత్రపునశ్చరణమును యిరువదినాలుగులక్షలు చేసి తద్దశాంశమును

తర్పణమును, తద్దశాంశమును హోమమునుఁ జేయవలయు
నని పెద్దలు చెప్పుదురు మన పిశాచరూప బ్రాహ్మణుఁడును
నట్లొనర్చి, యథాశక్తి శ్రీ కనకదుర్గాదేవిని పూజించెను.
గాయత్రీమంత్రము "గాయంతం త్రాయత ఇతి గాయత్రీ"
అను ప్రమాణము ననుసరించి, తనను గానముచేసిన వారిని
అనగా పఠించిన వారిని రక్షించుట వలననే దీనికి 'గాయత్రి'
అని పేరు కలిగినది. కనుకను, బ్రహ్మత్వమును ప్రసాదించి
సర్వ శుభసంపదలను వృద్ధిచేయు మంత్రరాజమగుటచే
మన బ్రాహ్మణ శ్రేష్ఠుఁడు తతోపదేశమున నతని పాపము
లను కడిగివేసెను. అందువలన నా పిశాచమును తన పిశాచ
త్వమును విడిచి దివ్యసుందర దేహుఁడై దివ్య పుష్పమాలల
చేతను, దివ్య ఆభరణములచేతను నలంకరింపఁబడి పన్నగ
భూషణుఁడైన శివుని యిట్లు ప్రార్థింప తొడగెను.

ఓ పార్వతీనాథా! విశ్వమంగళ ప్రదుఁడవైన నీకు
నమస్కరించు చున్నాను. నీవు, అజ్ఞానమును అద్దముగాచేసి
అందు ప్రతిబింబించుచున్నావు ఓ మల్లికేశా! జీవుఁడు నీకు
ప్రతి బింబరూప మేకదా! నీవు బ్రహ్మ, విష్ణు, యీశ్వరరూప
ములనంది సృష్టి, స్థితి లయములను జరిగించు చున్నావు. ఓ
పరబ్రహ్మ నీవు శుద్ధచైతన్య స్వరూపుఁడవు. నిత్యుఁడవు.
బుద్ధుడవై యున్నావు. బ్రహ్మాదులుకూడా నీమాయవలన
మోహితులై నీ నిజస్వరూపమును తెలుసుఁ గొనజాలక
యున్నారు. సర్వజ్ఞుఁడవైన నిన్ను శివంకరుని మా బోటి
కించిజ్ఞులు తెలుసుకొనఁ జాలుదురే! అని ప్రస్తుతించి అట్లు

శ్రీ కనకదుర్గాదేవిని కృతాంజలుఁడై దర్శనము. చేసి, ఓలో కకల్యాణీ! పార్వతీ, నీవు భక్తులకు సర్వాభీష్టములను నొసంగు చున్నావు. ఈ స్థావర జంగమాత్మకమగు విశ్వమంతయు నీ యందు కలిగినది. ఓ దేవీ నీవు ప్రకృతిస్వరూపిణివి. ఈ ప్రకృతియంతయు నీ యజ్ఞానవిలసితమైనది. నీ నిజ తత్వ మును, నీ నిజ స్వరూపమును బ్రహ్మాదులే తెలుసుకొనలేక యున్నారు. ధృతిజ్ఞానహీనులైన జనులు నిన్ను చూచు చున్నను, చూడలేకున్నారు. అని అనేకవిధముల స్తోత్రమునుఁ జేసి మాటిమాటికి జగన్మాతకు నమస్కరించి, దేవతలచే స్తోత్రము చేయఁబడుచు వచ్చుచున్న ఆకాశవిమానముఁ గాంచి, బ్రాహ్మణపుంగవునకు నమస్కరించి శెలవునుఁ గైకొని శివసాయుజ్యమునకుఁ జేరెను. దేవశర్మయు జరిగిన పిశాచమోక్షణమునుఁ జూచి యీ పుణ్యక్షేత్రమునను జీవించి యున్నంతవరకు కాలమునుఁ గడపి అవసానకాల మున శివలోకమును జేరెను. ఇది పద్మపురాణములో పూర్వ ఖండములో దుర్గామహాత్మ్య కథనమును బోధించు యేబది యైదవ అధ్యాయము సమాప్తము. అప్పటినుండి యిప్పటి వరకు అమ్మవారు అప్పుడప్పుడు తన మహాత్మ్యము లోకము నకు ప్రకటించి, భక్తులకు దర్శనమిచ్చి, యనుగ్రహించు చుండుటనూ నాచారముగ వచ్చుచున్నది.

## గాజులు - సినిమా

ఈ దేవిలీల లనంతములు. అద్భుతములు. పూర్వము నుండియు నేటివరకు తన్ను నమ్మిన భక్తుల కభీష్టముల

నొసంగుచుండుటయే కాక, యప్పుడప్పుడు దర్శనముకూడ యిచ్చుచుండునను వాడుక కలదు. ఇటుల నదులు, విగ్రహములు తమ భక్తులకు దర్శనమిచ్చునను సంగతి నాచే వ్రాయబడిన హనుమత్కల్యాణమను వ్యాసమున చూడనగు. ఇంతవరకేల యిటీవల 15 సంవత్సరముల క్రింద హైదరాబాదులోని "మూసీ" నది, స్త్రీ రూపమున నవాబుకు ప్రత్యక్షమై రానున్న విప్లవమును గురించి చెప్పెననియు నంత నా తాసీపా యామె పలుకులయందు విశ్వాసముంచి పట్టణమంతయు జాగరూకతతో నుండుడని యాజ్ఞాపించినట్లును వార్తాపత్రికలు ప్రకటించినవి. సుమారు 150 సంవత్సరముల క్రిందట అమ్మవారికి పూజలు జరుగక తురుష్కుల వలన యాపంబడెనట. అప్పుడు తిరిగి పునఃప్రతిష్ఠం గావించికొనంగా అర్చనకర్హము కాదని కొందరు పండితులు వాదించిరట. ఇందుకై అప్పటికి పెదకళ్ళేపల్లిలో పూర్ణదీక్షాపరులగు మంత్రశాస్త్రవేత్తలున్నారని తెలిసి విచారించగా, బుద్ధు ఉమాపతిశాస్త్రి, చలపతిశాస్త్రి యను యిరువురు వెలనాటి అర్చకసోదరులు ప్రతిష్ఠ యక్కరలేదని వాదించి తగు సంప్రోక్షణమునం గావించి కొంతకాల మక్కడనే యుపాసనము చేయుచుండిరట. అప్పుడు వారియింటిలో నున్న బాలిక లొకనాడు గాజుల శెట్టిని పిలిచి గాజులు తొడిగించుకొనిరట. వారితోం బాటు మరియొక బాలికకూడా తొడిగించుకున్నదని, మొత్తము 5 గురికి తొడిగితినని శెట్టియు, మేము 4 గురము మాత్రమే తొడిగించుకొంటిమని బాలికలు తగాదా పడుచుండగా నీదేవి యొక బాలికపై యావహించి నేనే తొడ

గించుకొంటినని పలుకగా నా శాస్త్రి సోదరులు గుడికేగి చూచిరట అమ్మవారిచేతిని గాజులు కలవట. అప్పటినుంచి యిప్పటివరకూ అమ్మవారికి గాజులువేయు ఆచారముకలదు. ఇటీవల సంవత్సరముకిందట బెజవాడకు "రోజులు మారినాయి" అనే సినీమా వచ్చినప్పుడు, అమ్మవారొక బాలికవలె కొండమెట్లు దిగివచ్చి "రిక్షా" వాడిని పిలిచి కొత్తగుళ్ళకు తీసుకుని వెళ్ళమని చెప్పెనట. అట్లు వెళ్ళి అక్కడ ఆపి "చెల్లీ" అని పిలిచెనట. ఆ కొత్తగుళ్ళలో నుండి యొక బాలిక తలుపులు తెరచి వచ్చి యా రిక్షా లోన యెక్కెనట. వారిరువురు కలసి సినీమాకు వెళ్ళి రిక్షా వాడితో నచ్చటనే యుండుడనియు తిరిగి వత్తుమని చెప్పి టిక్కెట్లు అమ్ము చోటకు వెళ్ళి యడుగగా బుక్కింగు అయి పోయినదని చెప్పగా, యింకా రెండువుంటవి చూడమని చెప్పెనట. ఆతడు చూడగా రెండేటిక్కెట్లు కలవట. వాటిని తీసుకుని హాలులోకి వెళ్ళగా నక్కడ రెండుసీట్లు కాళీగా నుండెనట. అంత వారిరువురు చాలసేపు చూచి తిరిగి వెళ్ళు నప్పుడు టిక్కెట్లు అమ్మువాని బల్లమీద రు 10-0-0 లు వున్నవి చూచుకోమని చెప్పి వెళ్ళెనట. అంత రిక్షానెక్కి మామూలు ప్రకారం ఆ రెండవబాలికను శ్రీ నగరేశ్వర స్వామివారి గుడివద్ద దించి తాను కనకదుర్గ కొండ నెక్కు-మెట్లవద్దకు వెళ్ళి, దిగిపోవుచుండగా, అమ్మా నాకు డబ్బు యివ్వలేదని బండివాడడిగెనట. "ఒరే నీ తలగుడ్డ కొంగున రు 10-0-0 లు వున్నవి చూచుకొరా! వెనకకు చూడ కుండా వెళ్ళరా" అని చెప్పగా వాడు భయపడి యింటికి

వెళ్ళి చూచుకొనగా నష్టే రు 10-0-0 కలవట. అంత వాడు 10 లంఖణములు చేసి జ్వరపడెనట. నేను వెళ్ళి విచారించగా అతనిపేరు "ఛల్లి వెంకన్న" అనియు తనది "కంభంమెట్టు" కాపురమనియు, యాదవకులస్తులమని చెప్పినాడు. ఈ విష యము "ఆంధ్రకేసరి" యను వార్తాపత్రికలోకూడ ప్రచు రింపఁబడినది.

## నృసింహ బిలము - గోవిందు గుహ

ఈ ఇంద్రకీలాద్రికి పశ్చిమ భాగమున నొక నృసింహ బిలము కలదని యొక శాసనము కలదు. కాని ఆ బిలమివ్వ డెచ్చటనున్నది తెలియుటలేదు. బెజవాడ నుండి విద్యా ధరపురము పోవు మార్గములో కొండ మధ్యభాగమున నొక గుహాద్వారము కలదు. ఇది ఇప్పుడు పరిభుత్వము,వారిచే మూయఁబడి యున్నది. ఆ గుహాద్వారము చాల యిరుకుగ నుండుననియు, లోపలకుపోయినచో చాలా విశాలప్రదేశము కలదనియు, లోగడ అందులో కొందరు సాధువులు ప్రవే శించి భయముతో తిరిగి రాలేకపోయిరనియు, కొందరతి కష్టముమీద వచ్చిరనియు, నాటినుండి యీద్వారము మూయఁబడినదనియు తెలియుచున్నది. ఈ గుహాయే నృశింహ బిలమని వృద్ధులు చెప్పుచున్నారు. కిరాతార్జున స్తంభమునద్ద నుండి క్రిందికి దిగునప్పుడు మధ్య భాగమున నొక గుహాయు, నాప్రాంతమున నొక పాకారమునుఁగలవు. ఇందు గోవిందుడను పంచముఁడు పరమభక్తు కడుంఁడెడిడొ

వాఁడు, ఇతఁడు సిద్ధుల నాశ్రయించి విరాగియై కొంతకాల మీ గుహయందుండెను, అందువలన దీనిని 'గోవిందుగుహ' అనియు 'గోవిందు మఠమ'నియు పిలుచుచున్నారు.

## నటరాజు - శివకామసుందరి

నూతనముగ అమ్మవారి ఆలయమునకు ఉత్తరవు వైపున 'నటరాజాలయము ప్రతిష్ఠింపఁబడినది. ఈ నటరాజు నటరాజే. నటరాజుకు యుత్తర భాగమున 'శివకామసుందరి' యు, దక్షిణ భాగమున 'సిద్ధి గణపతి, సుబ్రహ్మణ్య' విగ్రహములను ప్రతిష్ఠింపఁబడి యున్నవి. ఈ నటరాజాది విగ్రహములను 'తిండివనం' కాపరస్థుడు 'టి. వి. విశ్వనాథ శిల్పి' నిర్మించెను. ఈ ఆలయ నిర్మాణమునకు 'ఆంధ్ర సిమ్మెంటు కంపెనీ' వారు రేడువందల బస్తాల సిమెంటును ధర్మముగా నొసంగిరి, శ్రీమంతులు దాతలు శ్రీ చుండూరు వెంకట రెడ్డిగారు ఆలయములను, నలభై వేల రూప్యములను ఖర్చు చేసి ధర్మ సత్రమును కట్టించిరి డాక్టరు మహమ్మద్ యాకూబ్ సాహేబుగారు పదివేల రూప్యములు విలువగల వేఁడు రత్నములను సమర్పించిరి.

## కృష్ణజలక్రీడలు - గంగావతరణము

శ్రీ మల్లికేశాలయము నుండి అమ్మవారి ఆలయము నకుఁబోవు మార్గములో మెట్లకు ఉత్తర భాగమున శ్రీ కృష్ణుఁడు గోపికలు జలక్రీడలాడు భంగిమమును చూపు సుధా

విగ్రహములు, సజీవ చిత్రములవలె కాన్పించుచున్నవి. ఇట్లే యుత్తర భాగమున ఈశ్వరుఁడు తన జటామకుటమున గంగను పట్టు విధానమునుఁదోఁచు చిత్ర విగ్రహములున్నా మున్నముతోనే కట్టఁబడినవి. ఇవి యెంతో శిల్ప వైచిత్ర్య మునుఁ జూపుచున్నవి. నటరాజాలయమునకు దక్షిణ భాగమున 'కాళహస్తీశ్వరుని' కథను తెల్పు విగ్రహములుకూడ సుధా విగ్రహములే. అమ్మవారి ఆలయమునకు దక్షిణమున నేటి పాలకవర్గంవారు కాలక్షేప మంటపమును కట్టించిరి మరియు నేటి పాలకవర్గమువారు కొండపైకి పంపులను పెట్టించి మంచినీటి సదుపాయమును కలుగఁజేసిరి. మరియు వీరు యాత్రికులకు ధర్మసత్రములో ప్రతినిత్యము దేవస్థానము క్రింద ధర్మముగా 5 గురుకి ఉచితముగా భోజనమును పెట్టింతురు.

మరియు ఆలయము లోవలనే కాకుండా ఆలయముల వెలుపల అంతయు విద్యుచ్ఛక్తి దీపములను అనేకరంగులతో పెట్టించిరి. యిది చూచుటకు యెంతదూరమునకైనను రత్న కాంతులు ప్రజ్వలించుచున్నట్లు ఆలయ సౌందర్యము కన్పించు చుండును. ఆకాశమునఁ విమానములమీదఁబోవు దేవతల కిది రత్నమణీమయ ఆలయమువలె కాన్పించును. ఇట్టివి కల్పించిన యీ పాలకు లెంతయు ధన్యులు.

## భక్తులు - పాలనకర్తలు

దేవాలయమునకు శాశ్వతముగ భక్తులు సమర్పించు కున్న భూముల వివరము. మాగాని భూమి 158 యకర

ములు మెరక 73 యకరములు మొత్తము 231 యకరముల భూమి స్థిరవసతి కలదు. దీని సుమారు విలువ రు. 8'60,000 ఎనిమిది లక్షల అరవైవేల రూపాయలు వుండును.

# కట్టడములుకట్టించి నమర్పించుకున్న భక్తులపేర్లు కట్టడముల వివరము

1. శ్రీ చుండూరు వెంకట రెడ్డి శ్రేష్ఠి బి. ఎ. గారు
   ధర్మశాల 20000-0-0
2. శ్రీ అప్పన వెంకట క్రిష్ణయ్య శ్రేష్ఠిగారు
   మంటపము 6000-0-0
3. శ్రీ పచ్చిగోళ్ళ రామయ్య శ్రేష్ఠి
   శ్రీ పచ్చిగోళ్ళ కృష్ణయ్య శ్రేష్ఠిగార్లు
   మల్లేశ్వర దేవాలయ ముఖమంటపము 4000-0-0
4. శ్రీ లింగమల్లు రామలక్ష్మమ్మగారు
   రాయబార మంటపమునకు, ఇరుప్రక్కల
   కట్టడములు 4000-0-0
5. శ్రీ విన్నకోట లక్ష్మీనరసింహం పంతులుగారు
   అమ్మవారి దేవాలయ ముఖమంటపము 3000-0-0
6. శ్రీ గోపు బాలకృష్ణయ్య శ్రేష్ఠిగారు
   కల్యాణ మంటపము 3000-0-0
7. శ్రీ అద్దేపల్లి వెంకటప్పయ్య శ్రేష్ఠిగారు
   ఆఫీసు ఎదుట చావిడి 2500-0-0

8. శ్రీ మాజేటి నాగభూషణం శ్రేష్ఠిగారు
శంకర మఠము 2500-0-0

9. శ్రీ వోడవరపు దేవరాజు పంతులుగారు
సత్రము 2 00-0-0

10. శ్రీ ఉప్పలూరి గురునాథంగారు
స్వాములవార్ల బిక్షాటన మందిరము 2000-0-0

11. శ్రీ నందిపాటి రామకృష్ణయ్య శ్రేష్ఠిగారు
అమ్మవారి మెట్లవద్ద పూలతోట 2000-0-0

12. శ్రీ నందిపాటి ఆదినారాయణ శ్రేష్ఠిగారు
విశ్రాంతి మంటపము 2000-0-0

13. శ్రీ దేసు వీరభద్రయ్య శ్రేష్ఠిగారు
అమ్మవారిమెట్లలో మొదటివిశ్రాంతి మంటపం 1000-0-0

14. శ్రీ పెరుమాళ్ళ కుటుంబరావు శ్రేష్ఠిగారు
మల్లేశ్వరస్వామివారిఆలయంవద్ద విశ్రాంతిమంటపం 1000-0-0

## ఎక్కువ విలువ అయిన బంగారు వెండి ఆభరణములు కవచములు సమర్పించిన భక్తుల పేర్లు

1. శ్రీ తాడికొండ నాగేశ్వరరావు శ్రేష్ఠిగారు
వెండి పుణ్యకోటి విమానం వగైరా 4000-0-0

2. శ్రీ చుండూరు వెంకట రెడ్డిగారు బి. ఏ.
అమ్మవారి వెండి సర్వాంగ కవచము 2000-0-0



శ్రీ నటరాజస్వామివారి దేవాలయము



హిందు దేవాదాయ శాఖామాత్యులు గౌ॥ కల్లూరి చంద్రమౌళిగారు
కృష్ణా డి॥ కలక్టర్ రత్నంగార్లతో పాలకవర్గము

3. శ్రీ రాజా వెంకటాద్రి అప్పారావు
బహద్దురు జమీాందారుగారు
అమ్మవారికి బంగారు కిరీటము 1500-0-0

4. శ్రీయుతులు కొలిశెట్టి వెంకట రత్నం
యూ హనుమయ్య శ్రేష్ఠిగార్లు
నంది వాహనము

5. శ్రీ మాజేటి నాగరత్నం, పిచ్చయ్య,
దుర్గయ్య శ్రేష్ఠిలుగార్లు పెద్ద వెండిబిందె 600-0-0

6. శ్రీమతి అలపాటి సూరమ్మగారు
పెద్ద వెండి శెమ్మాలు వగైరా 500-0-0

# దేవస్థాన పరిపాలక వర్గము

## ట్రస్టీలు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

ఈ దేవస్థానమునకు 5 గురు ట్రస్టీలు, భక్తులు, శ్రీమంతులు చక్కగా ఆలయమునకు వలయు మరమ్మతులను, వార్షికోత్సవములును, కల్యాణోత్సవములును జరిగించుటయే గాక భక్తులకు వలయు సకల సదుపాయములను కలుగజేయుచున్నారు.

1. శ్రీ మాజేటి రామమోహనరావు శ్రేష్ఠిగారు, మేనేజింగ్ ట్రస్టీ

2. శ్రీ పిన్నమనేని పున్నయ్య చౌదరిగారు
3. శ్రీ మరుపిళ్ళ అప్పలస్వామి పాత్రుడుగారు
4. శ్రీ పాటిబండ అప్పారావు పంతులుగారు
5. శ్రీ నూతులపాటి తులసీరావు పంతులుగారు

} ట్రస్టీలు

శ్రీ హిందు రెలిజియస్ ఎండోమెంటు అండ్ ఛారిటబుల్ డిపార్టుమెంటువారిచే నియమింపఁబడిన ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ మాదిరెడ్డి మాధవరావు బి. ఏ. గారు.

## ఈ క్షేత్రమున చూడతగిన యితర ముఖ్య విషయములు

1. రైల్వేస్టేషను :- ఇది ఆంధ్రప్రదేశములోనే గాక ఇండియాలోకెల్ల పెద్ద జంక్షనులలో యొకటి. యిచ్చట కలకత్తా, మద్రాసు. హైద్రాబాద్, ఢిల్లీ, బొంబాయి, మచిలీపట్టణముల నుండి రైలు మార్గములు కలవు.

2. కృష్ణానది మీాద రైల్వే బ్రిడ్జి :- ఇదికూడ ఇండియాలోకెల్ల గొప్ప వంతెనలలో నొకటి మిక్కిలి బలమైనది.

3. ఆనకట్ట, మరియు బ్యారేజి :- ఈ ఆనకట్ట కృష్ణానదికి అడ్డుగా కట్టబడి యున్నది. యిప్పుడు ట్రాఫిక్ బోర్డు వారు (Barrage) బ్యారేజిన్నీ, ఇంజనీరింగ్ శాఖవారు ఆనకట్టను పెంపుచేసి కట్టుచున్నారు.

# శాసనములు - చరిత్రము

ఈ యింద్రకీలాద్రి శిఖర మధ్యభాగమున సంస్కృత భాషలో వ్రాయఁబడిన శాసన మొకటి కలదు. దీనికి 'కిరాతార్జున స్తంభ శాసనము'ని పేరు. ఇంద్రనుఁడు కిరాత రూపముననున్న యీశ్వరునోడించి వాని వలన పాశుపతాస్త్ర మును సంపాదించినట్లు వ్రాయఁబడి యున్నది. ఈ స్తంభ మును నిచట స్థాపించిన దొక యగ్నికుల క్షత్రియుఁడు తన పూర్వుఁడే యర్జునునకు యీ కొండపై తపోయోగ్యమగు స్థలమును తొలుత చూపినట్లును, తానా వంశమున జన్మిం చితిననియు, నీ శాసనమున వ్రాసుకొని యున్నాడు. విష్ణు వర్ధనుఁ డొక శివాలయమును యీ పర్వతముపై కట్టించిన ట్లొక శిలా శాసనము దొరికినది. సౌత్ యిండియన్ యిన్స్క్రిప్షన్స్ 4 వ వాల్యూం (South Indian inscriptions. Vol IV) లోనే 737 రు శాసనమున 'స్వస్తిశ్రీ సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజులు త్రిభువన చక్రవతిఁ శ్రీ పరాంతక దేవర - శకవర్షంబులు ౧౦౩౭ అగు నేంటి మన్మథ సంవత్సరంబున' అని కలదు. కిరాతార్జున స్తంభ సమీపమున శిథిలములయిన శివాలయ చిహ్నాలు కలవు. బహుశః యిదియేనేమో ? ఆలయమునకు దక్షిణ భాగమున యున్న 'అంబాకుండమునకు ప్రక్కనున్న చిన్ని కొలనులో 'చింతామణి దుర్గ'కు ప్రక్క శ్రీ అమ్మవారి కనేక పరిచర్యలుఁచేసి దానముల నొసంగి, మహావైభవములనుఁ గల్పించిన, "తూర్కరాజు" అను ప్రభువు చెక్కించిన శిలా

శాసనము కలదు. ఈ విషయము "తూర్పాది భూపవర్త్య స్వంసేవిత పాదపద్మయుగళాంతాం" అను శ్లోకము వలన తెలియుచున్నది. శాలివాహన శకవర్షంబులు ౧౦౭౬ లో శ్రీ విష్ణువర్ధన మహారాజు వంశీకుడైన 'శ్రీ మన్మెన్మనరడి' బెజవాడ మీద వచ్చి 'రడికము' (శిసుము) శాశ్వతముగా నిచ్చినటుల 'బెజవాడ రడ్డికంబు దయసేసిన రసోదధి వాయు పథేందు సంఖ్య (౧౦౭౬) బెజవాడ రడ్డికం బరిపుర భేదిరాజ పరమాత్మునిచేంబడసె ప్రవీందులును ధరణియు నంబు రాసులు సదాగతి మార్గణము గల్గునంతకును' అని కలదు, ఈ 'పెన్మన' ను గూర్చి 'పల్లవకుల తిలక' అని 6 పంక్తి లోను, 'చాళుక్యాభరణ, త్రిభువన చక్రవర్తి' అని 25 పంక్తిలోను వ్రాయబడి యుండుటచేత నితడు 'పూర్వ చాళుక్య' చక్రవర్తి యని తెలుచున్నది. శ 747 రు శాసనమున 'స్వస్తిశ్రీ శ్రీ మన్మహామండలేశ్వర త్రిణయన పల్లవ సిద్ధయదేవ మహారాజులు ఇంద్రకీలపర్వత నివాసుండైన ఈ దక్షిణ వారణాసి బెజవాడ మల్లేశ్వర శ్రీ మహాదేవరకు హవిబల్యర్చనాదులకు 'పెదగొలిగంటు' (ఇదియొక గ్రామము పేరు 'వెనిగళ్ళ కావచ్చును) ఆ చంద్రార్కముగా నిచ్చితి' మని కలదు. ఈయన పల్లవ చక్రవర్తి. శ్రీ స్వామివారికి నిత్య నైవేద్య, బలి, అర్చనాదుల కిచ్చినట్లు కలదు. యీ శాసనదాత ఈశాసనమును సంస్కృతముసకూడ వ్రాయించి చెక్కించెను. అది శ 795 రుగా ముద్రింపబడినది. మాధవవర్మకాలమున అమ్మవారు తన మృతబాలకుని బ్రతి

కెంచెనని వ్రాయఁబడిన శాసనము బజారులోని శ్రీ భ్రమ
రాంబా మల్లేశ్వరాలయమున పదిలపఱుపఁబడి యున్నది.

ఈ శ్రీ కనకదుర్గాంబకు చెందిన శాసనము సౌత్ యిండియన్ యిన్స్క్రిప్షన్సు 4 వాల్యూంలో నెం. 789 కు ఆర్కియాలాజికల్ రిపోర్టు నెం. 329 కు of 1892 కుగా ప్రకటింపఁబడినది.

## On a broken piller in front of the Kanaka Durga Shrine on the Inda Kilagiri at Bezwada.

### First Face

శుభమస్తు॥ శ్రీ గణాధిపతయేనమః శ్రీదుర్గాయైనమః॥
అస్తి ప్రీతికరం చక్రనామ్నా మామ్నాయభూమికా
మహాస్త్రీ జగదారాధ్య మహాస్కరమనీశ్వరం॥ ౧
అలంఘ్యశాసనై బాహుబలం బాహుభిరాశ్రితైః
అలంకృతమభూత్తస్య కులం గురుతరంస్వపై॥ ౨
అనుబాహు రితేషు భూజానీషు బభూతరాం
రాజామాధవ నమాఖ్యో రాజతారాగణేష్వివ॥ 3
చండికాయారణోద్దైత్య ఖండితాయాః ప్రసాదతః
అష్టాపదమయా వృష్టిః సృష్టాయేనయశస్వినా॥ ౪
నవానేతాన్ గణనాధః కుర్వాణోగురువిక్రమః
ఆసీత్కంఠమహారాజేంద్రః సాసీరిపువిజిత్వరః॥ ౫
ఆసీమధరణీచక్ర శాసీతస్య తనూభవః
ఆసీదన్నల దేవేంద్రోదాసీకృత ధరాపతిః॥ ౬

భాగీరథీవపాథోధేః సుగీతచరితాబుధైః
ఆర్యాన్నృపస్యతస్యాసీద్భార్యా కేశవనామకా॥ ౭
యాతుం యశాంసియోజఃతూం స్రాతుఃచాంఛసిమజ్జతః
సేతుంబబంధగోదాయా యాతుంగజలవీచికా॥ ౮
సంగరాజిరమాసాధ్య వంగరాజాదిజిత్వరః
అంగరాజాధికస్త్యాగే సింగరాజస్తతోజని॥ ౯
లక్ష్మమాతస్య భార్యాసీదక్ష మానాపహాజసః
ఆక్రమాదరి భూపాలాన్ విక్రమాదేవనిఘ్నతః ౧౦
పెదవల్లభ భూపాల పినవల్లభభూపతీ
పుత్రౌబభూవతుః పద్మనేత్రౌ పుణ్యాభరైస్తయోః ౧౧
పెదవల్లభభూపాలో వల్లభేనన్యదుర్లభే
ఆగాదన్నలదేవీ శ్రీరాయకమ్మాభిధావహా। ౧౨
తయోరన్నలదేవీ శ్రీ పెదవల్లభభూపయోః
తనూ.........రాజేంద్ర తమ్మరాజాబభూ...॥ ౧౩
శ్రీరాయకమ్మాయాః పాపరాజప్రభాకరౌ
అకార్షీ దనయోరేశః శ్రీ ప్రభాకరపట్టణం॥ ౧౪
పాపరాజస్య తస్యాసీద్వల్లమాంబికా
అంగరాజ ఇవాకర్ణస్య సింగరాజస్తయోఃసుతః॥ ౧౫
దేమమాపిన్నలాదేవీ లక్ష్మమావిలసత్క్షమాతిస్రః
శ్రీ తమ్మరాయస్యవచః ప్రసక్నభేస్త్రియః॥ ౧౬
పుత్రం బసవరాజాఖ్యం మిత్రం మధ్యాసి దేమమా
లబ్ధ్వా జహాససేనాన్యా మత్వాపుత్రవతీ మిమాం ౧౭
యుద్ధేయేనాభిభూతః సప్తతి బలయుతః
పారిశీకక్షితీంద్రో। ప్యన్యేక్షోణీభృతోయద్బిరుద

మనుపమం మల్లికా వల్లభాది । దుర్గాణ్యగ్రారి
వర్గాదపిచ జగృహిరే బాహువీర్యాదవార్యా ।
ద్దిన్యాచర్యాయదీయ్యా త్రిభువన భవనైః న్మా
యతేయస్య కీర్తిః ౧౮
ప్రసూయ పిన్నలాదేవీ ప్రభుం తిమ్మాహ్వయం
మధికాంశ్చ్యా జయంతాదహారత్సుతాత్ ౧౯
గుణశాలిజనం గుండమదుగుం యస్తటాకతః
సముద్రసదృశం తిమ్మ సముద్రం విదధేవిభుః ౨౦
రామేణ కోసలాధీశే కుమారీవతనూభువా
రేజే వల్లభరాజేన లక్ష్మా విలసత్క్రమా ౨౧

## Second Face

ఇహాకిల జగతి సకల రిపుకుల మవజిత్య జయస్తంభ మధి పొట్టునూరు నిధాయ నిజవశేగ జతురగబల మఖిల రాజ్యాం ప్రాజ్యంచ యవనపతే రఖిలాం విజిత్యదిశో విజయ నగర మాసాద్య మణిమయ మారుహ్య సింహాసన మఖిల మపి భువనభారం మాత్రిమతి విశ్వాస నివాసే నిఖిల గుణా నామతి తపన ధామ్నిసాళ్వ తిమ్మనామ్ని మంత్రిణి పాతివిజిత సుర మంత్రిణి నిధాయ పదవాక్య ప్రమాణ పారావార పార దృశ్వనాం ప్రతి విబుధపలాల మాతరిశ్వనాం - మనీషిణామపి కావ్య నాటకాలంకార భాషావిశేష వేదినాం చతుర్విధ కవితా సామ్రాజ్య మధిష్ఠితాంకవీ నాముప్యవరే షామపి విద్యావతాం మహతాం గోష్ఠిషు గరిష్ఠాసు సతతమవనీవనీ

పకమనీషిత పూరణేషుచ మనో నిధాయని రవధికమతుల
మవనీ సామ్రాజ్య సుఖమనుభవతి కృష్ణదేవరాయ మహా
రాయే వ్యాతరింపు యువతి జనాలంకారేణ వసిష్ఠగోత్రా
లంకారేణ బలేనాపి నిరహంకారేణ నిఖిలజన విదితేన తేన
పురోయాయినా మానినాయల్లమ జానినావదన విజితాం
భోజేన భోజేనా పరేణ పరేణా నభిభవనీయేన పాపరాజే
నచ కోమల వపుషాకొండ రాజేనచ బలవతా బసవరాజేనచ
సకల కలా వల్లభేన వల్లభరాజేనచ భుజ విజితనాగరాజేన
నాగరాజేనచ జితరిపురాజేన బేతరాజేనచ సుతవతా సుర
తరు సురభి చింతామణీ నతిశయానేన యానేన సంచరమా
నేన రమమాణేన సమితి వీరశ్రియా, నృగ, నల, నహుష
నాభాగ, భరత భగీరథ, దశరథరామాది గుణానుకారిణా
సకల జనోపకారిణా సతత మారారిణా మదదేన, విమత
మదదమనేన సదవన సావధానేన సకల గుణ నిధానేన
సింగరాజాభిధేయేన భాగధేయేనమూర్తి మతావల్లాంబికా
పాపరాజయోరథి బహుధాన్యమధి వైశాఖమధి పూర్ణిమా
మధి విజయవాట మధిరణమహిని హతాసురవర్గయాదు
ర్గాయావరాలయేన పహారంగమంటపో భోగమంటపోప్యధి
విజయనగరమధి చిత్రభాను సమమధి మాఘమాస మసుర
వధ భైరవస్వరణ మండల భైరవస్వరమ్యేణ హర్మేణ సహా
మంటపోపి తథైవ తదేవనగర మలంకుర్వాణస్య సమదఖిల
గీర్వాణస్య నిరుపమ ముఖచంద్ర స్యరామచంద్రస్య రథా
రోహాణ సమయోచితో మంటపోపి కనకగణపతి శివయోః
ప్రతిష్ఠాచ జగదవనదక్షస్య విరూపాక్షస్య పశ్చిమభాగే

దుగ్గలయోప్యధి వృషవర్షమధి శ్రావణమధి రాచూరు
జగదేక నాధస్యరంగనాథస్య వరాలయేన సహవాటికాప్యధి
భావవర్షమధి మాఘమాసమధి చాంగలముత్తి జగదీశ్వరస్య
రామేశ్వరస్య ప్రాకార గోపుర రంగమంటపాశ్చ - తదావా
సస్య కేశవస్య ప్రాకారంగోపురేచనిహత నిఖిలదైత్యస్య- తత్ర
త్యస్య వెంకటేశస్య రంగమంటపోపి! తద్దైవేధవదన భవనప్రతి
ష్ఠాచ తదావాసశ్చ నిజమాతృవల్లమాభి ధానాంకితావీధీచ
తిరుమలరాజాభిధేయేన జ్యేష్ఠేన గరిష్ఠేన ...... [తి] మ్మ
సముద్రి ప్రతినామ [కుండ్లమ] దుగు నామకేపురే వినాయక
శివవిష్ణుదేవాలయైస్సహ తటాకా రామవాపికా బ్రహ్మ
ప్రతిష్టాది కాసత్త సంతానాశ్చ సవాన్స్యైతాని తానిచ
తదన్యానిచ పుణ్యానిక మార్గాణి మహాంతి భాంతి విరచితాని
చత్వారింశ ధధిశ్రితైర్ద్ర శశతైర్యుక్తే.

## Third Face

చతుర్భిర్విశ్శతైః సంఖ్యాతేశక వత్సరేసముదితే శ్రీ
శాలివాహాంకితే । వైశాఖే బహుధాన్యకేచ విజయ శ్రీవా
టికాయాం వ్యధాత్ దుర్గాయా నిలయంచ మంటపయుగం
శ్రీ సింగభూమీపతిః ॥౨౨॥ గంగా భంగాభిషంగా
పహారయఫణితి ప్రౌఢ నానాకవీంద్రస్తోమ క్షేమ ప్రకామ
ప్రకటన జనితస్ఫూర్తిః కీర్తిః ప్రశస్తిః । తత్తద్దిగ్జైత్ర వృత్తి
ప్రసృమరవిభవః । పాప రాజాబ్ధి చంద్రః తత్తత్కృత్యం
వినుత్యం విధివదతనుతః శ్రీనిధిఃసింగరాజః ॥౨౩॥ శ్రీ శ్రీ శ్రీ

అని 141 వంశస్థులు కలవు. తరువాత (142) శ్రీ దుర్గా
వరప్రసాదులైన శ్రీ మాధవవర్మ వంశోద్భవులైన కంఠమ
రాజు మనుమండు పావరాజుంగారి కొమారుండు సింగరాజుం
గారు యీ బెజవాడ దుర్గా దేవమ్మకు. అంతరాళిక ।
రంగమంటప । భోగమంటపాదులున్ను కట్టించి రామారి
శ్రీరంగరాజుల గుడిన్ని, బావిన్ని కట్టించ్చి చలివందిరిని
తోంటాను పెట్టించి ఆ రంగనాథుని అంగరంగ వైభవాలకు
'బొమ్మహాళ్ళి' అనే గ్రామము ధారవోశి యిచ్చి అహోబిల
ప్రాంతమందు 'సింగవరము' అని అగ్రహారమున్ను కొండ
వీటి రాజ్యములోను తమ పూర్వనాయంకర్తరమై వుల్లనం
గంటి సీమలోని కొమ్మవరానకు ప్రతినామకమైన సింగవర
మని గ్రామమున్ను అగ్రహారాలు చేసి సప్త సంతానాధీశ్వ
రుండై విజయనగరమందు విరూపాక్ష దేవునిగుడి పడమటి
పట్టిక......దుర్గ గుడిన్ని రామచంద్ర దేవుని రథోత్సవ
మంటపమున్ను *

కనక గణపతి శివాలయములున్ను కట్టించిరి. విద్యా
నగర రక్షకుండైన రణమండలము భైరవేశ్వర దేవుని ముఖ
మంటపమున్ను మీంది ఉప్పరిగాను కట్టించిరి. ఆ సింగ
రాజుగారి పెద్దకొమారుండైన పావరాజు భైరవదేవుని వైభ

---

* **After some blank space below this line are engroved the Followring lines.**

1. వితస్తివిస్తుతేనాపిస్వైకస్తు వితతతేజసా పీతాంబోధి
2. తోయేన కుంభజేనాప్యగస్తినా । పూవటం కృతేచ
3. యీశానసామాపి తదనంతరం, ఆరాధ్యమల్ల.

వానకు పెద్దఘంట్ల జేగంటభేరి మొదలైనవి సమర్పించ్చి ఆ దేవుని అంగరంగ వైభవాలు నడవనుకడ రామాపురము స్థలములోని తోటను సమర్పించెను ॥శ్రీ॥

## Fowrth Face

శుభమస్తు 'స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబ్బులు ౧౪౪౦ అగునేంటి బహుధాన్య సంవత్సర వైశాఖ శు ౧౫ ఆ శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీకృష్ణ దేవరాయ మహారాయలుంగారు పృథివిరాజ్యం శేయుచుండంగాను సాళువ తిమ్మరసయ్యంగారు మహా ప్రధానులై నడవంగాను వశిష్ఠగోత్రం సూర్య వంశోద్భవులైన హోసబిరుదరగండ।సహకార బాంధవమల్లికా వల్లభరణరంగ భైరవ । గండ్ర ధనంజయ । బిరుదాంకులైన బెజవాడ దుర్గా వరప్రసాదులైన మాధవవర్మ వంశోద్భవులైన కంఠమరాజుంగారి కొమారుండు అన్నల దేవరాజు ఆయన కొమారుండు సింగరాజు ఆయన కుమారుండు పెద వల్లభరాజు ఆ పెదవల్లభరాజుంగారి పెద్దదేవులైన అన్నల దేవి కొమాళ్లు సింగరాజున్ను తిమ్మరాయండున్ను పిన్న దేవులైన రాయకమ్మ కొమాళ్ళు ప్రభాకర పట్టణం గట్టించిన ప్రభాకరరాజున్ను. పాపరాజున్ను ఈ నలుగురిలోనూ తిమ్మరాజుంగారి కొమాళ్లు వుదయగిరి యేలిన బసవరాజున్ను తిరుమలరాజున్ను, వల్లభరాజున్ను, పాపరాజుంగారికిన్ని ధనంజయగోత్రులైన కీర్తిపాటి సిరిగిరి రాజుంగారి కొమారిత

వల్లమదేవులుంగారికిన్ని కొమారుండైన శ్రీ మన్మహామండ్లేశ్వర సింగయ్యదేవ మహారాజులు తమతల్లిదండ్రిఁగారికిన్ని తమ అన్న బసవరాజుంగారికిన్ని పుణ్యముగానున్ను తనకీర్తి సుకృతాలు ఆ చంద్రార్కస్థాయిగా వుండే అట్లుగానున్ను శేయించ్చిన ధర్మాలు ... ... ...పూర్వనాయం కరమయిన చాంగల ... ... ... ...కేశవ దేవరకు గోపురమున్ను

... ... ... ...

కు గోపుర ప్రాకారాలున్ను ... ... గుడిన్ని చాంగమ్మ గుడిన్ని తమ తల్లి వల్లమదేవుఁగారి పేరను తిరుమల దేవర గుడిమంటపమున్ను, వీధిన్ని కట్టించి తమ అన్న తిరుమల రాజు పెట్టిన గుండ్లమడుగు, తిమ్మసముద్రమని అగ్రహారాన్ను వినాయక శివవిష్ణు దేవాలయాలున్ను తటాకారామాలున్ను బ్రహ్మప్రతిష్ఠలున్ను ప్రతిష్ఠించి బెజవాడవద్దను తమ తాత మాధవవర్మకుం ప్రత్యక్షమైన దుర్గాదేవికి తొలినిర్మితమై వుండిన గర్భగృహము ముందరి అంతరాళికమున్ను పదిలం శేయించి ఆ ముందరను తొమ్మిది అంకణాల రంగమంటపమున్ను ఆముందరను భోగమంటపమైన మూండు అంకణాల భద్రమున్ను కట్టించి రాతిగోడాను పెట్టించి పీఠము కట్టించి యప్పుడు భూమిలోన నుండి వెళ్ళ నెత్తిన కేశవ నాథునిన్ని మీాందం ప్రతిష్ఠ శేయించి దుర్గ దేవమ్మ పుర్వ వమై యుండిన కొండ వుత్తరవు దిక్కుచున్న! తూర్పు పడమలూ నిడువు తొంమిది చేతులున్ను ఆ వెడల్పు యేడు చేతులున్ను ఆ పొడవు యెనిమిది చేతులున్ను, నతికించ్చి ధూప అవసరము.

... ... ... ...

ముగాను ధర్మము ప్రతిష్ఠచేసి వ్రాయించ్చి నిలిపిన ధర్మ శాసనము, సంగళమహా శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీం జేయును.

On a broken piller of in front the Kanaka Durga Shrine at Bezwada (First Face)

"శుభమస్తు శ్రీ గణాధిపతయేనమః శ్రీదుర్గాయైనమః అస్తిప్రీతికరం చక్రనామ్నా మానవ్యాయభూమి కా... రాజా ప్రారంభించి మాధవవర్మ ఖ్యాతి రాజాతారాగణేష్విః" అని "రేజేవల్లభరాజేన లక్ష్మీమావిలసత్ర్యమా" అని 2 శ్లోకములు 59 పంక్తులలో చెక్కించెను. ఇంక "Second Face"లో "ఇవాకిలజగతి సకల రిపుకుల మవజిత్య జయ స్తంభ మధి పొట్టునూరువిధాయ" అని ప్రారంభించి "పుణ్యానికర్మాణి మహాంతిభాంతి విరచితాని" అని 129 పంక్తివరకును, చిత్రించి, "Third Face"లో "చతుర్భిశ్శతైః స ఖ్యాతే శకవత్సరె సముదితే శ్రీ శాలివాహాంకితె సైశాఖె బహు ధాన్యకేవరే జయ శ్రీ వాటికాయాం వ్యధాత్ దుర్గాయా నిలయంచమ టపయుగం శ్రీ సింగభూమీపతిః ౨౨ "గంగా భంగాభిషంగాపహరయ ఫణిశ్రీప్రౌఢ నానాకవీంద్ర స్తోమ క్షేమప్రకామ ప్రకటన జనితస్ఫారకీర్తి ప్రశస్తః - తత్త ద్దిగ్జైత్రవృత్త ప్రసృమరవిభవః పాపరాజాబ్ధిచంద్రః - తత్త త్కృత్యం వినుత్యం విధివదతనుతః శ్రీనిధిః సింగ్గరాజః ౨౩

శ్రీ శ్రీ శ్రీ అని 23 శ్లోకములు 141 పంక్తివరకును చెక్కించిరి. 142 పంక్తి మొదలు "శ్రీ దుర్గావరప్రసాదులైన శ్రీ మాధవవర్మ వంశోద్భవులైన కొండమరాజు మనుమండు పాపరాజుగారి కొమారుండు సింగరాజుంగారు యీ బెజవాడ దుర్గాదేవంమకు, అంతరాళిక । రంగమంటప । భోగమంట పాలున్నూ కట్టించి వైభవానకు పెద్దఘంట జేగంట భేరి మొదలైనవి సమర్పించి ఆ దేవుని అంగరంగ వైభవాలు నడపను "కడరామాపురము" స్థలములోని తోంటను సమర్పించెను. శ్రీ 167 పంక్తివరకు పై సంస్కృత శాసనమునకు తెలుగు వివరమును చెక్కించిరి. మరియు "Forth Face" లో శ్రీ విజయనగర సామ్రాజ్యాధిపతియైన శ్రీ కృష్ణదేవరాయలు శ్రీ దుర్గాదేవికి కొన్ని దానముల నిచ్చి మంటపాదులను కట్టించి శాసనము వ్రాయించెను. దాని నీ క్రింద నుదహరించు చున్నాను.

"శుభమస్తు స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౪౦ అగు నేంటి బహుధాన్య సంవత్సర వైశాఖ శు ౧౫ శ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ కృష్ణదేవరాయ మహారాయలుంగారు పృథివిరాజ్యం శేయుచుండంగాను సాళువ తిమ్మరుసయ్యంగారు మహాప్రధానులైనడవంగాన్ను" అని ప్రారంభించి 214 పంక్తిలో "బెజవాడ వద్దను తమ తాత మాధవవర్మకుం బ్రత్యక్షమైన దుర్గాదేవికి తొలి నిర్మితమైవుండిన గర్భ

రను నల్లశీసపురాళ్ళను। అంతరాళికమును ఆముందరను తొమ్మిది అంకణాల రంగమంటపమున్ను । ఆ ముందరను భోగమంటప మైన మూడు అంకణాల భద్రమున్ను కట్టించి । రాతిగోడను పెట్టించి । పీఠముకట్టించి యప్పుడుభూమిలోనుండి వెళ్ళ నెత్తిన "శేశవనాథు" నిన్నిమీదం బ్రతిష్టచేయించి । దుర్గిదేవమ్మ వుద్భవమైవుండిన కొండ వుత్తరపుదిక్కు- చట్ను । తూర్పుపడమలు నిడువు తొమ్మిది చేతులున్ను । ఆ వెడల్పు యేడుచేతులున్ను । ఆ పొడవు యెనిమిది చేతు లున్ను నతికించి దూప అవసరము......ధర్మము ప్రతిష్ట చేసి వ్రాయించి నిలిపిన ధర్మశాసనము॥ శ్రీ దుర్గా దేవమ్మ తన వరప్రసాదులైన యీ గుడి కట్టించిన సింగ రాజుగారికిన్ని, ఆయన కొమాళ్ళు పావరాజు, కొండరాజు, బసవరాజు, వల్లభరాజు, నాగరాజు, బేతరాజు గారికిన్ని ఆయుష్యాభివృద్ధిచేసి వంశాభివృద్ధిచేసి రాజ్యాభివృద్ధిచేసి రక్షిం చును ॥శ్రీశ్రీశ్రీ॥ అని 240 పంక్తివరకు కలదు. అనగా మొదటి ముఖములో 59 పంక్తులు సంస్కృతములోను, రెండవముఖము 60 పంక్తి మొదలు 129 పంక్తి పర్యంతము సంస్కృతములోను మూడవ ముఖమున 142 పంక్తి మొదలు 167 పంక్తివరకు తెలుగులోను నాల్గవముఖమున 168 పంక్తి మొదలు 240 పంక్తివరకు తెలుగులో పై సంస్కృత శాస నమునకు వివరమున్నా చెక్కబడియున్నది. మాధవవర్మ వంశవృక్షమును గురించియు నతడును నతని వంశీకులును శ్రీ కనకదుర్గాదేవి కటాక్షమునకు పాత్రులై విభవాభిరాము లైనట్లు "రాచిరాజు" గారి సీసమాలికలో కలదు

సీ॥ శ్రీకరంబయిరి వ - శిష్ఠ గోత్రోద్భవుల్
సప్తరుషేయులు - సార్వభౌము
లాధరాధీశవం - శావతారాది ప్ర
శస్త వృత్తాంతంబు - విస్తరింతు
అలఘువిక్రముఁడు కో - సల జయాదిత్యుఁడు
దక్షిణ విజిగీష - దాడి వెడలి
నిగమాగమాంత పా - రగుఁడాజి భీష్ముండు
నల దేవవర్మ సై - న్యాధిపతిగ
నఖిలసీమల విజ - య స్తంభములునాటి
దివికేగెను; త్రిలింగ - దేశభూమి
వాహినీపతి దేవ - వర్మ ప్రభుఁడయ్యె
అద్దంకిసీమలో - నాజిఁగొండ్రు
వల్లభునోడించి - వైభవ బులమించి
సార్వభౌమ పదంబు - జగతిఁగాంచె
నతని సుతుండు బు - ద్ధాపనీశుఁడు రాచ
తపసియై కాంచెను - ధర్మనృపుని
తన యూలాతనికి బు - ద్ధయు దేవ వర్మలు
బుద్ధరాజందు ప్ర - సిద్ధుఁడయ్యె
నతని తనూజుఁడా - తతబలోన్నతుఁడు మా
ధవ వర్మనృపతి ము - త్తాతఁబోలి
జనకు నాజ్ఞను సప్త - శతిసాంగముగ రామ
దేశికుచే నుప - దేశ మొంది
కనకదుర్గా కటా - క్షాప్రాప్త విభవుఁడై
మళియు సింగని బోర - మ్రందఁజేసె

చబుబళహాత్తి మ - ళబలాధిపుని రక్త
ధారచేఁ బరదేవ - తను భజించె
వసుదిగింద్రియశక - వత్సరంబుల జయ
వాటికా దుర్గనై భవముఁగాంచె"

అని 55 చరణముల మాలికను వ్రాసెను. ఇందు వలన నితఁడు రక్తధారచే పరదేవతను భజించెననియు నితను శకవర్షములు ౧౦౮౮ క్రీ॥ శ॥ 1166 ప్రాంతములో నుండి నట్లును తెలియుచున్నది. మరియు.

" గగనవాణీవాక్య - గౌరవంబునఁ బూస
పాటి భూమిని బురి - వరముఁగట్టి
వాసిఁగాంచుటఁ బూస - పాటివారను నింటి
పేరుఁగాంచిరి రాచ - పెద్దలందు"

అని యుండుటచే వీరి యింటిపేరు పూసపాటివారని కూడ తెలియుచున్నది. ఈ మాలికను కేతకీవరపు (మొగలి తుర్రు) ప్రభువగు పూసపాటి రాచిరాజు మహారాజులుం గారు రచించిరి. ఈ మాలిక చివర తేటగీతిలో,

సరస సంగీత సాహిత్య - చక్రవర్తి
రాజమార్తాండ (శ్రీ) తమ్మి - రాజ రాజు
రాచిరాజోది తంబుని - భ్రాజితంబు
ధరణి వెలయుత నాచంద్ర - తారకముగ'

అనుటవలన వీరుకూడ మాధవవర్మ వంశమునకుఁ జెందినవారనియు, దండిపండితుఁడనియు తెలియుచున్నది. 'ఋతుగగనాబ్ధి చంద్రశకంబు' నందు అని పేర్కొనుటచే,

నితఁడు శాలివాహన శకము 1406 లో నుండెను. అనగా క్రీ॥ శ॥ 1484 సంవత్సరమగును.

ఇక్లై న 748 రు శాసనములో 'శ్రీ మన్మహామండలేశ్వర చాగి పోతరాజులు ఆ చంద్రార్కముగాం కొండపడ్మటి ప్రాంత జక్కమపూండి అందు రెండు వాడ్లును. నొంచెడ్లపురమును నిచ్చితిమి' అని కలదు. ఈ శాసనమున 18 పంక్తి వరకు సంస్కృతభాషలో కలదు. అందు శాసనదాత వంశవృతము వర్ణింపఁబడినది. న 761 ఉ శాసనములో 'శ్రీ మద్విజయవాటికా ఖ్యాపురీ కృష్ణవిభూషణె ఇంద్రకీలాద్రి మూలాధివాసో పాపవినాశనః గ్రామం రెమ్మనిపుణ్యాదా జక్కరేడ్పల్లి నామ లంకపల్లి వారపురం సంయోజితం దేవతాఖ్య బ్రాహ్మణేభ్యో భోగ భోజనకారణం దానం సదక్షిణాకంతు గ్రామ పంచక తక్షణం ధారాపూర్వమిదం ధర్మం శసవా చంద్రతారకం' అని కొండపల్లి, పాపవినాశనం రెమ్మనపూడి, జక్కరేడ్పల్లి, లంకపల్లి, యీ గ్రామపంచకమును. 'రాజాగజపతిత్మా భూవిఖ్యాతో కపిలేశ్వరః' అని కపిలేశ్వర ప్రభువులైన 'గజపతి రాజు'గారు 'శ్రీమత్సాక్షాబ్దేద్రి వసురగ్ని శశికృమాత్' అనుటచే 1387 వత్సరమున దానముచేసినట్లు కనపడుచున్నది. ఇక్లై న 762 రు శాసనమున 'గొంటూరి నాగదేవండు శ్రీ బెజవాడ మల్లేశ్వర మహాదేవరకు ఉయ్యారి బద్ద పీరవల్లి' శకవర్షంబులు 1053 న ఆ చంద్రార్కముగా నిచ్చినట్లు కలదు.

నె 772 రు శాసనము శకవర్షములు 1359 పింగళ సంవత్సర శ్రావణ బ ౧౧ సోమవారమునాడు బెజవాడ మల్లేశ్వర శ్రీమన్ మహాదేవరగుడి భోగపు వడతి 'పినకూనుతలా భర్తని కూతుఋ' 'శీరామాయు' కృష్ణవేణీ తీరమందు, 'బెజవాడను శాసనస్థమై అష్టభోగ తేజస్వామ్యముగాను చెల్లి వచ్చె క్షేత్రము నాలుగుపుట్లు వల్నాను పాపవినాశన దేవరకు నిత్యధూపదీపనైవేద్య అవసరాలకు ఖ ౨ నేల నా చంమ్మకు ... ...ఖ ౨ కృష్ణవేణ్యా లోపలను ధారవోశి ఆ చంద్రార్కస్థాయిగాను యిచ్చెను. యీ ధర్మముపాలించిన వారికి దాసి దాసిని' అని వ్రాయించెను. ఈ తీరునే 773 శాసనములో 'పినకూనుతలా బత్తుని కూతురు, మాచలిదేవి' తనకు చెల్లేవిర్తి క్షేత్రాలు పాతూరను పుట్టెండు క్షేత్రమున్ను, 'తాడేపల్లి'ని పుట్టెండు క్షేత్రమును, 'పెనుంబాక' ను, పుట్టెండు క్షేత్రమును. గొల్లపూండి'ని పుట్టెండు క్షేత్రమును, 'నరూరి' గ్రామానను పుట్టెండు క్షేత్రమున్ను, 'నున్న' గ్రామానను పుట్టెండు క్షేత్రమున్ను, 'గుడుందల' గ్రామానను పుట్టెండు క్షేత్రమున్ను. 'వెనికెపద్ది' గ్రామానను పుట్టెండు క్షేత్రమును ఈ పది గ్రామాల కేసరపాటి పదిపుట్లు క్షేత్రమున్ను. పృధింగల గోత్రంవారికి ఋణ్యముగాను ధారవోశి యిచ్చినట్లు కలదు. 'పట్టమెట్ట' గ్రామాన పుట్టెడు 'పులుపాక' గ్రామాన పుట్టెండు క్షేత్రమును' అని తరువాత వ్రాయఁబడినది. ఈ శాసనములు చాలా ముఖ్యములైనవి, ఈ శాసనదాత్రి లికుపురు వేశ్యలే. వీరే శ్రీ స్వామివారికి ఎక్కువ భూదానములు చేసిన పుణ్య

పణ్యాంగనలు, ఈశాసనములు A. R. No. 319-319 A. గా రికార్డు చేయఁబడినవి. అందు ఇట్లు వ్రాయఁబడియున్నది. Below this art cut four dancing figures with the labels. మచభత్తుడు, శరమక్కి, పినకూన భత్తుడు, and మచలిదేవి Vide plate VIII A. Below this line the stone is cut off' అని కలదు. ఇందుదహరింపఁ బడిన గ్రామములన్నియు కొలది మార్పులతో నేడు బెజవాడ పరిసరములఁ గలవు. యిందు నరూరు గ్రామ మేదియో తెలియుటలేదు. గుడుండల అనగా గుణదల కపిలేశ్వరపుర శాసనములోకూడ నిట్లె పేర్కొనఁబడినది. వెనికెపద్ది అనగా ఎనికేపాడు. పట్టమెట్ట అనగా పటమట గ్రామము. ఈ శాసనము 10-11 పంక్తులలో 'ఇందుకు ఇంద్రకీల పర్వతమున్ను, కృష్ణవేణ్యాను మల్లిఖార్జున దేవరానుసాక్షి' అని వ్రాయించిరి. మరియు భోగం బత్తినేని పేరారి కొడుకు (శ్రీ) గిరిభక్తుండు మల్లేశ్వర దేవర దక్షిణానను వినాయక దేవరకు కట్టించె భద్రం 'గుడికట్టించినట్లు కలదు- కాని అన్ని శాసనములలోకి ఈ యుద్ధమల్లుని బెజవాడ శిలా శాసనము చాల ముఖ్యమయినది. చారిత్రక ప్రసిద్ధి చెందినది. కాన దీనినిమాత్రము కొంత విమర్శింతును ఈ యుద్ధమల్లుడు గుంటూరు మండలాంతర్గత చేబ్రోలునుండి యిచ్చటకు వచ్చి మల్లేశ్వరాలయమున నొక కుమారస్వామి యాలయమును, శివభక్తులు నివసించుటకొక మఠమును, దేవీ దేవరుల కొక కళ్యాణ మంటపమును కట్టించినట్లు, శిలా శాసనములో కలదు. ఇది బెజవాడ మల్లేశ్వరాలయములో

నొక తాతిమీద మూడు ప్రక్కలను చెక్కబడి యున్నది.
Epigraphia Indica Vol X V లో రిపోర్టు కాబడినది.

మధ్యాక్కర.

'స్వస్తి శ్రీ నృపాంకుశాత్యన్త వత్సల సత్యత్రినేత్ర
విస్తర శ్రీ యుద్ధమల్లుఁ డనవద్య విఖ్యాత కీర్తి
ప్రస్తుత రాజా శ్రయుఁడు త్రిభువనాభరణుఁడు
సకల వస్తున మేతుఁడు రాజసల్కి భూ (1) వల్లభుఁ డ్త్రిదన్ ౧
పరగంగ బెజవాడ గొమరస్వామికి (2) భక్తుఁడై గుడియు

నిరుపమమతి నృపధాముఁడై ంచెనొగి దీర్చె (3) మఠంబు
(4) గొరగల్గాకొరు (4) లినువిడిసి బృన్దంబుగొనియుఁడువారు
పరిగాకయు బ్బారణాసి వచ్చిన పాపంబు గొండు ౨
నెలయంగవియ్యోట్టు డస్సి మరినుకె (5) విడిసిన వ్రోల
గలతాన పతులును రాజు పట్టంబుగట్టిన పతియు
సలియ బైవారల (6) వెల్వతించిన నశ్వమేధంబు
ఫలంబు (7) పేకించినలింగంబతిపిన (8) పాపంబు దమకు ౩
జనమత చేబ్రోలనుండి బెజవాడ జాత్రకు (9) వచ్చి
త్రిణయను సుతుఁడు చోళు మెచ్చక తివిరియున్నలవ
యన ఘుఁడు కేకొనియుండు ప్రత్యక్షమైయున్న నిచ్చ (10)
గనిమల్లనాం చెగుడియు మఠంబును (11) గాతిక కేయునకు ర
దనింజే బ్రోలు దేవడు వార తిరం బేలుచువారుఁడు పోటిగొరగ
(లు)ను బెట్టువేరుగను జ(ను) యీ స్థితిసేకొణి కాచువార
దీర్దారు నిల్పినవారు (స్థి)తి దప్పియతీపుట వాసంబుగాన.

మధ్యాక్కర:-

రమనతో(12) బెజహాడకెల్ల బెడంగును రక్షయుంగాను
ద్దమతాత మల్లపరాజు వేర్వెఱుదానుం గట్టించెం
గ్రమమున (13) దానికి కలశబడ్డల్లు (14) గా మొగమూడు
వమరంగ శ్రీయుద్ధమల్లు గ్ణొత్రించె నమితతేజుండు   గీ

తన ధనుర్జ్యా వాడంబడి కాచు నృపులకున్న సంపూర్తి

(1) వల్లభుగ్ఢారి          అని చదువునది
(2) గొమరసామికి          ,,
(3) మఠము          ,,
(4) ఇక్కడ "గొరగల్గాక" అను వో "ల" కారము తేల్చి పలుకవలయును.
(5) విడిసినంబ్రోలం          అని చదువునది
(6) నవియం బైవారల          ,,
(7) ఫలము          ,,
(8) ముఱిసిన          ,,
(9) జాతిరకు అనసది సాధురూపము
(10) యిందుం బ్రత్యక్షమై యున్న నిచ్చం" అనిచదువవలెను
(11) మఠమును          ,,
(12) రమణతో          ,,
(13) క్రమమున          ,,
(14) విడ్డట్లు          ,,

అని సాధుపాఠమును చదువుకొనవలయును.

ఈ యుద్ధమల్లుని శిలాశాసనము యొక్క రాతిపలక మీద చెక్కబడి బెజవాడలో శ్రీ మల్లేశ్వరస్వామి వారి

యాలయ ప్రాకారమధ్యమున వంటశాలముందు వసారా యడుగున, యితర రాతిపలకలతోఁ బాటు స్థాపింపఁబడి యుండ Government Epliqraphists గవర్న మెంటు శాసనపరిశోధకులచే 1892 సంవత్సరమున కనిపెట్టబడినది. దానిని వారు తీయించి ఆలయములో భద్రపరిపించియున్నారు. 1917 సం॥రములో యీ శాసనమును గురించి శ్రీ జయంతి రామయ్యపంతులుగారొక పుస్తకములో ప్రకటించియున్నారు. అందులో యీ శాసనదాత పూర్వ చాళుక్యరాజులలో నొక రగు యుద్ధమల్లుఁడనియు, నిది క్రీ॥ శ॥ తొమ్మిదవశతాబ్ద మధ్యకాలమున పుట్టబడి యున్నదనియు వ్రాసియుండిరి. దానిపై కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు "ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 10వ సంపుటము ప్రథమ సంచికలో "ఆంధ్ర కవితా పిత", అను శీర్షిక క్రింద వ్రాసిన వ్యాసములో యిది రామయ్యపంతులుగారు చెప్పినట్లు, యీ శాసనకర్త పూర్వ చాళుక్య రాజనుటకు వీలు లేదనియు క్రీ॥ శ॥ 1202 ప్రాంతమునయున్న విజయాదిత్యుని కుమారుఁడగు 'మల్లభూపాలుని' శాసనమై యుండునని, యిందు ప్రయోగింపఁబడిన 'సల్కి' శబ్దము చాళుక్య శబ్ద భవము కాదనియు, యీ శాసనమునఁగల యితర పేర్లనుఁ బట్టి 13వ శతాబ్దములోని దేమోనని యూహించిరి. ఇది రాతికి మూడుప్రక్కల 46 పంక్తులలోఁగలదు. ఇందు 36 పంక్తులలో నొక శాసనమును మిగతాది మరియొక శాసనమని రామయ్య పంతులుగారి యభిప్రాయము. రావుసాహెబ్, హేచ్, కృష్ణశాస్త్రిగారు 21 పంక్తులొక శాసనమనియు,

15 పంక్తులలోక శాసనమనియు, ఆఖరు 10 పంక్తులింకొక శాస
నమనియు నిర్వచించిరి. ఇదంతా ఒకే శాసనమని బ్రహ్మయ్య
శాస్త్రీగారిఅభిప్రాయము ఇంతకుమూలము, ఇది 'నన్నయ్య
భట్టా'కు పూర్వమా? పరమా? అను విచారణాంశమున శ్రీ
జయంతి రామయ్య పంతులుగారు యీశాసనమును నన్నయ్య
భట్టారకునకు రెండు శతాబ్దములు పూర్వమునకు నెట్టిరి.
బ్రహ్మయ్యశాస్త్రిగారు రెండు శతాబ్దముల తరువాతకు నెట్టిరి.
ఈ శాసనముక్రింద మహామండలిక బంగయ నాయకుని
గురువును గుముడూరు వాస్తవ్యులునగు ఈశ్వరభట్టు సోమ
యాజులు బెజవాడ శ్రీ మల్లేశ్వరస్వామివారికి అఖండ దీప
మునకు గోవుల నర్పించినట్లు కలదు. వెనుకప్రక్క ప్రథమ
కులోత్తుంగ చోడుని కాలమునాటి శాసనమొకటి కలదు.
1వ కులోత్తుంగ చోడదేవుఁడు శకవర్షములు 1063లో సింహా
సనమునకువచ్చెను. కాన యితని కాలము 1104 అయి వుండ
వచ్చును. ఇందు వలన శాస్త్రిగారు చెప్పినట్లు 13శతాబ్దములో
నున్న హంశము సరికాదని శ్రీ నడింపల్లి జగన్నాధరావు
గారు విమర్శించి ఆంధ్రపత్రికలో దుర్మతి మార్గ శీర్షములో
ప్రకటించిరి. కాని యీ శాసనము 1వ పద్యములో 'నృపాం
కుశ; సత్యత్రినేత్ర, త్రిభువనాభరణ,' అనుబిరుదులు పూర్వ
చాళుక్యులకు లేవు. పూర్వ చాళుక్యులకు "త్రిభువనాంకుశ,
సర్వలోకాశ్రయ, సత్యాశ్రయ, రాజమార్తాండ, రాజ
నారాయణ, విష్ణువర్ధన, అను బిరుదులే కానవచ్చుచున్నవి.
ఇందు కుమారస్వామికి గుడి, శైవభిక్షుకులకు మఠమును
కట్టించినట్లు కనపడుచున్నది.

ఇంక 'యుద్ధమల్లుడ' నునది నామమా? బిరుదా? అనుసంశయమునకు శాసనము 27, 23 పంక్తులలో మల్లదెత్తించె గుడియు, మఠము' - నియు, 2, 3 పంక్తులలో 'విస్తర (శ్రీ) యుద్ధమల్లుణ్ను, అను విశేషణములవలన బిరుద నామమేమో యని తోచుచున్నదరి. రామయ్య పంతులు గారు తమవద్ద వున్న చాళుక్య భీముని నాటి తామ్ర శాసనములో 'తత్సూనుర్విజయాదిత్యో భీమసల్కి నామానయ్ తత్పక్ష దక్షిణ గంగ బల చర్జిన్యః' అని ప్రయోగమున్నదని చెప్పి చూపిరి. అటులయిన ప్రథమ చాళుక్య భీముడు క్రీ॥ శ॥ 888 నుండి 918 వరకు పాలించెను. ఇతని పెద్దకొడుకు విజయాధిత్యుడు' 918 లో సింహాసనమెక్కి 6 నెలలకు చనిపోయెను.

ఇతనికి అమ్మరాజు విష్ణువర్ధనుడు,... బేట విజయాదిత్యుడు యితని తమ్ముడు యుద్ధమల్లుడు (విష్ణువర్ధనుని కుమారుడు గణగవిజయాదిత్యుని తమ్ముడు) కొమారుడు తాళరాజు యితనిని, చెఱగొని సింహాసన మాక్రమించుకొనెను. బేట విజయాదిత్యుని తమ్ముడగు భీముడు తిరిగి తాళరాజు నుండి 926-927 సంవత్సరంలో సింహాసనమును గ్రహించెను. అతనిపిమ్మట తాళరాజు కుమారుడు యుద్ధమల్లుడు ఆ సింహాసనమునుగొని క్రీ॥ శ॥ 927 లగాయతు 934 వరకు పరిపాలించి యుండినట్లు కన్పట్టు చున్నది. ... ఇతడుకాక శాసనములో 'రాజాశ్రయుడను విశేషణముచేత పూర్వ చాళుక్య చోళమండలములను 'హొసలబళ్ళాల' రాజులచేత జయింపబడిన తరువాత దక్షిణ గంగ వంశ

ములో కడపటివాడగు యీ 'మల్లదేవుడు' రాజేంద్ర కులో
త్తుంగ, చోళదేవుని నాశ్రితుఁడై యుండవచ్చునని 'మల్ల
దేవుడ'ను కాత, 'మల్లవదేవుఁడ' ను మనుమడు. యీ
దక్షిణ గాంగ వంశములో మాత్రమే కనపడుచున్నారు. అని
అభిప్రాయపడిరి. కాని గుంటూరు మండలాంతర్గత కొణి
దెన గ్రామములోని శ్రీ శంకరేశ్వరస్వామి ఆలయములోని
శాసనమున పాకనాటిని పాలించిన భూపతి రాజవంశమున
కాతమనుమలు 'మల్లపరాజుల' ను వారలుండినట్లు కన్పట్టు
చున్నది. వీరు మధురాంతక పొత్తపి చోళవంశికులు
(తెలుఁగు చోళులు. ఈశాసనము క్రీ॥ శ॥ 1146లో కలదు.
మరి వీరలెవ్వరో? సూర్యవంశమున 'కరికాల చోడుడు,
మహిమానచోడుడు, సిరికట్టముఁడు తొండమానుఁడు
చోడ బిజ్జరుఁడుఁ మల్లదేవుఁడు. మధురాంతకుఁడు, సిద్ధ
భూపతి, మల్లదేవుఁడను వారలు కాన్పించుచున్నారు ఇంక
త్రిభువన మల్లదేవుని శా॥ శ॥ 1064 నాటి శాసం మొకటి
కలదు. కాని శాసనస్థ సల్కి' శబ్దమునుఁబట్టి సాధించవలసి
యుండును. 'సల్కి, చాళుక్య' శబ్దములు సమానార్థకము
లని నా అభిప్రాయము. మొత్తముమీద తేలిన పర్యవశాన
మేమన యిది చాళుక్యుల శాసనము కానేకాదనియు,
చాళుక్య లదియైనను 13 శతాబ్దమ నందుండిన చాళుక్య
మల్లపరాజది యనియు బ్రహ్మయ్యగారి మతము. ఇది
చాళుక్యులది యెంతమాత్రమును కాదు. దక్షిణగాంగులలోని
మల్లపరాజుదో మరి యే మల్లపరాజుదో అగును; కాని
బ్రహ్మయ్యగారను నట్లు 13 శతాబ్దమునాటిది కాదు.

నన్నయకాలపుదో కొంచెము తరువాతదో అని అని జగన్నాధరావుగారి యభిప్రాయము. కాని యిది వాదమునకు తావుకాదు. మొత్తముమీద మూడు సారాంశములు లేర్పడుచున్నవి.

అవి యేవన? (1) ఈశాసనకర్తయైన యుద్ధమల్లుఁడు చాళుక్యుఁడేనా? (2) చాళుక్యుఁడేయైన యెడలనితఁడెవఁడు? ఏ కాలపువాఁడు? (3) శాసనాక్షరములనుబట్టి యిది పదకొండవ శతాబ్దమునకుఁ బూర్వపుదియని నిర్ణయించుటకు వీలుకలదా? ఇవి విచారణీయాంశములు. వీటికాధారములు. శిలా తామ్ర శాసనములు. చాళుక్యుల శాఖలు ముఖ్యముగ చరిత్రలయందు 5 ఖ్యాతిఁజెందినవి.

(1) బదామి(వాతాపి) రాజధానిగా చేసుకొని క్రీ॥శ। 610-760 వరకు రాజ్యము చేసెను. ఇంక రెండవ శాఖవారు కల్యాణ పట్టణమున,973-1190 వరకు రాజ్యమనేలిరి వీరిద్దరిని పశ్చిమ చాళుక్యులందురు. ఇంక 3వ శాఖవారు గుజరాతు దేశమునందు ప్రభుత్వమునుఁజేసిరి. క్రీ॥శ। 634-740 వరకు వీరుగాక 'సోలకి, సోలంకి' అను వంశనామములో మరియొకశాఖలో వారు గుజరాతులోను మార్వాడులోను రాజ్యమేలిరి.5వ తెగవారు రాజమహేంద్రిమందలి తూర్పుచాళుక్యులు. వీరుఁగాక చోళులు ఆంధ్రదేశమును ఆక్రమించుకొనిన తరువాత వారి బంధుత్వమువలన చాళుక్యులు పెక్కండ్రు దక్షిణదేశమునకుఁబోయి చిన్నచిన్న రాజ్యములను సంపాదించుకొని శాసించుచూవచ్చిరి. వారనేక శాసనములను వ్రాయించిరి.

ఇట్టి చాళుక్యుల శాసనముల వలనను, యితరులు వారిని గురించి వ్రాసిన శాసనముల వలనను 'సళ్కి' శబ్దోత్పత్తిని నిర్ణయింతము. యుద్ధమల్లుని శాసనము చాళుక్యరాజు వేయించినది కాదు అని వాదించువారికి, యీ శాసనమందు 6పంక్తిలోనున్న "రాజసల్కి భూవల్లభుడు" అను ప్రయోగములడ్డములగును. ఎందుకన 'సల్కి' శబ్దమునకు 'చాళుక్యుడ'ని యర్థముకావున వీరు "మూలెకుతారము" వేసిన బాగుండునని తలచి, 'సల్కి' అనగా 'చాళుక్యుడ'న కూడదు. అశబ్దమునకు నాయర్థము లేదు అని వాదించియుండిరి. ఈ విషయము పురాతన లిపి శాస్త్రమును, చదివి, శిలాతామ్రశాసనముల సాయమున నభ్యసించిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ మానవల్లి రామకృష్ణకవి, కీర్తిశేషులైన కొమర్రాజు లక్ష్మణరావు పంతులు, వేటూరి ప్రభాకరశాస్త్రిగార్లవంటి పండిత విమర్శకులకు సులభముగ తెలియును శ్రీరామయ్యపంతులుగారు 'సల్కి' శబ్దము, 'చాళుక్య' శబ్దభవమని వ్రాసియేయున్నారు. కాని యీవిషయములో శ్రీలక్ష్మణరావుపంతులుగారు, రామయ్యపంతులుగారితో నేకీభవించలేదు 'సల్కి' శబ్దమే మొదటిది. ఇది కొన్నాళ్ళకు 'చల్కి' అనురూపము తరువాత ॥చలుక్కి॥ యను పేరుగలతెగ పూర్వము దక్షిణ హిందూదేశమునగలదట అందుండి రాజులు జనించి గొప్ప వారయిన తరువాత 'చాళుక్య' అను సంస్కృత రూపమును కల్పించుకొనిరి 'చాళుక్య, చళుక్య, చలుక్కి, సలుకి, చలికి, సల్కి' అనునవి శాసనములయందు పేర్కొనబడుటచే నివి అన్నియు నొక్క శబ్దముయొక్క రూపాంతరములై యున్నవి.

(1) ఇందు కుదాహరణముల నీక్రింద నిచ్చుచున్నాను చదువరులు గమనింపఁగోరెదను చాళుక్య శాసనములలో "చాళుక్య" శబ్దము, "చళుక్య" అను హ్రస్వరూపముతో పెక్కుసారులు వచ్చుచుండును, ఉత్తర కాలీన చాళుక్యుల శాసనములలో నీరెండురూపములకభేదమైనను, పూర్వకాలమునకుఁ బోయినకొలదిని "హ్రస్వ" రూపమునకే యెక్కువ ప్రచారము కలదు. ఈ విషయమును "పూర్వ పశ్చిమ చాళుక్యుల శాసనముల పట్టిక" కీలుహారన్ ఎపిగ్రాఫియా ఇండికా" 8 సంపుటమున యివ్వఁబడినదానిని, డాక్టరు ఫ్లీటు దొరచే వ్రాయఁబడిన "డైనాస్టీస్ ఆఫ్ సదరనిండియా" అను పుస్తకములోని చాళుక్యుల చరిత్రమును "ఇండియన్ ఆంటిక్వేరీ" 20 సంపుటములో ఫ్లీటుచే చర్చింపఁబడిన తూర్పు చాళుక్యుల శాసనములను, తూర్పుచాళుక్యుల యితర శాసనములను చూడనగును.

(2) "చళుక్య" శబ్దము "చలుక్య" అని "లు" కారమధ్యముగ వ్రాయంబడును.

(3) దీనికి ప్రాచీనకాలమున "చల్క్య" అనురూపము కూడ యుండెను. Badami Cave Inscription of Krithivarma 1578 A. D. Ind, Ant vol VI Page 362 text lines 3 & 4 దీని పటముకొరకు vol X Page 58 లో చూడుడు. "సల్కి" శబ్దము చాళుక్యశబ్దమైనట్లు కీ॥ శే॥ గురజాడ అప్పారావుగారు ఆకాలమున నొక వ్యాసమును వ్రాసియుండిరని మా గురువరేణ్యులు శ్రీ ప్రభాకరశాస్త్రి

గారు చెప్పిరి. కాని తెలుఁగుభారతమునందీ రెండు రూపము లును కలవు.

(4) ఈ శబ్దమునకు పూర్వకాలమునందును తర్వాత కాలమందును "చళుక్య" "చలుక్య" అను రూపములు కూడ నుండెను. ఇందు ప్రమాణములు.

A చలుక్య:- Navasu grant of Avanijanasraya pulikesin Proceedings of Aryan Section of the Seventh International Congress of Orientalists P 232 & plate.

B చాళుక్య వంశ:- E. P. R. 375 of 1911 చిత్తూరుజిల్లా.

C చాళుక్య యర్సర్ :- Nellore Inscriptions Budur No 54.

D చాళుక్య నారాయణ:- P. O. Budur Venkatagiri No. 19.

E చాళుక్య పట్టు:- E. P. R. 51 of 1908 ఉత్తర ఆర్కాటుజిల్లా.

F సర్వలోకాశ్రియ శ్రీ విష్ణువర్ధన మహారాజా సాళుక్య విజయాదిత్తన్ :- E. P. R. 44 of 1896 ట్రివెన్కూరు.

G చలిక్:- E, P. R. C. — of 08.9 కోక్కిలి మహారాజుది.

'H శశికుల చాళుక్య:- Nellore Inscriptions Venkatagiri No. 7

I శశికుల చాళుక్కి:- Nellore Inseriptions Venkatagiri No. 11.

J చళుక్కి:- No. 5 of 1892 Madras G. O 6th Awgust 1892 Nos 544 and 45.

(5) ఆర్య భాషలలోను, ద్రావిడ భాషలలోను, 'చ, స. శ' అను వ్యంజనముల యుచ్చారణలు ఒకదాని కొకటి బదులు మారుచుండును. ద్రావిడ భాషలలో నీ మార్పు సర్వ సహజమనుటకు అరవమున నీ మూడింటికి నొక్క యక్షరమే కలదని చెప్పిన చాలును. ఇది సర్వాంగీకృత నియమము గనుక నిందును గురించి చర్చించుట అనావశ్యకము. శాసన ప్రమాణములతో పై జూపఁబడిన వేఱు వేఱు రూపములనుఁబట్టి విచారింపగా 'చలుక్కి' శబ్దము మూలమైనదనియు, అందుండి దేశ్య 'సల్కి' సంస్కృత 'చాలుక్య' శబ్దములు సిద్ధించినవనియు, మన మూహింప వచ్చును మూలమైన 'చలుక్కి' కూడ దేశ్యమె. యిట్లు చాలుక్య శబ్దమునకు 'సల్కి' శబ్దమునకు సంబంధము లేదన్న వ్యుత్పత్తి వాదమును యుక్తివాదమును నిరాధారములగు చున్నవి ఇంక ప్రత్యక్షముగ 'సల్కి' 'సలుకి' శబ్ద ప్రయోగములను గురించి విచారింతము.

(1) నల్లవీరట్టగుడి, చళిక్కిరట్ట గుడి E. P. R. 400 of 1902 కడపజిల్లా, కమలాపురము తాలూకా.

(2) వల్లవసల్కి E. F. R. 401 of 1904.

ఈ రెండు శాసనములలోని "వల్లవ" శబ్దమునకు "పల్లవ" అనియర్థము. దీనిపై శ్రీయుత వి. రంగాచార్యులవారు

" Vallava, Salki Evedently indicotes acombination Chaluklyan of and Pallava or Rashtrakuta liners" Vol I P. 6 0 అని వ్రాసిరి.

3. తత్పూనుర్విజయాదిత్యో భీమసల్కి నామానం తత్సుతః దక్షిణ గంగ బలం చనిర్జిత్య E. P. R. C P. No. 14 of 1917 - 18 ఈమాట 'నృపేంద్ర మృగరాజ'ని బిరుదు నామముఁగల 2 వ విజయాదిత్యుని గురించి చెప్పఁబడినది. ఇయ్యది ప్రథమ చళుక్య భీముని తామ్రశాసనము, శా॥ శ॥ 814 (క్రీ॥ శ॥ 892) నాటిది. దీనినే శ్రీ జయంతి రామయ్య పంతులుగా రుదహరించిరి. దాని కొప్పక యుందలి 'సల్కి' శబ్దమునకు 'చాలుక్యుఁడ'న్న యర్థము కానేకాదని రుజువు చేయుటకు ప్రతివాదు లిద్దరును తమ పాండిత్యమును చాక చక్యమును అంతయు వినియోగపఱిచిరి కాని యుందలి 'సల్కి' శబ్దమునకు 'చాలుక్యుడు' అనియే యర్థమైనటుల మఱి రెండు శాసనములు చెప్పుచున్నవి. ఇది ప్రభుత్వమువారిచే వెలువరింపఁ బడినవి.

(4) భీమసళుకి E. P. R. C, P. No. 5 of 1911-12 ఇదువలన మూడవ విజయాదిత్యునకు భీముఁడు అనఁబడు తమ్ముఁడుండెననియు, వాడే "భీమసల్కి" యనియు, వానిని యోడించి విజయాదిత్యుఁడు రాజయ్యెననియు స్పష్టపడు చున్నది. ఇక నైనను భీమసల్కి అనగా "భీమచాళుక్యుఁడ"ని రూఢియగుచున్నదికదా? ఈ శాసనమునందు "సాళుకి" అను రూపము కలదు. ఇదియే "సల్కి" అగు మాటలోగాని,

యిందుండి 'సల్కి' రూపము వచ్చుటలోగాని వింతలేదు. ఈ అక్షరము మొదట "కె" గా చెక్కి, తరువాత దానిని "కి" గా మార్చినట్లు కానవచ్చుచున్నది.

(5) భీమసళుక్య నామానం స్వానుజం నిర్జిత్యగృహీత వేంగీదేశః। గుణకవిజయాదిత్యుని సాతలూరు తామ్రశాసనము, యీశాసనమును. కీ॥ శే॥ శ్రీయుత కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు ప్రకటించి యుండిరి దీనిని శ్రీ యుతులు విమర్శకాగ్రేసరులు, భావరాజు కృష్ణారావు పంతులు ఎం.ఏ ఎమ్ ఎల్. గారు నాకు చదివి చెప్పిరి. అంతనీసైసంగతి రెండవ విజయాదిత్యుని గుఱించియే చెప్పఁబడినది. కావున అతనికి భీముఁడన్న తమ్ముఁడున్న సంగతి స్పష్టపడుచున్నది. అతఁడు 'భీమసల్కి, భీమసళ్కి, భీమసళుక్కి' అని పిలువఁబడు చుండెను. అతఁడన్నపై తిరుగఁబడి "దక్షిణగాంగుల" సాయమును వడసి, రాజ్యమునకై కొంత పోరినట్లున్నది. ఈరెండు శాసనములవలన 'సల్కి' శబ్దము చాళుక్యార్థకమే యని స్థిరపడుచున్నది.

ఇట్లు యుద్ధమల్లుఁడు 'రాజసల్కి భూవల్లభుణ్డు' అగుటచే 'చాళుక్యుడ'ని యందరును యొప్పుకొనిరి. మరికొందరు 'రాజసల్కి భూవల్లభుణ్డు' అను పదమునకు నర్థమే కుదరలేదని వాదించిరి. 'రాజసల్కి' యనగా రాజచళుక్యుఁడు. 'భూవల్లభుణ్డు' అనగా భూమికిఅధిపతి. ఇచ్చట భూవల్లభశబ్దమునకు రూఢ్యర్థమునుఁగాక యౌగికార్థమును తీసుకొన వలెను

ఇట్లు చేసినందువలననే వ్యాకరణ సూత్రమును వ్యర్థము కాదు ఏఛందోనియమమునకును భంగము లేదు. ఏఔచిత్యమును లోపించదు. 'రాజరాజనరేంద్రుఁడు' అనుశబ్దమునందు ఏకార్థక పదములు మూడున్నను దోషము లేదను వాదము ప్రసిద్ధము కదా! ఇందు రెండుమాత్రమే కలవుకదా! 'రాజసల్కి—భూవల్లభుణ్ణు' అనగా చాళుక్యరాజరాజు అని అర్థముకుదురునని శాస్త్రిగారే అంగీకరించిరి. కాన యుద్ధమల్లుడుచాళుక్య భూపతియనువాదమే సర్వపండితాంగీకారమైనది ఇంకను జమ్మిదొడ్డి మంటప స్తంభములమీదను, పరిసరప్రాంత శిలల మీదను నలుబదియారు ప్రాచీన శాసనములను చూచితినని చీనాదేశయాత్రికుఁడగు "హుయాన్‌చ్వాంగ్" (Huyansong) తన చరిత్రమున పేర్కొనినాడు. ఇవియన్నియు శ్రీ మదరాసు శాసన పరిశోధన శాఖవారు సౌతు ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్సు వాల్యూం నాలుగు(South Indian Inscriptions Vol IV) లో 712 నెంబరునుండి 797 నెంబరువరకు 85 శాసనములను ప్రకటించిరి. ఇవియన్నియు 1892 సం॥రములో 260 నెంబరు మొదలు 337 వరకు ఆర్కియాలాజికల్ రిపోర్టు కాబడినవి ఇందు చాలభాగము శ్రీ మల్లేశ్వర స్వామివారికి అఖండము నిమిత్తము "మోదాలు" మొదవులు, ఆవులు, ఇస్సఎడ్లు=ఎనుములు (గేదెలు) గొఱియలు (గొఱ్ఱెలు) మేంకలు (మేకలు) యిట్టి పశువులను బోయీలకిచ్చి, నిత్యము మానెండు లేక తవ్వెండు నెయ్యి అఖండదీపమునకు ఆచంద్రార్కము యిచ్చునటుల వ్రాయించియుండిరి. ఈ శాసనములన్నియు శాలివాహన శకవర్షములు ౧౦౪౬ మొదలు ౧౧౭౮ వరకు

మాత్రమే కలవు. 12 వ శతాబ్దములో నొకటియు, 13 వ శతాబ్దమున రెండుమాత్రము కలవు.

## పల్లకేతు భూపాల శాసనము

ఈ శాసనము సౌతుయిండియన్ యిన్స్ క్రిప్షన్సు ( South Indian ins criptions Valume X Page 8 ) పదియవ వాల్యూము 8 వ పేజీలో నె 22 రుగా ప్రకటింపబడియున్నది. మరియు 1909 సంవత్సరములో నె 536 రున ఆర్కియాలాజికల్ రిపోర్టుచేయఁబడినది. అందిట్లున్నది.

"On a mutilated slab dug up in the courtyard of the temple of Ma lleswara, Bezwada Kistna District."

DATE MISSING

" In complete refers to pallaketubhupala of the Kadvetti family Incidentally mentions many favours bestowed by God Malleswara on Arjuna, Madhava Varma and panditaradhya."

వితస్తివిస్త్రీతేనాపిస వైఃస్తులితతేజసా
పితాసేహాద్ధితో యేనకుంభజేనాప్యగస్తినా
పూవఽంకృతజయే శాననామాపి తదనంత్రరం
ఆరాధ్యమల్లయుద్దేన ఫల్గునేనకృతాభిదః
మల్లేశ్వరఇతిఖ్యాతసన్నిధత్తే మహేశ్వరః
శ్రీవిజయవాటికాఖ్యాపురే- కృష్ణావిభూషణే

కలౌశ్రీ మత్చాలుక్యాబ్దేఽబ్ధి శశిసాయక సంమ్మితే
రాజామాధవ వర్మాఽభూద్విఖ్యాతో ధరణీతలే।
తతస్స్వపుత్రేణహా తెతింత్రిణీజీవినీసుతె
ధర్మసంరక్షణార్థాయ స్వపుత్రమవధీత్సరాట్॥
తతో మల్లేశ్వరః ప్రీతః స్వర్ణవృష్టిం వవర్షచ।
శిశుపుత్రకయోః ప్రాణందత్త వాం స్తస్యకీర్తయె॥
తతః శ్రీ పండితారాధ్యనామ్నా భక్తోత్తమేనచ
శివభక్తా ఏవనూనం దేవర్షిభ్యోఽధికాఇతి
చీనాంబరేగ్నిం సంస్థాప్యశమీకోమలశాయా
బద్ధెమల్లేశ్వరః ప్రీతః ప్రత్యక్షస్సమజాయత
ఈదృగ్విధంమహాదేవం భక్తవత్సల మవ్యయం
మల్లేశ్వరంసమారాధ్య రేజి రేప్రిథివీభుజః।
స్వస్తిపరమవంశోద్భవ, భారద్వాజగోత్ర
ఖట్వాంగధ్వజవివిమ భలాంఛన
కాంచీపురేశ్వరకడువాయుపజ ఘోషణ
పల్లవకుల తిలకపాదాంబుజసేవిత
అం నువశామ కులాదినాయక అనేక బంధుజనాశ్రయ
పతిహితాచరణ పతిమెచ్చుగండ నొడువడి
సాహసార్జన సంగ్రామ రామసమరైకభీమ
డకుం-నూళ్ళశాసనాధిప శ్రీ బెజవాడ
మల్లేశ్వరదేవ దివ్య శ్రీ పాదపద్మారాధక
పరబలసాధక విప్రజనాశ్రయ
శ్రీ వేంగిదేశ చాళుక్య 'నంకరాజు'

పరమండల చూఱకాఱ పతిదేవగురు
ద్విజపాదభక్తులు సువర్ణరరిపు జముండునునైన ।
శ్రీ మన్మహామండలేశ్వర పల్లకేత భూపాలుండు
నిఖిలలోక ప్ర .....కాడ్వెట్టి మహీపాలు
వంశమున నవతరించి భువనవిజ్ఞ .....త ప్రతాప

అని యిరువదియైదు పంక్తులు మాత్రమే కలవు. ఆర్క్యాలాజికల్ రిపోర్టులో శాసనము చివర "Below this the stone is broken అని రిమార్కు వ్రాయబడి యున్నది. ఈ శాసనమును చెక్కించినది పల్లకేతు భూపాలుఁడు. ఇతఁడు క్రీ॥ శ॥ 1150 నుండి 1240 ప్రాంతమువరకు పెక్కు శాసనములను చెక్కించెను. కనుక యితని పరిపాలన కాలమును నదియేయై యుండునని చెప్పనగును. కాని శాసనస్థ విషయములు చాలా పూర్వములై యున్నవి. ఇందు మొదట 5 పంక్తులలోను యీ క్షేత్రమున యీశ్వరుని గురించి అగస్త్యుఁడు తపంబొనరించినట్లును, శివునకు నర్జ్జునునితో కలిగిన మల్లయుద్ధమున జయము చేకూరిన కతనమున యీశానుడను నామము కలిగియున్నను మల్లేశ్వరుఁడను పేరు కలిగినదనియు అప్పటి నుండియు మహేశ్వరుఁడు మల్లేశ్వరుఁడను ఖ్యాతివహించియున్నాడనియు నిరూపించెను. 6వ పంక్తి నుండి 10 వ పంక్తి వరకు కృష్ణావిభూషణమైన విజయవాటికాపురమునందు మాధవవర్మ పాలించుచున్నట్లును, అతని కుమారునిచేత, చింత చిగురు అమ్ముకొనుచున్న నొక అభాగ్యవనిత యొక్క సుతుఁడు చంపఁబడగా ధర్మ సంరక్షణ

కొరకు ప్రభువైన మాధవవర్మ తన కుమారుని హత్యానేర మునకు చంపించినట్లును, అతని ధర్మ నిరతికి మల్లేశ్వరుఁడు మెచ్చి, ప్రీతిఁగలవాడై, మృతబాలకులైన యా యిరువురి మీఁదను స్వర్ణవృష్టిని కురిపించి ప్రాణదానము చేసినట్లును అప్పుడు వారిరువురును జీవించిరను కథను చెక్కించెను..

ఈ మాధవవర్మ కుమారుఁడు నూతనముగా గుఱ్ఱ ములనుపూన్చిన రథమును తానే హయచోదకుడై రాజమా ర్గమున తోలుచుండగా ఒక చింతచిగురు అమ్ముకొను యామె తన పుత్రుని యెత్తుకుని యెదురుగా వచ్చెనట అంత వారు వంబుల నెంత వారించినను నాగక యాబండి యామె నైపుకు పోవుటలో బాలకునికి తగిలి చనిపోయెను. ఆమె తప్పు కొనెను. అప్పుడామె తన మృతపుత్రుని తీసుకొని వెళ్ళి రాజుతో విన్నవించెను. ఆ కాలమునకూడ అభియోగమును విచారించుటకు రాజుకు యొక్కడికే యధికారము లేదు. అప్పుడును యిప్పటి "అసీసర్సు" వలె పంచాయితీదారు లుండెడివారు, వారికి "ప్రాడ్వివాకు" లని పేరు. వారు నిర్ణ యించిన శిక్షనే రాజు విధించవలెనుకాని మార్చుటకు అధి కారము లేదు. అట్లే "ప్రాడ్వివాకులు" రాజపుత్రుఁడు హంతకుడని నిర్ణయించి, హంతవ్యుఁడని తీర్పుఁ జెప్పిరి. అట్లే ప్రభు వొనర్చెను.

ఈ కనకవర్షమును శ్రీ దుర్గాదేవి కురిపించినట్లు 20 వ పేజీలో వ్రాయఁబడియున్నది. ఈశ్వరి అనపాయిని యగు టచే దుర్గామల్లేశ్వరులు కురిపించిరని యర్థము కాని యప్ప

టికీ శాసనము లబ్ధముకాలేదు. మరియు నీ మాధవవర్మ కాలము '(శ్రీ)మచ్చాళకాబ్దేబ్ధి, శశిసాయకసమ్మితే, యనుటచే నితఁడు శాలివాహన శకము 514 గాని, 517 వత్సరముగాని యగును, అనగా క్రీ॥ శ॥ 592 లేక 595 సంవత్సరమగును, అనగా నితఁడు విష్ణుకుండిన వంశములోని ముమ్మడి మాధవ వర్మ కావలెను. "కాడ్వెట్టి" వంశమనగా పల్లవకులజులని యర్థము.

తరువాత 11 పంక్తి నుండి 20 పంక్తి వరకు నొక మహాయద్భుతమైన విషయమును, చెక్కించెను. అదియే పండితారాధ్యుని ప్రభావ ప్రదర్శనము. ఈ బెజవాడలో శ్రీ కనకదుర్గామల్లేశ్వరులకు పరమభక్తుడును, నుపాసకుఁడు నైన నొక యారాధ్య పం॥తు డుండెడివాడట. వారు శివ పారమ్యవాదులై, లోకమున శివునికంటె వేరె పరదైవము లేదనియు, దేవతలకంటెను, ఋషీశ్వరులకంటెనుకూడ శివ భక్తులే అధికులు. ఇదినిశ్చయమనియు, వాదించుచు, పండితుల నోడించుచు. ప్రచారంసేయుచుండెడివారు. ఇట్లుచేయుటవలన పట్టణములోని యితర బ్రాహ్మణులకును, అన్యమతస్థులకును యసూయ మెండై యతఁడు పూజ్యుఁడు కాడనియు, అతఁడు శైవ పాషండు డగుటచే మనతోపాటు వైదిక క్రతువులందు పాల్గొన తగడనియుఁ జెప్పి యతని వెలిఁబెట్టిరి. చివరికి యా భక్తునకు నిప్పుకూడా పుట్టనీయరైరి. ఇప్పటివలె యా కాలములో నిప్పుపెట్టెలు లేవు. రాతితోను, యినుముతోను వరిసి నిప్పును పుట్టించుట దానినుండి రగుల్కొల్పి గ్రామము

లోనివారి కిచ్చుచుండుట యానాటి యాచారము. అట్లు నిప్పు ఇవ్వకున్నచో నతఁడు సంఘబాహ్యుడని యర్థము. అతనికింక యచ్చోట నిలువ నీడయుండదు. అందుచే యానాడు సంఘ బహిష్కారమనిన యత్యంత భయము. కాని మన పండితుఁ డావంతయు జంకక నా యీశ్వరుని నమ్మినవారి కిది యెంత? ఫాలనేత్రుఁడు నాకు అగ్ని నివ్వక కొరతచేయునా? యను దృఢనమ్మకంతో చెప్పినను వారువినక 'నితనిని బహుభంగుల బాధించిరి. అంత మన పండిత ప్రకాండుడు, కోపోద్దీపితుండై వేసింకంటికొరను సేవించి, యగ్నినొక చీనాంబరంబు (పట్టు వస్త్రము) న చుట్టి దానిని నొక శమీ (జమ్మి) వృక్షము యొక్క చివరను కట్టి "యీ నగరమున నింక అగ్నిహోత్రి యెవ్వరికిని వెలుగకుండు గాతయని శపించి, తానుమాత్రము నగ్నిహోత్రములను యథావిధిగా చేసుకొనుచుండెను. కాని విజయవాటికాపురమున నెవ్వరియింటను నిప్పు నిలవదయ్యెను, నిత్యాగ్నిహోత్రములు చేసుకొనుటకు వంట చేసుకొనుటకు, రాత్రి దీపములు వెలిగించుటకు అగ్నిదేవుఁడు వెలుగడు. ఇం కేమిదిక్కు? అప్పుడు కొండపల్లిని, రాజధానిగా చేసుకుని యీ వేంగి (తెలుగు) దేశమును "అనంతపాలుఁడ",ను ప్రభువు పాలించుచుండెను. పౌరు లందరు ప్రభు సన్నిధికి నేగి పండితారాధ్యులవారి యగ్నిస్తంభన యుదంతమునుఁ జెప్పి తమ్ము రక్షింప వేడిరి. అప్పుడా యనంతభూపాలుఁడు మన పండితారాధ్యులను పిలిపించి, జరిగిన ఘోరమును విని వారి ననుగ్రహింప వేడిరి. బ్రాహ్మణులును వారిని చేరి క్షమాపణమును వేడుకొనగా, పరమభాగవతో త్తముఁడైన

యా పండితగ్రామణి తిరుగ శివుని ప్రార్థించి నా శమీశాఖ
మునుండి ఆ యగ్నిబంధమును విప్పిరి. అంత నందరి
యిండ్లలోను యగ్ని దేవుఁడు ప్రత్యక్ష మాయెను. కాని పండి
తులవారు కట్టిన "చీనాంశుకము" మాత్రము కాలలేదు.
ఇదియే వారు చూపిన మహిమ. అంత నందరు మల్లేశ్వరుని
మహిమకు నచ్చెరువంది, యప్పటినుండియు భక్తవత్సలుడైన
శివుని సేవింపఁజొచ్చిరి. వీరికి "శ్రీపతి పండితయ్య" అని
పేరు. వీరే "శివతత్త్వసారము"ను గ్రంథమును సాంప్ర
దాయ సిద్ధముగ రచించిరి. అప్పుడా పండితుఁడు అగ్నిహోత్ర
మును జమ్మిచెట్టుకు కట్టిన స్థలమునకే "జమ్మిదొడ్డి" యని
పేరు. ఈ శాసనమును నక్కడనే దొరికినది. ఇంక 16 పంక్తి
మొదలు చివరవరకు తన వంశాభివర్ణనమును వ్రాయించి
నాడు. తాను పై మాధవవర్మ వంశీకుడనని చెప్పుకొని
యున్నాడు. వారిది భారద్వాజసగోత్రమనియు, కాంచీపుర
వరాధీశ్వరుఁడనియు పల్లవకుల తిలకుడనియుచెప్పుచు, "సాహ
సార్జున, సంగ్రామ రామ, సమరైక భీమ" మొదలైన
బిరుదములను పేర్కొని "శ్రీ బెజవాడ మల్లేశ్వర దేవ
దివ్య శ్రీ పాదపద్మారాధక" అని పలికి తాను వేంగి
చాళుక్యులకు సన్నిహితుఁ డననియు శత్రురాజులకు యము
డననియు చెక్కించినాడు. ఇందువలన నితని ప్రతాప
శౌర్యములు తెల్లమగుచున్నవి. మరియు "కాడ్వెట్టి"
మహీపాలు వంశమునని అనుటచే నితడుకూడ పల్లవ
ప్రభువని తెలియుచున్నది. పల్లవులకు శాసనములలో
"మహామండల శాసన, సామంతావనా"ది బిరుదులు

కానవచ్చుచున్నవి, దిగువ యీ పల్లకేల భూపాలు డొసం గిన దానము లుండ వలెను. ఆ శాసన శకలము కానవచ్చుట లేదు. కాని ముందు మాధవవర్మయొక్కయు పండితారాధ్యు లయొక్కయు శాసనములు చెక్కించి ప్రకటించుటవలన దేవీ మల్లేశ్వరుల మహిమలను లోకమునకు చాటుటకేయని స్పష్టమగుచున్నది.

## శ్రీదాసమహంతి "చొక్కా ఇపాత్రు" నిదానశాసనము

ఈ శాసనము మల్లేశ్వరాలయములో 'విఘ్నేశ్వరు'ని గుడియెదుట నొక రాతిస్తంభముమీద చెక్కcబడియున్నది. దీనిమీద శకవత్సరము లేదు. కాని శ్రీ ముఖసంవత్సరమని పేర్కొనcబడినది. ఇందొక శార్దూలవృత్తమును కొంత వచన మునుc గలవు.

శా॥ ఔరాదానయ చొక్కపాత్రు(o)డు సమోంన్నత్య
దానవారాశియై
శ్రీరంజల్లెడి మోటుcరీపురి ప్రతిష్ఠించెc ముదంబొప్పగాం
దారేందుగ్రహసూర్యమైచి దక్షాధ్వరధ్వంసునిc
గారుణ్యాకరమానసాంబురుహిణీ- కళ్యాణవీరేశ్వరున్॥

అని కలదు. ఇందు మొదటి పాదములో "పాత్రుండు సమోన్నత్య" అన్నచోట "పాత్రుడ సమానోన్నత్య వారా శియై" అని యుండనోపు మరియు మూడవ పాదమున 'సూర్యమైవెంచి' అను తావున 'సూర్యమై వెలుగనా' అని యుండవలయును. ఇంక నాలుగవ పాదమున "మానసాం

బురుహిణీ'' అని కాక 'మానసాంబురుహునిం- గళ్యాణ'మని చదువుకోవలెను.ఇదిSonth Indian Inscriptions Vol IV లోనే 775 రుగా ప్రచురింపఁబడి యున్నది. యిది 1899 సంవత్సరములో ఆర్క్యాలాజికల్ రిపోర్టునన్నూ కాబడినది.

దీనివలన యిందుదహరింపఁబడిన "దానయ చొక్కపాత్రుండు'' అసమాన శౌర్యనిధియనియు, దానమునకు సముద్రుండనియు, వీరు కళ్యాణ వీరభద్రుని ప్రతిష్ఠించినట్లు తెలియుచున్నది. మరియు నీ "చొక్కాఇ పాత్రుడే, మల్లేశ్వరుని గుళ్లో వున్న కేశవనాథుని గుడికి సున్నము చేయించినట్లు తెలియవచ్చుచున్నది.'' అందిట్లుకలదు. "శ్రీముఖ సంవత్సర మాఘశుద్ధ ౫ ఆదానసమహంతి కుమారుడు శివ మహాపాత్రుని అంన్న చొక్కాఇ పాత్రుడు మల్లేశ్వరుని గుళ్ళోని కేశవనాథుని గుడిసున్నం శేయించెను.'' ఇప్పుడీ కేశవనాథునిగుడికాని పైన పేర్కొన్న "కళ్యాణ వీరభద్రాలయము'' కాని కానవచ్చుటలేదు.

కాని యీ శాసనమునకు పైభాగమునఁగల పద్యమందు శకవత్సరములను ౧౦౭౮ అని పేర్కొనఁబడుటచే నిందు వదలియుండవచ్చును. ఇదియు నె 731 రుగా ఆర్క్యాలాజికల్ సర్వేవా రుదహరించియుండిరి. ఇది తరువోజవృత్తములో కలదు.

శరిగిరి వియదింద్రుగణనపై పరగం
గాశకునేండ్లు అక్షత్రితీయము మి
హిర వాసరమున బాలేందుధరుండ
యిన బెజవాడ మల్లేశ్వర గౌరి

వల్లభునకుం గొను వరవీర చొక్క-
వల్లభుండును నార్త్రిౕ దీపంబు
సురుచిరంబుగ నాత్మసుత ఎఱకమకును
... ... సుభముగాని(చ్చె)

"యిద్దివియకుం చెరియబోయిని కొడుకు-గాటయ బోయిని వసమునం బెట్టిన యినుప ఎద్దు ౫౫ వీవిం జేకొని నిత్యము మా నెందునెయ్యి యా చంద్రార్కౕముం బోయంగలవాండు" అని కలదు. పై పద్యము ప్రథమ పాదమున "నేండ్లు అశుత్రి" అను తాపున "నేండు లత్రుత్రి" అని చదువ లెను. మూడవ పాదములో ప్రాసచెడినది. "ఆర్త్రిౕ - దీపంబు" అనుచోట కవి 'విసంధి' చేసినాడు. ఇంక నాల్గవ పాదము సంపూర్తిగా నున్నది. కాని యిందు కకవర్ణముల నిచ్చుట చేతను. యొక తాతిఫలకము మీద చెక్క-బడి యుండుట చేతను, శాసనదాతయు 'చొక్కా-ఇ పాత్రుండు, చొక్క-వల్లభుండు' అని యుదహరింపఁబడుటచేతను నితఁడప్పుడు. యీ బెజవాడకు సామంత ప్రభువుగనో, పరగణా యిజారాదారు (Renter of Paragana) గనో యుండియున్నట్లును, రాజ వంశమువాడైనట్లును తోచుచున్నది. అఖండదీపమునకు కొంత భూమిని పశుసంపత్తిని యొసంగినట్లు స్పష్టముగా తెలియు చున్నది. 'ఈ పాత్రులు' రాజవంశమువారనియు తేలుచున్నది.

ఈ పాత్రవంశమువారిని బెజవాడలో 'నగరవాసుల'ని పిలిచెదరు. వీరే నాగవంశమువారు నాగరాజులే నగరాలైరి.

మాత్రమే కలవు. 12 వ శతాబ్దములో నొకటియు, 13 వ శతాబ్దమున రెండుమాత్రము కలవు.

శ్రీమతే నారాయణాయ నమః

# శ్రీ కృష్ణానదీ మాహాత్మ్య సంగ్రహమ్

ఋషయః॥

బ్రహ్మమానస సంభూత । నారాయణ పరాయణ!
అహో! మహత్తరం తీర్థం మహావిస్మయ కారణమ్ ౧

కృష్ణామాహాత్మ్యమతులం శ్రోతుమిచ్ఛామహేవయమ్
తత్రస్థాని చ తీర్థాని విస్తరాద్బ్రూహి నారద! ౨

నారదః॥

అహో! ధన్యతరాయూయం దేవాఃపితృగణాస్తతః
ఋషయస్సర్వభూతాని భవద్భిస్తర్పితానిహి 3

లోకానాం శ్రేయసేఽర్థాయ సర్వలోక పితామహః
మత్పితా భగవాన్ధాతాయన్మా మాఽవగ్రహీత్పురా ౪

శృణ్వంతు మునయ స్సర్వే కృష్ణామాహాత్మ్య ముత్తమమ్
గోకర్ణాఖ్యం మహాక్షేత్రం రావణేన ప్రతిష్ఠితమ్ ౫

అమరేశమహాత్మ్యంచ ముక్తిపురస్య చైవహి।
వేదాద్రి నరసింహస్య మాహాత్మ్యం పరమాద్భుతమ్ ౬

శ్రీశైలఖండే శ్రీశైల మహాత్మ్యం వర్ణితంమయా
తతఃపూర్వం మహాతీర్థమనంతం లోకవిశ్రుతమ్ ౭

శేషశాయీ జగన్నాథో లోకానాం భయ భంజనః
శ్రీ భూమిసహితో దేవః కృష్ణాంద్రిష్టముపాగమత్ ౮

బ్రహ్మేశాది సువర్వాణ ప్రార్థనాయా జనార్దనః
తత్రతస్థౌ జగన్నాథో భుక్తిముక్తి ఫలప్రదః ౯

తస్యసందర్శనార్థంచ దేవాశ్చాప్స రసాంగణాః
అద్యాపి వసతిం చక్రు ర్యక్ష గంధర్వకిన్నరాః ౧౦

తత్రస్నాత్వానరో భక్త్యా దేవేశం గరుడధ్వజమ్
నమస్కృత్వాఽర్చయే ద్దేవం సర్వపాప ప్రశాంతయే ౧౧

స్నానం దానం జపోహోమ స్స్వాధ్యాయః పితృతర్పణమ్
యవమాత్రంతుయః కుర్యాదనంతం ఫలమశ్నుతే ౧౨

తతఃకీల గిరింగత్వా పరం విస్మయమాగతా
తం కీలాద్రిం స్వర్ణమయం తద్రూపాం జగదంబికామ్ ౧౩

ఇంద్రాదిదేవ సంసేవ్యాం తదగ్రే దివ్యరూపిణీం
దృష్ట్వా విస్మయ మాసాద్య చిరంధ్యాత్వాస్థితానదీ ౧౪

దుర్గమోనామ దనుజ ఆసీత్త్రైలోక్య కంటకః
దేవప్రార్థన యాదేవీ దుర్గమం నిజఘానహ ౧౫

తదాతత్తేజసావ్యాప్తాం దదృశుః కనకప్రభామ్
దేవాస్సర్వేస్తుతిం చక్రుస్సర్వోపనిషదంగకైః ౧౬

దేవీం కనకదుర్గేతి మునాతుష్టువు రాదరాత్
దుర్గమాఖ్యాఽసురం హత్వాసర్వ దేవైరభిష్టుతా ౧౭

దేవానామభయం దత్వా దేవేంద్రేణ పరిపూజితా
లోకానాం రక్షణార్థాయ సర్వ పాపాపనుత్తయె ౧౮

పునశ్చమహిషం దైత్యం జఘాన పరమేశ్వరీ
తదాదేవైస్తుతా తత్రసాన్నిధ్య మకరోత్తతః ౧౯

తస్యాద్దర్శన మాత్రేణ పలాయంతేఽతిపాతకాః
ఇంద్రకీలస్తు దుర్గాంబాం స్తుత్వాతాం జగదంబికామ్ ౨౦

సారూప్యంతుతదావవ్రె సాన్నిధ్యం పునరేవహి
తదాప్రభృతి సోహ్యద్రిః కనకాచలసంజ్ఞితః ౨౧

దృశ్యతె కృతినామద్య స్వర్ణరూపేణచైవహి
కనకాఖ్యాపురీ రమ్యారాజతే స్వర్ణరూపిణీ ౨౨

పునశ్శుంభ నిశుంభాది దైత్యనాశం యదాఽకరోత్
తచ్ఛుంభాది జయాత్సా వైజయానామపురీహ్యభూత్ ౨౩

తత్రత్యామునయస్సర్వే దేవీంలోకైక మాతరమ్
పరమాంపరిస్తుతిం చక్రుర్జయదేవీతి సూక్తతః ౨౪

జ్యోతిర్లింగ స్వరూపేణబభౌ సర్వేశ్వరశ్శివః
శతాశ్వమేధానాజహ్రే బ్రహ్మలోకపితామహః ౨౫

తదాతం పూజయామాస దేవం మల్లీకదంబకైః
దర్శనంబ్రహ్మణోదత్వా బ్రహ్మలోకం దదౌశివః ౨౬

తదాప్రభృతి దేవేశం మల్లికేశం వదంతిహి
మల్లికార్జున దేవశ్చ తత్రైవాఽసీత్సుఖప్రదః ౨౭

తత్రైవదక్షిణే భాగే తపస్తప్త్వాతు ఫల్గునః
మల్లికేశ్వర దేవాచ్చలబ్ధ్వా పాశుపతంధనుః ౨౮

యతః క్షేత్రే మహాపుణ్యే తపసేపేచ ఫల్గునః
తస్మాదేతన్మహాక్షేత్రం ఫల్గునక్షేత్రముచ్యతే ౨౯

అతస్తత్ఫల్గునం తీర్థం దుర్గాతీర్థం తదత్రహి
శివత్రిశూలతీర్థం చ శంఖతీర్థం మహత్తరమ్ ౩౦

తత్రైవ వైధసంతీర్థం ముక్తితీర్థంఫలప్రదమ్
ఇంద్రతీర్థం చతత్రైవ ఋషితీర్థమతఃపరమ్ ౩౧

సర్వదేవ మయోహ్యద్రిః సర్వదేవాత్మకశ్శివః
సర్వతీర్థమయీకృష్ణా త్రితయంసంగమంత్విహ ౩౨

యస్యశ్రవణమాత్రేణ పలాయంతేహిపాతకాః
ఏతత్క్షేత్రేణ సదృశం నభూతం నభవిష్యతి ౩౩

భక్త్యాస్నాత్వాఽత్రి మల్లీశం దుర్గాందుఃఖార్తి నాశనీమ్
దృష్ట్వాపాపాత్ప్రముచ్యేత దేవీలోకే వసేత్సదా ౩౪

పితౄణాం పిండదోయశ్చతస్య పుణ్యఫలంశృణు
కులముత్తార్య తేతేన దశపూర్వాన్దశాపరాన్ ౩౫

తత్రస్నాత్వానరోభక్త్యా ఫల్గుణేశం మహేశ్వరమ్
సమస్కృత్వాఽర్చయేద్దేవం తతోదానం మహాఫలమ్ ౩౬

కృష్ణాకృష్ణాంగసంభూతా సర్వలోకహితానిచ
బీజాన్యాదాయగచ్ఛన్తీ బ్రహ్మానందస్వరూపిణీ 38

నిరోధితాచ కీలాద్రేర్నృసింహాఽవాస మధ్యతః
చకారవసతిం తత్రపతియోగం ప్రకాంక్షతీ 39

బీజనిక్షేపణాద్ధేతో రియం బీజపురీమతా
కీలాద్రి దక్షిణేభాగె నృసింహోయత్రతిష్ఠతి 3౯

నృసింహక్షేత్రపర్యంతం కీలరూపేణవర్తతె
థతోదైర్ఘ్యేణ కీలావత్తస్మాత్కీలాద్రిరుచ్యతె ౪౦

కృష్ణవేణీ మహాపుణ్యాపతియోగం ప్రకాంక్షతీ
గచ్ఛన్తీపర్వతం భేత్తుంనశశాక స్థితాతదా ౪౧

దేవాస్సర్వేతదాశోక్య కీలాద్రిం సమవోచతుః
కృష్ణాసాగర యోగాయమార్గం దేహిత్యయాచిషుః ౪౨

దేవతావచనం శ్రుత్వాతథైఽవాదాత్సురంగకమ్
సురంగద్వారతః కృష్ణాగచ్ఛన్తీ "హుం"రవంకృతా ౪౩

హుంకారశ్రవణాదేవగిరిః ప్రబిభిదేతదా
ఆదాయపర్వంతం కృష్ణాక్షిప్త్వా క్రోశద్వయేతతః ౪౪

జగామస్వైరగమనాపతి సంయోగమిచ్ఛతీ
తత్క్షేత్రం ముక్తిదం ప్రాహురంతరా పర్వతస్యహి ౪౫

తత్రస్నాత్వాచ పీత్వాచ బ్రహ్మహత్యాం వ్యపోహతి
బ్రహ్మలోకేవసేతోఽపి పూనరావృత్తి వర్జితః ౪౬

కృష్ణాయాశ్చోభయ తటలింగం రామేశ్వరాహ్వయమ్
పురాస్థాపితవాన్ రామో శ్రీమాన్ రాజీవలోచనః ౪౭

రామేశక్షేత్ర యుగళముక్తం పుణ్యఫలప్రదమ్
ఏతత్క్షేత్ర మహాత్మ్యంతు వక్తుంకోపి నశక్నుయాత్ ౪౮

తస్మాచ్చ దక్షిణె భాగవిష్ణు క్షేత్రం మహోత్తమమ్
ప్రపంచమధ్య భాగేతు కృష్ణాతీరె శుభస్థలె ౪౯

వైకుంఠా ద్దైవ సమాగత్య దేవదేవస్సనాతనః
యత్రసంస్థితవాన్ చక్రీ ఆంధ్ర విష్ణుసమాఖ్యయా ౫౦

యత్ర బ్రహ్మాదయస్సర్వే తపఃకుర్వంతి సాంప్రతమ్
తత్రశ్రీకాకుళం నామ పురంముక్తి ప్రదంమహత్ ౫౧

చతుర్భుజ శ్శంఖచక్ర భూనీళా సహితోహరిః
వసతిం తత్రైచక్రే కలౌ కాకుళనాయకః ౫౨

ఏకరాత్రి ప్రసన్నాఖ్యో దేవశ్చ మల్లికేశ్వరః
తత్రైవ వసతిం చక్రే పూజయిత్వాఽంధ్ర నాయకమ్ ౫౩

తస్మాచ్ఛ్రీకాకుళక్షేత్రం ఖ్యాత మద్భుతదర్శనమ్
తత్రతీర్థాని శతశస్తేషాంనామాని మేశృణు ౫౪

దేవహ్రాదం రుద్రహ్రాదం చక్రతీర్థంతు వైధసమ్
విష్ణుతీర్థంచ సౌరంతు సోమతీర్థం మునీశ్వరాః ౫౫

తత్రస్నాత్వా మహాపుణ్యాం లభంతెగతి మీప్సితామ్
యంయం కామయతె కామంతం తమాప్నోతి భార్గవ!'! ౫౬

అగస్త్యోనామ దేవర్షిః కృష్ణాయాం తత్రతత్రతు
స్నాత్వా తీర్థేషు సర్వేషు శ్రీకాకుళమథాగమత్ ౫౭

తత్రైతేతుతపః కృత్వా సర్వకామానవాప్తవాన్
లవమాత్రంతు యద్దానం మేరుతుల్య ఫలంలభేత్ ౫౮

బహునాకిం వదిష్యామి క్షేత్రమాహాత్మ్య మద్భుతం
సంకోచేనైవ కథితం వక్తుంజ్ఞా తుంచకః ప్రభుః ౫౯

ఇతిస్కాంద పురాణె సహ్యాద్రిఖండె కృష్ణానదీ మాహాత్మ్యే శ్రీకాకుళక్షేత్ర వర్ణనం నామ ఏకోనత్రింశోఽధ్యాయస్సమాప్తః॥

అతఃపరం ప్రవక్ష్యామి శృణ్వంతుముని సత్తమాః
కాకుళస్య క్రోశమాత్రె లింగం సోమేశ్వరాభిదమ్ ౧

తత్పాపనాశనం తీర్థముత్తమంచసుదుర్లభమ్
తస్మిన్‌తీర్థె కృతంస్నానం సర్వ దోషాన్వ్యపోహతి ౨

కృష్ణాయాస్సలిలెస్నాత్వా పితృపిండప్రదోనరః !!
కులముత్తార్య తెతేన శివలోకేవసేత్సదా

తత్రబ్రహ్మమహేంద్రశ్చ సర్వేదేవా మహర్షయః
సోమేశస్య ప్రసాదేన సిద్ధిమాపుఃపురాఖలు ౪

కృష్ణాయాః పశ్చిమెభాగప [illegible] గం ప్రతిష్ఠితమ్
తత్రదత్తంచ యజ్జప్తం సర్వం కోటిగుణంభవేత్ ౫

తస్మాత్కోటి ఫలీనామ తత్తీర్థం హ్యుత్తమోత్తమమ్
తత్రస్నానాదికం కుర్యాదర్చనం పాపనాశనమ్ ౬

తత్క్షేత్ర దక్షిణేభాగె శుక్లతీర్థం శుభప్రదమ్
తత్రవిఘ్నేశ్వరో దేవోఽప్యస్తి సర్వార్థసిద్ధిదః ౭

తస్మాద్వ్యాఘ్రపురీక్షేత్రం క్రోశమాత్రస్థితం శుభమ్
తత్క్షేత్రే భగవాన్ విష్ణుర్దేవరాజో దయానిధిః ౮

వరాన్దత్వాతుభక్తేభ్యో వరదోఽభూచ్ఛ్రియః పతిః
తస్యసందర్శనార్థం చ పార్వత్యాసహ శంకరః ౯

వసంతి ఋషయస్సర్వే దేవా ఇంద్రపురోగమాః
తత్క్షేత్రం ముక్తిదం ప్రాహుర్వ్యాఘ్రక్రోశద్వయంబుధాః ౧౦

సురాపీ స్వర్ణహారీవా బ్రహ్మహా గురుతల్పగః
తత్తీర్థ దర్శనాత్సద్యో ముచ్యతే సర్వకిల్బిషైః ౧౧

తతస్తు పూర్వదిగ్భాగె నరకోత్తారకం స్మృతమ్
తత్రతు పృథివిలింగం స్వయంభూతం విముక్తిదమ్ ౧౨

పశ్చిమాభిముఖం దేవం దృష్ట్వా ముచ్యేతబంధనాత్
అత్రినారాయణో దేవోఽప్యస్తి భక్తైః ప్రపూజితః ౧౩

తత్రస్నాత్వాతు కృష్ణాయాస్సలిలె పిండదోనరః
సప్త పూర్వాన్ సప్తపరాన్ పితౄనుత్తారయేత్సహి ౧౪

మధ్యవ్యాఘ్రేశ్వరక్షేత్రె వ్యాఘ్రపాదాశ్రమం వరమ్
తస్మాచ్చ దక్షిణేభాగె విష్ణుక్షేత్రం మహత్తరమ్ ౧౫

యత్రనారాయణో దేవో లక్ష్మీయుక్తో సనాతనః
వేణ్యాయాః పూర్వభాగేతు పురారామ ప్రతిష్ఠితః ౧౬

తత్రైవపశ్చిమే తీర ఏ తన్మూర్తిః ప్రతిష్ఠితః
నారాయణ ద్వయం క్షేత్రం తతఃప్రోక్తం మహాశుభమ్ ౧౭

అస్మిన్‌క్షేత్రే తపస్తే పేవసిష్ఠో భగవాన్మునిః
అవనీతనుజాసీతా వసిష్ఠస్యాంతికేస్థితా ౧౮

ధర్మాంచ్ఛృత్వాచసాదేవీ పూజయా మాసనాదరమ్
యతోఽవనీ సుతాఽవాత్సీ దవనీ పురమీరితమ్ ౧౯

కృష్ణైస్యనైతనుస్నాత్వా తత్కృష్ణాఖ్యాపరమీడ్యతే
అస్మిన్‌కోటి శతం తీర్థం సదాసన్నిహితం భవేత్ ౨౦

తత్సేవనం మహాపుణ్యం దర్శనం చేష్టదాయకమ్
స్పర్శనం మోక్షదం ప్రాహుర్స్నజానే స్నాన జంఫలమ్ ౨౧

జన్మత్రయార్జితం పాపం సకృత్స్నానేన ముచ్యతే
క్షేత్రదర్శనమాత్రేణ విష్ణుసాయుజ్యమాప్నుయాత్ ౨౨

తస్మాచ్చదక్షిణేభాగే ముక్తిక్షేత్ర ముదాహృతమ్
యత్రముక్తేశ్వరోదేవో కాకుత్స్థేన ప్రతిష్ఠితః ౨౩

తత్రస్నాత్వాఽర్చయేద్యస్తు శంకరం లోకశంకరమ్
తస్యపాపానినశ్యంతి మహాదేవస్య దర్శనాత్ ౨౪

వ్యాఘేశ్వరా త్పూర్వభూత్వావేణీ ప్రాప్తా చసాగరమ్
తత్రసంగేశ్వరోనామ శివోఽభూత్ క్షేత్రపాలకః ౨౫

భావనారాయణోదేవో యత్రతిష్ఠతిమూర్తిమాన్
తత్రస్నాతోనరోభక్త్యాతస్య పుణ్యంవదామ్యహమ్ ౨౬

స్నానం దానం జపోహోమ స్స్వాధ్యాయః పితృతర్పణమ్
ఏవంకోటిగుణం ప్రోక్తం తర్పణంచాఽఘమర్షణమ్ ౨౭

వేణీసంగేథ వేత్స్నానం సర్వపాప విమోచనమ్
దేవేభ్యశ్చపితృభ్యశ్చ నమస్కృత్యాకృతాంజలిః ౨౮

వ్యాఘ్రేశపూర్వదిగ్భాగే కుమారక్షేత్రముత్తమమ్
సుబ్రహ్మణ్యోఽవ సత్తత్ర భుక్తి ముక్తి ఫలప్రదః ౨౯

స్నానమాత్రేణ తత్రైత్రికోటి జన్మాఘనాశనమ్
తతఃపరం క్రోశతీర్థం సర్వతీర్థోత్తమోత్తమమ్ 30

అత్రస్నానం మహాపుణ్యం సాయుజ్యస్యైవ కారణమ్
స్నానం దానం జపస్తత్ర సర్వమానంత్యమశ్నుతే 3౧

తత్రస్తేకువనం నామక్షేత్రం శివవిభూషణమ్
యత్రరామేశ్వరో దేవోఽస్త్యగస్త్య మునిపూజితః 3౨

పిత్రస్నానం మహాపుణ్యం మోక్షసామ్రాజ్య కారణమ్
తత్రాణాం పిండదోమర్త్యో మాతృగర్భం నవిందతి 33

తతఃపూర్వం మహాక్షేత్రం సర్వాఘౌఘ వినాశనమ్
యత్రనాగేశ్వరోదేవః కృష్ణాచోత్తరవాహినీ 3౪

ఉగగ్వహామహాపుణ్యా త్రిషులోకేషుదుర్లభా
యావైదక్షిణగంగేతి సర్వలోకేషుగీయతే 3౫

స్మరణాత్సర్వపాపఘ్నీ దర్శనాన్ముక్తిదాయినీ
స్నానాత్సాయుజ్యదా దేవీ కృష్ణా పుణ్యైకరూపిణీ ౩౬

యజ్ఞప్రమతియద్దత్త మనంతంఫలమశ్నుతే
కృష్ణాతీర్థఫలం చాపివక్తుంస్కందోపి నప్రభుః ౩౭

కర్కోటక స్వరూపేణ ఏతల్లింగం శిలామయమ్
తతఃకర్కోటక క్షేత్రమితిఖ్యాతం సమంతతః ౩౮

వసిష్ఠః పూజయామాస పార్వత్యాసహదుర్గయా
తస్మాన్మునిగణైప్రోక్తం వాసిష్ఠం తీర్థముత్తమమ్ ౩౯

కదలీషండమధ్యస్థం నాగలింగంద దర్శహ
కదళీపురమిత్యేత ద్వాసిష్ఠంచబుధావిదుః ౪౦

తదుత్తరదిశి శ్రీమన్నాగకుండం శుభావహమ్
నాగకుండస్య మాహాత్మ్య మనంతం కోవదిష్యతి ౧౪

తదుత్తరదిశి శ్రీమద్బ్రహ్మకుండం చరాద్రికమ్
కుండత్రయేతు స్నానంచ దానహోమార్చనాదికమ్ ౪౨

ఏవరూపం కృతంచేత్స్యాదనంతం ఫలమశ్నుతే
వసిష్ఠః కౌశికశ్చైవ యత్రసంవాదకాంక్షిణౌ ౪౩

తపస్తప్తుం ప్రచక్రాతే వసిష్ఠ స్సిద్ధిమాప్తవాన్
విశ్వామిత్రస్సిద్ధకామో విష్ణుమారాధ్యచాఽప్తవాన్ ౪౪

వేణునాదప్రియం శ్రీమచ్చతుర్బాహుం మనోరమమ్
గోపాలవిగ్రహం క్షేత్రపాలకం కృతవానసౌ ౪౫

తస్మాద్వ్యాసిష్ఠక్షేత్రం చన్తైశ్వామిత్రం విదుర్బుధాః
తతోకృష్ణానదీరమ్యా గత్వాసాగరగామినీ ౪౬

హంసద్వీప సమీపేతు సాగరం ప్రవిశన్నదీ
యత్రగోపాలకో దేవస్సర్వాభీష్ట ఫలప్రదః ౪౭

తత్రదేవర్షిసంఘాశ్చలభం తేగతిమిప్సితామ్
ముదాభర్తాసప్రవంతీయం యత్రకృష్ణానుసంగతా ౪౮

తత్రసర్వాణితీర్థాని వసంతీతిబుధావిదుః
గోపాలకప్రసాదేన సర్వసిద్ధిర్భవేద్ధ్రువమ్ ౪౯

కృష్ణామాహాత్మ్యమమలం శృణుధ్వం తస్యనైఫలమ్
సనర్వపాపాన్ముచ్యేత సత్యం స్కందేనభాషితమ్ ౫౦

బ్రహ్మలోకేవసేతో౽పి పునరావృత్తి వర్జితమ్
సతస్యపునరావృత్తిర్బ్రహ్మణా దివిమోదతే ౫౧

ఇతిస్కాందపురాణె సహ్యాద్రిఖండె కృష్ణానదీ మాహాత్మ్యే ఉభయనాగేశ్వర హంసద్వీపాదిక్షేత్ర వర్ణనం నామత్రింశో౽ధ్యాయః॥

## దుర్గాంబాకుండ మాహాత్మ్యమ్

సూతః :-

పంచవట్యాంస్థితో రామస్సీతస్సహ లక్ష్మణః
ఆగతంపరి పప్రచ్ఛతుః భయోనిం మహామునిమ్ ౧

రామః :-

శ్రీశైలాఖ్య మహాక్షేత్ర మాహాత్మ్యం వర్ణితంత్వయా
వేదాద్రీశస్య దేవస్య మహత్త్వముప దర్శితమ్ ౨

దుర్గాంబాకుండ మాహాత్మ్యం వదమే విస్తరేణ వై
కేన తత్ర తపస్తప్తం కస్మై దుర్గావరాన్దదౌ ౩

ప్రసన్నా కేనమంత్రేణ తత్కుండంకైః ప్రతిష్ఠితమ్
లోపాముద్రాపతే బ్రహ్మన్ శ్రోతుమిచ్ఛామిసాంప్రతమ్ ౪

అగస్త్యః :-

దుర్గాకుండ స్యమాహాత్మ్యం వక్ష్యామి శృణురాఘవ
యస్యస్మరణ మాత్రేణ కృతార్థో జాయతేనరః ౫

దుర్గాయానైరుతే కోణె దుర్గాంబా కుండముత్తమమ్
దుర్గా కుండం మహాతీర్థ మీశ్వరేణ వినిర్మితమ్ ౬

సదానద్యః పురాభూమౌ స్మరణా ద్బహు పుణ్యదాః
దుర్గాకుండం సమాసాద్య తిష్ఠంతిచ శివాజ్ఞయా॥ ౭

ప్రసిద్ధం సర్వలోకేషు సర్వతీర్థోత్తమం పరమ్
జాహ్నవీ బ్రహ్మపుత్రా చసితా భద్రా సరస్వతీ॥ ౮

యమునా తమసాపుణ్యా విపాశా బాహుదానదీ
సింధుస్తత్రాపి నీరేవా ముచికుండాచ శారదా॥ ౯

సోమోద్భవా శోణభద్రా జామదగ్నీ మహానదీ
త్రిపాపమోక్షి వింధ్యాపి చర్మణ్వ త్యరుణానదీ॥ ౧౦

తథావినూత పాపాచ వ్యాఘ్రనద్యపి గోమతీ
గండకీ సరయూశ్చైవ విశాలా విమలా నదీ॥ ౧౧

శరావతీ వేగవతీ భోగవత్య మృతాపగా
చంద్రభాగా సూర్యభాగా బ్రహ్మణీంద్ర నదీ యథా। ౧౨

వైనతేయా ప్రణీతాచ గోదా సప్త ప్రవాహగా
మలాపహారిణీ భీమా కృష్ణవేణీ మహానదీ। ౧౩

తుంగభద్రా బ్రహ్మనదీ ప్రణవాక్షిక నద్యపి
భీమన్వనా భార్గవీచ ఉత్తరార్థా పినాకినీ॥ ౧౪

సువర్ణముఖీ వాసిష్ఠానదీ విష్ణు పదోద్భవా
కుముద్వతీ దక్షిణాచ పినాకి న్యమర ప్రియా। ౧౫

కావేరీ తామ్రపర్ణీచ మురజా వేణుభేదినీ
ఏతశ్చాన్యా మహానద్యః కుండేస్మిన్న ఘనాశకే॥ ౧౬

ఏతత్కుండం ప్రపద్యంతే స్వస్వాంశైశ్చ శివాజ్ఞయా
తతో కుండేఽత్ర స్నానంచ సర్వనద్యవగాహనమ్॥ ౧౭

తథా తీర్థాని నలోకేఽస్మిన్ ప్రసిద్ధాని రఘూద్వహ
విష్ణుపాదోదకం తీర్థం తీర్థరా ణ్మణికర్ణికా॥ ౧౮

జ్ఞానవాపీ బ్రహ్మవాపీ రుద్రవాపీ తథైవ చ
అర్కతీర్థం చంద్రతీర్థ మాగస్త్యం తీర్థముత్తమమ్। ౧౯

దుర్గాతీర్థం శక్రతీర్థం కామాక్షీ తీర్థమేవచ
కామేశ్వర మహాతీర్థం తీర్థం త్రైపుర సుందరమ్॥ ౨౦

భృగుతీర్థంచ కేదారం యక్షతీర్థంచ కర్దమమ్
స్వర్ణతీర్థం శుక్రతీర్థం తీర్థం వైఖానసం మహత్। ౨౧

ప్రహ్లాదతీర్థ శ్రీకుండే తీర్థరాజంతు పిప్పలమ్ ॥
పరిభాతీర్థంచ గోకర్ణం కాపిలం తీర్థ ముత్తమం ॥ ౨౨

తీర్థం నారాయణాం చైవ తథావై నాయకం స్మృతమ్
బదర్యాం నారదం తీర్థం సౌమ్య రుద్ర మహాలయమ్॥ ౨౩

సిద్ధాశ్రమే సిద్ధతీర్థం వైశ్వామిత్రంచ భాస్కరం
శైలతీర్థంతు పద్మాఖ్యం బ్రహ్మావర్తంతు మాధవమ్॥ ౨౪

ఛాయా భగవతీ తీర్థం తీర్థం పార్జన్య మేవచ
సుధాకుండంచ క్షీరాఖ్యం క్రౌంచకుండం తతఃపరమ్॥ ౨౫

శంభుతీర్థంచతం జంబుం కౌమారం బాణతీర్థకమ్
శారదాతీర్థ గాంధర్వ్యే ఏకామ్రం పృథు తీర్థకమ్॥ ౨౬

పాపనాశన తీర్థంతు పౌలోమం తీర్థ ముత్తమమ్
చక్రతీర్థం తథారుద్రం తీర్థం వైరోచనం తథా॥ ౨౭

ఋషితీర్థంచ రత్నాఖ్యం మార్తికం తీర్థమేవచ
అగ్నితీర్థంచ సారంగం భస్మకుండం శివప్రియమ్॥ ౨౮

తత్రైవ సుందరీతీర్థం తీర్థం పాపవిమోచనం ॥
యజ్ఞతీర్థంతు సోమాఖ్యం పంచాప్సరస మేవచ॥ ౨౯

అశ్వతీర్థంతు గర్గాఖ్యం మాణిక్యం తీర్థముత్తమమ్
మనుతీర్థం శుక్రతీర్థం చ్యవనస్య మహాత్మనః ౩౦

అశ్వతీర్థంతు తత్రైవ సర్వరోగ హరం పరమ్
గౌరీకుండాఖ్య తీర్థంతు యత్ర స్వాయంభువో మనుః  31

ప్రసాదమగమద్విష్ణో శ్శతరూప సమన్వితః
కూర్మతీర్థంచ వారాహం నారసింహంచ భార్గవమ్  32

బలి తీర్థం యత్రబలిర్విష్ణుం జిష్ణుం సనాతనమ్
తోషయామాస నిష్కామో యజ్ఞైశ్శాస్త్రోక్త దక్షిణైః 33

తత్రైవ వామనం తీర్థం విష్ణుర్వామనతాం గతః
పూజితో బలినా తీర్థం విష్ణుపాదామృతో ద్భవమ్॥  34

ఏవమన్యాని తీర్థాని యానిసంతి మహీతలె
ప్రసిద్ధాన్యత్రతిష్ఠంతి సర్వపాప హరాణివై॥  35

సన్నిధానం ప్రపద్యంతే సదాశివ సమాజ్ఞయా
యత్రతుస్నాన మాత్రేణ వృద్ధోపి తరుణో భవేత్।  36

యేస్నాన మత్రకుర్వంతి తేషాం సిద్ధ్యంతి కామనాః
బ్రహ్మలోక స్థితి స్తేషాం పునరావృత్తి వర్జితా॥  37

ఋషయశ్చారణా సిద్ధాయే వాన్యే మోక్షకాంక్షిణః
సకృత్ప్రణామ మాత్రేణ దేవీ సాయుజ్యమాప్నుయుః॥ 38

క్రౌంచైశ్చ మిథునీభూతైః హంసకారండకైర్బకైః॥
కలస్వనై శ్చక్రవాకై రాకీర్ణం శతపత్రకైః॥  39

కుముదై రుత్పలైః కోకనదై శ్శోభన గంధిభిః
ఆమోదిత పరిసన్నేన వలితేన విరాజితమ్॥  40

మత్త షట్పద నిర్ఘుష్టం సేవితం మత్స్య కచ్ఛపైః
కేతకీషండ నిర్బాధం నిత్య పుష్ప ఫలద్రుమైః॥ ౪౧

పాటలాఽశోక పున్నాగై రామ్రై రామ్రాతకై రపి
చంపకై ర్వకులై ర్జాతీ నారికేళై రనేకశః ౪౨

నారంగకై ర్బీజ పూరై ర్లికుచై స్తీర సంభవైః అణరాన్నైః
వ్యాప్తంచ మల్లికాషండై ర్దీర్ఘమాన్యం సరోవరమ్॥ ౪౩

ప్రియేణ మల్లికేశేన సహితా జగదంబికా
విహరత్యత్ర సా దేవీ క్రీడా కాలేషు రాత్రిషు ౪౪

సేవితా దేవకన్యాభిః భువన శ్రేయసే యతః
దుర్గాకుండమిదంతస్మా త్త్రిషు లోకేషు విశ్రుతమ్॥ ౪౫

ఉత్తమం సర్వతీర్థానాం మల్లికేశ ప్రియావహమ్
దేశాంతరస్థైతై ర్మానవై రంబికా కుండముచ్యతే॥ ౪౬

ఏతత్కుండస్య మాహాత్మ్యం వర్ణనేనహి శక్నుయాత్
శివసాక్షాత్తదాఽహం మల్పవా గల్ప దర్శనః॥ ౪౭

అంబికా కుండ సలిల మనిచ్ఛన్న పియః పిబేత్
నిర్ధనో ధనితాం యాయా ద్రోగీ ముచ్యేత రోగతః॥ ౪౮

విద్యాం లభేత విద్యార్థీ బద్ధో ముచ్యేత బంధనాత్
వైధవ్యంనాఽశ్నుతేనారీ గృహీ కామానవాప్నుయాత్॥ ౪౯

దుర్గాకుండజలం పీత్వా రోగేభ్యో ముచ్యతే జనః
కిమన్యై రౌషధై స్తస్యకింధానై స్తపసాచకిమ్॥ ౫౦

దాతుం స్వర్గాపి భోగానాం హంతుం పాతక పర్వతాన్
అత్రయే స్నాంతి మనుజాః ధృవం తే ముక్తి భాజనః॥ ౫౧

ఇత్యుక్తం శంభునా పూర్వం స్కందాయచ మహాత్మనే
తదేవ కథితం రామ। సత్యం శంకర భాషితమ్॥ ౫౨

ఇతి పద్మపురాణే, పూర్వఖండే దుర్గాకుండ మాహాత్మ్యంనామ
పంచాశస్సర్గ స్సమాప్తః.

## కనకదుర్గా మహత్త్వమ్

ఏకదా నైమిశారణ్యే శౌనకాద్యా మహర్షయః
అపృచ్ఛన్సూతమాసీనం పురాణార్థ విశారదమ్ ౧

దుర్గాదేవ్యా మాహాత్మ్యంచ మల్లికేశస్యసాదరమ్
సూతసూత మహాభాగ! వదస్వకరుణానిధే! ౨

ఇతి వైర్యాచితో భూత్వాసూతః పౌరాణికోత్తమః
నమస్కృత్య మహాదేవం ప్రవక్తుముపచక్రమే ౩

సూతః॥
కదాచిన్నారదోఽపృచ్ఛంశంకరం చంద్రశేఖరమ్
శారదాభ్రప్రతీకాశోవీణాపాణి స్తపోనిధిః ౪

గాయన్నారాయణం దేవంసంప్రహృష్టమనాస్తతః
నారదః॥
భగవన్ దేవదేవేశ శ్రోతు మిచ్ఛామిసాంప్రతమ్ ౫

దుర్గాదేవ్యామాహాత్మ్యంచ మల్లికేశస్యవైతథా
సంసారోత్తారకం పుణ్యం వదస్వ కరుణానిధే ! ౬

శంకరః ॥

పురామాళవదేశేతుహేమకీర్తిర్మహాప్రభుః
చంద్రవంశ సముద్భూతస్సర్వభూతహితేరతః ౭

రాజ్యం వైపాలయామాస చిరకాలమతంద్రితః
నామ్నారత్నావళీసాధ్వీ తస్యభార్యాబభూవహ ౮

తస్యాస్తు సంతతిర్నాస్తి తస్మాచ్చింతాపరాసతీ
భర్తారముపసంగమ్య ప్రార్థయామాససాదరమ్॥ ౯

గతిర్నాస్తీత్య పుత్రాణాం ప్రవదంతి మనీషిణః
కేనోపాయేనసంతానం లప్స్యేహం వదమేవిభో॥ ౧౦

తదాసంచిత్య బహునా హేమకీర్తిస్సుబుద్ధిమాన్
పుణ్యతీర్థాటనం కృత్వా తపః కర్తుం సునిశ్చితః॥ ౧౧

కురుక్షేత్రం హయక్షేత్రం కేదారం బదరీవనమ్
నీలకంఠం చ నేపాలం తథారుద్రమహాలయమ్॥ ౧౨

శ్రీశైలం చ తథా జంబూక్షేత్రం గోకర్ణకం శుభమ్
అహోబిలం తతో ప్రాప్య వేదాద్రీశ మతఃపరమ్॥ ౧౩

కృత్వాఽవగాహనం తత్ర దృష్ట్వా దేవాయతనాని చ
తత్ర తత్ర తపస్తప్త్వాచిరం సంతానకాంక్షయా॥ ౧౪

అకృతార్థోఽతి నిర్విణ్ణః కేవలం శాంతమానసః
తతో ప్రాప్యేంద్రకీలం చ దుర్గాదేవీందదర్శహ॥ ౧౫

దుర్గాకుండే చ కృష్ణాయాం స్నాత్వా చ సహభార్యయా
తత్రైకేతు తపశ్చక్రే స్వల్పకాలం జితేంద్రియః॥ ౧౬

కదాచిత్కార్తికే మాసి అష్టమ్యాం హరివాసరే
దుర్గాభక్తప్రియా దేవి ప్రసాద మకరోత్తయోః॥ ౧౭

సంపూజ్యచాఽథ దుర్గాంబాం ప్రసన్నముఖపంకజామ్
స్తుత్వా సంతతిం దివ్యాం ప్రార్థయా మాసతుఃకిల। ౧౮

కైలాస శిఖరే రమ్యే కల్పచ్ఛాయాం తరేశుభే
స్వర్ణమంటప మధ్యేతు రత్నపీఠేసునిర్మితే॥ ౧౯

తన్మధ్యేపరమాం దేవీం సుభ్రువంచసుమధ్యమామ్
మందస్మిత ముఖాంభోజాంత్రినేత్రాం చంద్రశేఖరామ్ ౨౦

దివ్యచందన లిప్తాంగాం దివ్యాభరణభూషితాం
ఉత్తుంగవృత్తకఠిన స్తనమండలమండితామ్ ౨౧

కందర్ప కోటిలావణ్యాం పూర్ణషోడశవార్షికామ్
దివ్యాయుధ ధరాందేవీమష్టభిః కరపంకజైః ౨౨

సింహవాహనపార్శ్వస్థాం బాలాంత్రిపురసుందరీమ్
తదాదృష్ట్వాదంపతీతాం విస్మయం పరమంగతౌ ౨౩

ప్రణిపత్యాఽథ దుర్గాంబాం కుముదోత్పలపంకజైః
మల్లికాజాతీ కుసుమైః కరవీరైశ్చచంపకైః ౨౪

పునస్సంపూజ్య తాం దేవీం కన్యాం ప్రార్థయామాసతుః
తయోర్వాక్యం నిశమ్యాఽథ సంప్రహృష్టసుమానసా ౨౫

అహం దాస్యామి పుత్రీంచ యువాభ్యాం నైమదంశతః
దేవీవాక్యం తదాశ్రుత్వా తౌగతౌ నగరం నిజమ్ ౨౬

ఏకస్మిన్ శుభలగ్నే చ గర్భిణీసాబభూవహ
దశమేమాసి సంప్రాప్తే కన్యారత్న మజాయత ౨౭

సా బాలావవృధేపిత్రృ గేహే చంద్రకళాభిధా
పద్మాననా పద్మనేత్రా సుకేశీ మంజుభాషిణీ ౨౮

బింబాధరా చ శ్రీకణ్ఠాకంబు కంఠీశుచిస్మితా
గంభీరనాభిసంయుక్తా నితాంత కృశమధ్యమా ౨౯

తనురోమావళీరమ్యా సుకుమారపదాంబుజా
సర్వవిద్యాసు కుశలా సత్యశీలా మనోహరీ 30

విదర్భరాజ పుత్రీంచ నామ్నారత్నాకరం ప్రభుమ్
ఆహూయతస్య తాం బాలాం మాళవాధిపతిర్బుధః 31

కన్యాదానం తతఃకృత్వా సంతోషం ప్రాప్తవానసౌ
తేనదానేన ననందుః పితరస్తస్యనారద 32

తస్మాద్దేవీ చ దుర్గాంబా సేవ్యాభక్తజనైరపి
యానికామాని పృచ్ఛంతి తానిసర్వాణి దాస్యతి 33

ఇతి బ్రహ్మాండ పురాణే ఉత్తరఖండే రుద్రనారద సంవాదే దుర్గామాహాత్మ్యం నామ ఏకోనచత్వారింశోధ్యాయః।

# దుర్గా మహత్త్వ కథనమ్

అగస్త్యః

శృణురామ! కథామేతాం దుర్గాదేవ్యాశ్చ సంశ్రితామ్
వర్ధనీం సర్వసౌభాగ్యం విస్తరాద్వదతో మమ ౧

పురాదేవీ ప్రసాదేన పితాహో మోక్షమాప్తవాన్
భూలోకేఽవంతికాదేశే కళ్యాణాఖ్య పురేశుభే. ౨

తత్రాసీద్యజ్ఞ శర్మాఖ్యో విద్వాన్ కశ్చిద్ద్విజోత్తమః
తస్యపుత్రా స్సమ భవన్ చత్వారో నిగమాంతగాః ౩

సర్వ శాస్త్రార్థ తత్వజ్ఞాః కృతాగమ పరిశ్రమాః
చతుర్థపుత్రో యాత్రార్థం దేవశర్మా సముత్సుకః ౪

పితాదిభిరనుజ్ఞాతో వేదాధ్యయన తత్పరః
శ్రీమజ్జనార్దనం నామ క్షేత్రం ప్రథమ మాగతః ౕ

జనార్దనం రమానాథం ప్రణమ్య శిరసా ద్విజః
అనంతశయనం గత్వా నత్వాచాఽనంతశాయినమ్ ౬

కన్యాంకుమారికాం దేవీం మీనాక్షీం మధురాశ్రితామ్
తా మాది శక్తిం లోకానాం ప్రణమ్య విధివత్తతః ౭

శ్రీశైలాఖ్యం మహాక్షేత్రం సింహాద్రించ మహాబిలమ్
విరూపాక్షంచ గోకర్ణం అంతర్వేది మథాగమత్ ౮

త్రియంబకం మహాక్షేత్రం యత్రోత్పన్నాహి గౌతమీ
భీమశంకర మానమ్యస్థాణ్వీశం సోమ శేఖరమ్ ౯

కురుక్షేత్రం హరిద్వారం గత్వా రుద్ర మహాలయమ్
శివం దృష్ట్వాతు కేదారే గత్వా నత్వా మహేశ్వరమ్ ౧౦

ప్రసన్నాలక నందాంచ దృష్ట్వా దేవప్రయాగకమ్
వటప్రయాగాం కల్యాణీం దృష్ట్వా నత్వా వటేశ్వరమ్ ౧౧

వారణాసీం తతోగత్వా నత్వా విశ్వేశ్వరం ప్రభుమ్
స్నాత్వా కపిల ధారాయాం దృష్ట్వా వృషభ ధ్వజమ్ ౧౨

శంఖ కర్ణేశ్వరం దృష్ట్వా నీలాద్రౌ నీలమాధవమ్
దాక్షారామేశ్వరం భీమం సప్త గోదావరీం తథా ౧౩

దృష్ట్వా కోటేశ్వరం దేవం స్నాత్వా పాపవినాశనే
శోభనాచల వ్యాఘ్రేశం మంగళాద్రీశ మేవచ ౧౪

దృష్ట్వాతు బ్రహ్మసంవేద్యం రుద్రసంవేద్య మేవచ
తతో నాగేశ్వరం దేవం కదళీపుర మాశ్రితమ్ ౧౫

హంసద్వీపం తదాగత్య గోపాలం మోక్షదాయకమ్
కృష్ణాసాగర సంగేచ స్నాత్వా దేవం దదర్శహ ౧౬

తతో శ్రీకాకుళం గత్వా ప్రణమ్యాచాంధ్ర నాయకమ్
స్నాత్వాచ తత్ర తీర్థేషు ఏక రాత్రి ప్రసన్నకమ్ ౧౭

మల్లికేశం తతో దృష్ట్వా దుర్గాయాః క్షేత్ర మాగతః
స్నాత్వాతు కృష్ణవేణ్ణాయాం దృష్ట్వాతాం జగదంబికామ్ ౧౮

దుర్గా కుండం సమాశ్రిత్య తత్తీరే త్యుపవిష్టవాన్
తత్ర సంధ్యాం సమాసాద్య నిమీలాఽథ ద్విజః పరమ్ ౧౯

ధ్యాత్వా దుర్గాం మహాదేవీం మల్లేశ్వరమ నామయమ్
ఉన్మీల్య నయనేఽ పశ్యత్పిశాచ మతిభీషణమ్ ౨౦

సర్వాంగ వికృతం ఘోరం దగ్ధ పాదప సన్నిభమ్
హస్తేన వ్యాది శత్కస్త్వ మితి బ్రాహ్మణ పుంగవః ౨౧

పిశాచోఽహం పిశాచోఽహం పిశాచోఽహమితీరితమ్

పిశాచః॥

సర్వతీర్థాటనం కృత్వాపిశాచత్వేన పీడితః ౨౨

చరన్తవాంతికం గంతుమశక్త సన్నిహాస్థితః

బ్రాహ్మణః॥

కస్త్వం కేననిమిత్తేన పిశాచత్వముపాగతః ౨౩

కిమర్థమాగతోన్యద్యవద సర్వం యదీచ్ఛసి

పిశాచః ॥

లోకేస్మిన్నుత్కళే దేశే హ్యాఽస్తి శోణపురంమహత్ ౨౪

అగ్నిహోత్రీవేదరతః శిలావృత్త్యోప జీవనః
ధర్మాభట్ట ఇతిఖ్యాతో ద్విజోఽభూద్వేదపారగః ౨౫

కుశలో యజ్ఞ విద్యాయాం ప్రతిగ్రహపరాఙ్ముఖః
తస్య తృతీయ పుత్రోహం అంబా భట్టేతి విశ్రుతః ౨౬

రేణుకానామసాధ్వీచ మమభార్యా బభూవహ
ఏతాదృశకళత్రేణ బాలకైశ్చ ప్రపీడితః ౨౭

రార్థం భూపిరాజానం యాచితంగోద్వయంమయా
సతథేతి ప్రతిజ్ఞాయ తూష్ణీమామంత్ర్యమాంతదా ౨౮

చంద్రపాలాహ్వయశ్శ్రీమాన్ తద్దేశస్యపాలకః
ధేనుద్వయం సమానీయ దత్తవాన్మే ద్విజప్రియః ౨౯

నమేహస్తే జలందత్తం నాఽక్షతానకుశా అపి
న శివార్పిత మిత్యుక్తం తథాప్యేతత్సమాచరత్ 3౦

తదాఽశరీరిణీకాపి కృతావాగతినిష్ఠురా
త్వయా ప్రతిగృహీతం యదవైధం శృతిగర్హితమ్ 3౧

తత్ప్రతిగ్రహజన్యంతు పాపం భుంక్ష్వమహీసుర
బహువర్ష సహస్రాణి పిశాచోభవమాచిరమ్ 3౨

వ పస్య ఫః భోక్తారో నదారానచదారకాః
పతంత్యేవసదాఽధర్మ్య క్షుద్రకర్మ పరాయణాః 33

యదితేఽస్తి కృతేతాపః దుర్గాదేవీం సమాశ్రయ
తత్రాఽగత్య తపశ్శాలీ కశ్చిద్బ్రాహ్మణపుంగవః 3౪

తారయిష్యతి తత్రత్వాం గర్హితాయావిపత్తితః
తతః ప్రభృతి పైశాచం రూపంచాహమవాప్తవాన్ 3౫

కాలంక్షేపామివిమనా భవద్దర్శన కాంక్షయా
త్వామహంశరణం యాతః పైశాచాన్మోచయద్విజ ౩౬

ఇతిసంప్రార్థితస్తేన బ్రాహ్మణో బ్రహ్మవిత్తమః
పిశాచంతుసమానీయ స్నాపయేద్గాం గకుండకే ౩౭

తతోమంత్రించ గాయత్రీం దేవీపంచాక్షరీంతదా
ఓంకారం వ్యాహృతీస్త్రసః పునః ప్రణవమాదితః ౩౮

బ్రహ్మవిద్యాంచ గాయత్రీం పిశాచం సముపాదిశత్
బ్రహ్మవిద్యాంగృహీత్వాసౌ జప్త్వాచశ్రద్ధయాన్వితః ౩౯

ఏవంకృత్వా యథాశక్తిర్దేవీం పూజాంచకారసః
తత్వోపదేశ తోపాపం క్షాళయామాస భూసురః ౪౦

తతఃపిశాచ తాంత్యక్త్వా బ్రాహ్మణో దివ్యసుందరః
దివ్యమాలాంబరధరో దివ్యభూషణ భూషితః ౪౧

ఏవంతు ప్రార్థయామాస శివం పన్నగభూషణమ్
నమస్తే పార్వతీనాథ! నమస్తే విశ్వమంగళ ౪౨

నమః పరమకారుణ్య నమస్తే సురపూజిత!
అవిద్యాం దర్పణీకృత్య తేజసి ప్రతిబింబితాన్ ౪౩

జీవత్వ మీశ్వరో బింబో మల్లికేశ మహాప్రభో!
బ్రహ్మవిష్ణ్వీశరూపేణ సృజస్య వసిహంసిచ ౪౪

పరంబ్రహ్మ పరంధామ పరమో నిఃపదప్రవః
త్వమేవ శుద్ధచైతన్యం ద్వైతాంజన వివర్జితమ్ ౪౫

శుద్ధంబుద్ధం ప్రిముక్తంచ స్వరూపం తే మహేశ్వర
మాయయాఽపహృతజ్ఞానాః సజానంతి బుధా అపి ౪౬
బ్రిహ్మాదయస్సు రాస్సర్వే త్వన్మాయా పరమోహితాః
సర్వజ్ఞం మన్యమానాస్తె కించిజ్ఞా అపిశంకరమ్ ౪౭
తవరూపం నజానంతి కిం పునర్మాదృశాః ప్రిజాః
ఏవం బద్ధాంజలిర్భూత్వా దేవీం దుర్గాందదర్శహ ౪౮
వందేహం లోకకల్యాణి ! శివేసర్వార్థ సాధకే!
భక్తిగమ్యాహి భక్తానాం సర్వాభీష్టప్రిదాయిని ౪౯
త్వయిజాతం చ రుద్రాణి విశ్వం స్థావరజంగమమ్
త్వయిలీనం భవత్యంతే సర్వేశే సర్వమంగళే ౫౦
మిధ్యాభూతం జగత్సర్వం త్వదజ్ఞాన విజృంభితమ్
భవతీం జానతాందేవి నశోకోనచ విస్మృతిః ౫౧
బ్రిహ్మాదయోన జానంతి జానంతోపి మహేశ్వరి
పశ్యన్తోపి నపశ్యంతి ధృతివిజ్ఞాన వర్జితాః ౫౨
ఇతిస్తుత్వా చ తాం దేవీం ప్రిణమ్య చ పునః పునః
స్తూయమానః కిన్నరైశ్చైర్మణికంకణ భూషితః ౫౩
వ్యోమయానంచ సోఽపశ్యన్నత్వా బ్రిహ్మణపుంగవమ్
ఆజ్ఞాం లబ్ధ్వాచ నంతుష్ట శ్శివలోకం జగామసః ౫౪
తత్సర్వం దృష్టవాన్విప్రిస్తత్రి వక్షేత్రి సత్తమె
యాపయిత్వాఽయుష శ్శేషమంతే శివపురంయయౌ॥ ౫౫

ఇతి పద్మపురాణే పూర్వఖండే దుర్గామాహాత్మ్య కథనం
నామపంచ పంచాశస్సర్గ స్సమాప్తః

## శ్రీ కనకదుర్గాదేవి ధ్యానశ్లోకములు

పంకేజాతాయతాక్షీం పురమథనసఖీం పంకజారాతివక్త్రామ్
సంకాశ ద్దేవ ఛంద ప్రమథమణి గణోల్లా సితా కల్పకంఠీమ్
సంశుద్ధామోద కాశ్మీరజ మృగమదయుక్చందనా లిప్తగండామ్
దుర్గాంబాం భావయేహం శిశుపశువనితావృద్ధయే సద్ధనాయాః

పంకేజాతాయతాక్షీం - పద్మములవలె విశాలము లైన కన్నులు కలిగి యున్నటువంటిన్నీ; పంకజారాతివక్త్రాం - పున్నమనాటి చంద్రునితో సమానమైన ముఖము కలిగినటు వంటిన్నీ, సంకాశద్దేవఛంద ప్రమథమణిగణోల్లాసితా కల్ప కంఠీం - ప్రకాశమానమైన, దేవతలు, ఛందస్సులు ప్రమథ గణములనే మణులుగా కల్పింపఁబడిన కంఠహారముచేత ప్రకా శించుచున్నటువంటిన్నీ; సంశుద్ధామోద కాశ్మీరజ మృగమద యుక్చందనాలిప్తగండాం - మిక్కిలి పరిమళముతో కూడు కొనిన కుంకుమపువ్వు, కస్తూరి కల్సిన దివ్యశ్రీ చందనమును పూసిన చెక్కిళ్ళు కలిగినటువంటిన్నీ, పురమథన సఖీం - త్రిపు రములను గెల్చిన యీశ్వరుని కిల్లాలైన, దుర్గాంబాం - శ్రీ కనకదుర్గాదేవిని, శిశు, పశు, వనిత, సద్ధనము వీటిని లోకము నకు ప్రసాదించుట (అభివృద్ధిచేయుట) కొరకు నేను ప్రార్థించు చున్నాను.

శ్రీ శంకర భగవత్పాదులు.

మేఘాంగీం శశిశేఖరాం త్రినయనాం రక్తాంశుకాం బిభ్రతీమ్
పాణిభ్యా మభయం వరం చవికస ద్రక్తారవింద స్థితామ్
నృత్యంతీం పురతో నిపీయ మధురం మాధ్వీక మద్యం మహా
కాలం వీక్ష్య వికాసితానన వరామాద్యాం భజే కాళికామ్॥

మేఘాంగీం - నీలమేఘచ్ఛాయ వంటి శరీర కాంతి కలిగినటువంటిస్నీ, శశిశేఖరాం - మౌళియందు అర్ధచంద్రుని (చంద్రరేఖను) ధరించినటువంటిస్నీ, త్రినయనాం - సూర్య, చంద్ర, అగ్నులే మూడు నేత్రములుగా కలిగియున్నటు వంటిస్నీ, రక్తాంశుకాం - ఎర్రనైన వస్త్రములను ధరించి యున్నటువంటిస్నీ, పాణిభ్యా మభయం చ వికస ద్రక్తార వింద స్థితామ్ - అభయ, వరద, విజ్ఞాన ముద్రలు గల హస్త ములున్నూ వికసించిన యెర్ర తామర పుష్పమును చేత ధరించియున్నటువంటిస్నీ, మధురం - తియ్యనైన, మాధ్వీక మద్యం - తియ్య ద్రాక్షపండ్ల రసమును, నిపీయ - సేవించి, పురతః - ముందు, నృత్యంతీం - నృత్యముచేయుచున్నటు వంటిస్నీ, కాలం వీక్ష్య - విశ్వమును హరించు కాలస్వరూప మును చూచి, వికసితానన వరాం - చిరునవ్వు నవ్వుచున్న సుందరమైన ముఖారవిందముతో కూడుకొనియున్నటువం టిస్నీ, ఆద్యాం - సకల బ్రహ్మాండ సృష్టికి కారణభూతు రాలై (ఉపాదాన కారణమైన ప్రకృతి స్వరూపిణియై) నటు వంటిస్నీ, కాళికాం - కాళికాదేవిని, భజే - సేవించు చున్నాను.

కాళిదాస మహాకవి.

## శ్రీ విద్యారణ్యస్వామికృత రత్నస్తబకము

**అరుణోపల తాటంకా మరుణోదయ రాగదేహ శోభాఢ్యా**
**మతిసుకుమారీమరుణాం దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే ॥౧**

అరుణోపల తాటంకాం - ఎర్ర కలువలు (కర్ణావతంసముల) కాంతితో కూడిన చెవుల కమ్మలు కలిగినటువంటిన్నీ, అరుణోదయరాగదేహ శోభాఢ్యాం - ఉదయించుచున్న సూర్యునితో సమానమైన యెర్రని దేహకాంతి కలిగినటువంటిన్నీ, అతి సుకుమారీం - అత్యంతము లావణ్యముతో కూడుకొన్నటువంటిన్నీ, అరుణాం - ఎర్రని రూపము కలిగినటువంటిన్నీ, దుర్గాం దేవీం - శ్రీ కనకదుర్గాదేవిని, అహం - నేను, శరణం ప్రపద్యే - శరణ్యమును పొందుచున్నాను.

**ఇందీవరదళ నయనా మింద్రాద్రేర్హృదయమధ్య పీఠస్థామ్**
**ఇంద్వర్ధశేఖరాం తాం దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే ॥౨**

ఇందీవర దళ నయనాం - నల్ల తామర రేకులవంటి నేత్రములు కలిగినటువంటిన్నీ, యింద్రాద్రేర్హృదయమధ్య పీఠస్థాం - యింద్రకీలగిరి హృదయపీఠమునం దధివసించి యున్నటువంటిన్నీ, ఇంద్వర్ధశేఖరాం - అర్ధ చంద్రుని శిరమున ధరించియున్నటువంటిన్నీ, తాం దుర్గాం దేవీం - ఆ కనకదుర్గాదేవిని శరణుపొందుచున్నాను.

మహిషాసురసంహర్త్రీం మాహేశ్వరనిత్యసౌఖ్య సందాత్రీమ్
ద్విజసంస్తుతగాయత్రీం దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే ౹ 3

మహిషాసుర సంహర్త్రీం - మహిషాసురుని సంహరించినటువంటిన్నీ, మహేశ్వరనిత్యసౌఖ్య సందాత్రీం - పరమ శివునికి నిత్యము సౌఖ్యములను ప్రసాదించి చేకూర్చుచున్నటువంటిన్నీ; ద్విజసంస్తుత గాయత్రీం - భూసురులచే గాయత్రి రూపముగా స్తోత్రము చేయబడుచున్నటువంటిన్నీ, శ్రీ దుర్గాదేవిని శరణ్యమును పొందుచున్నాను.

శంకరభగవత్పాదైః స్సంస్కృతదృష్ట్యాది సాధనైః శాంతామ్
సర్వైరపిసం సేవ్యాం దుర్గాం దేవీం శరణమహంప్రపద్యే ॥ ౪

శంకరభగవత్పాదైః - శ్రీ శంకరాచార్యులవారిచేత, సంస్కృత దృష్ట్యాది సాధనైః శాంతాం - సంస్కరింపబడిన దృష్టిసాధనము వలన శాంతమూర్తియైనటువంటిన్నీ, సర్వైరపి సంసేవ్యాం - (అందువలన) అందరిచేతను సేవింపబడుచున్నటువంటి శ్రీ కనకదుర్గాదేవిని శరణు పొందుచున్నాను.

మాధవనుత ఘనచరితాం మాన్త్రికవర్యైక దృష్టమహిమాం
తామ్
మల్లేశ్వరపరమహిషీం దుర్గాం దేవీం శరణమహంప్రపద్యే ॥ ౫

మాధవనుతఘన చరితాం - మాధవవర్మ మహారాజు చేత స్తోత్రము చేయబడిన చరిత్రము కలదానవున్నూ,

మాన్త్రికవర్యైకదృష్ట మహిమాం - నిన్నుపాసించువారలకే మహిమలు చూపించుచున్నదానవన్నా, తాం మల్లేశ్వరపర మహిషీం - మల్లేశ్వరునికి పట్టపుదేవేరియైన ఆ దుర్గాదేవిని శరణుపొందుచున్నాను.

తూర్కాది భూపవర్యైస్సంసేవిత పాదపద్మయుగళాం తామ్
హేమాఖ్యాం శ్రీవిద్యాం దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే ॥౬

తూర్కాది భూపవర్యైః - తురకలు మున్నగు మ్లేచ్ఛ ప్రభువులచేతకూడ; సంసేవిత పాదపద్మయుగళాం - మ్రొక్క బడిన చరణసరోజములు కలిగినటువంటిన్నీ, హేమాఖ్యాం - బంగారుపేరు అనగా "కనక" అను విశేషణముతో కూడు కొన్న పేరు కలిగినటువంటిన్నీ, శ్రీ విద్యాం - శ్రీ విద్యకు మూలకారణమైనటువంటిన్నీ దుర్గాదేవిని శరణు పొందు చున్నాను.

శ్రీ చక్రరాజ నిలయాం శ్రీ విద్యా పారగైస్సదా సేవ్యామ్
లలితైర్గీతైర్వినుతాం దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే ॥౭

శ్రీచక్రరాజనిలయాం - శ్రీ (మేరు) చక్రరాజము వకు స్థానమైనటువంటిన్నీ, శ్రీవిద్యాపారగైస్సదాసేవ్యాం - శ్రీవిద్యోపాసకులచేత యెల్లప్పుడు సేవించబడుచున్నటువం టిన్నీ, లలితైర్గీతైః - మంగళకరములైన గేయములచేత, వినుతాం - స్తోత్రముచేయబడుచున్నటువంటి కనకదుర్గా దేవిని శరణుపొందుచున్నాను.

దురితానామపహన్త్రీం దుర్విషయాదీన్ సుఖేన శమయన్తీమ్
దుర్గమపీఠాధ్యక్షాం దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే ॥౮

దురితానామపహన్త్రీం-సమస్త పాపములను పోగొట్ట జాలినట్టియు, దుర్విషయాదీన్ సుఖేన శమయన్తీం - సమస్త చెడువిషయములను సుఖముగా హరింపజాలినట్టియు, దుర్గమ పీఠాధ్యక్షాం - అష్టాదశ శక్తిపీఠములలో నొకటైన పీఠమున కధ్యక్షురాలైనట్టియు, శ్రీ కనకదుర్గాదేవిని శరణుపొందు చున్నాను.

పరశివపర్యంకస్థాం పటుతర విజ్ఞాన ముద్రిత కరాబ్జామ్
పరసుఖ వితరణదక్షాం దుర్గాం దేవీం శరణమహంప్రపద్యే॥౯

పరశివ పర్యంకస్థాం - పరమశివుని యంకభాగమున నుపవిష్టురాలైనటువంటియు, పటుతరవిజ్ఞానముద్రితకరాబ్జాం- పటుత్వమైన విజ్ఞానముద్రాయుక్తమైన హస్తపద్మములుకలిగి యున్నట్టియు, పరసుఖవితరణదక్షాం - పరలోక సుఖమును (స్వర్గాది అపవర్గములను) యిచ్చుటలో సమర్థురాలైనటు వంటియు శ్రీ కనకదుర్గాదేవిని శరణ్యము పొందుచున్నాను.

సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక

తొలిపలుకులో

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 8 | వివియే | లివియో |
| 7 | 4 | భృంగ్యాది | భృగ్వాది |
| | 16 | నటరాజ | బృహదీశ్వర |
| | 17 | పూరి | పురి |
| ,, | 21 | చిదంబరము | (కనకసభ) |
| 8 | 5 | యాదవాద్రి | (వేదాద్రి) |
| ,, | 6 | కోటప్పకొండ | |
| 9 | 15 | Radeo | Radio |
| 10 | 7 | నిశ్చలత | నిగ్రహము |
| 10 | 8 | మార్గసుని | మార్గమని |
| 13 | 21 | రాజరాజనరేంద్ర | నరేంద్రమృగరాజ ( 2 వ విజయాదిత్య ) |
| ,, | 24 | తరువాత "ర్యాలీ మోహిని కేశవస్వామి పాదాంగుష్ఠము నుండి గంగ ప్రవహించుచుండును' అనివుండవలెను. | |

గ్రంథములో

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 9 | సత్య | సత్వ |
| ,, | 14 | జన్ము | జన్మ |
| ,, | 17 | అదో | అథో |
| ,, | 19 | యూగ్ధ | యూర్థ్వ |
| 3 | 1 | స్వర్గము | సత్యలోకము |
| 3 | 15 | సింధుతైన | సింధువైన |
| 4 | 16 | ఆదరించు | ఆచరించు |
| 5 | 6 | భయావహాః | భయాపహాః |
| 9 | 7 | కత్రాకృష్ణై | కర్తాకృష్ణై |
| 10 | 22 | ఘట్టముల | ఘట్టములు |
| 12 | 16 | యనర్ధ | యనర్థ |
| 13 | 3 | యుదతము | యుదంతము |
| ,, | 10 | మల్లిఖా | మల్లికా |
| 16 | 7 | పరాక్రమే | పరాక్రమమే |
| ,, | 13 | నంత | అంత |
| 20 | 5 | తుష్టీవు | తుష్టువు |
| ,, | 20 | విభించి | విధించి |
| 21 | 18 | స్తాయకర్యా | సాయకాన్ |
| ,, | 19 | దథతీన్ | దధతీమ్ |
| 22 | 12 | నియూ | నియు |
| ,, | 13 | తలచియునీమె | తలచియూమె |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 23 | 5 | బ్రహ్మె | బ్రహ్మీ |
| ,, | 20 | బఘా | బభా |
| ,, | ,, | శ్మివః | శ్శివః |
| 24 | 1 | శివ. | శివః |
| 25 | 2 | బొనరించు | బొనరించి |
| ,, | 17 | స్త్రీశ్వరి | స్త్రైశ్వరి |
| 27 | 15 | మొగల్ రాజ | (మాద్దల్య) |
| 28 | 5 | ప్రతాప | ముక్కంటి |
| ,, | 6 | ,, | ,, |
| 32 | 9 | మగ్ధని | మగ్దని |
| 33 | 11 | దేవి | దేవుని |
| 35 | 6 | శులబా | శుంభా |
| 38 | 4 | చెల్లి | లెల్లి |
| 37 | 11 | షువి | విష్ణు |
| ,, | 24 | విడిసఛో | లిడిసచో |
| 38 | 5 | ధవము | కధనము |
| ,, | 16 | పాని | గాని |
| 40 | 24 | హంసలద్వీప | హంసద్వీప |
| 42 | 12 | శించు | శించి |
| 43 | 1 | ద్భహా | ద్భవా |
| 45 | 19 | పుష్టించుచు | పుష్పించుచు |
| 47 | 10 | చెప్పుటయే | చెప్పు |
| ,, | 15 | చెప్ప | చెప్పు |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 47 | 19 | బోయిన | బోలిన |
| 50 | 21 | సౌందదర్య | సౌందర్య |
| 54 | 7 | వాడ | వాఁడు |
| 56 | 6 | రక్షించిట | రక్షించుట |
| 58 | 12 | గాలించికొనగా | గావించినఁగాని |
| 60 | 2 | నేను వెళ్ళి విచారించగా | (Omit) |
| ,, | 4 | చెప్పినాడు | చెప్పినాడట |
| ,, | 6 | బడినది | నదని జనశ్రుతి |
| 60 | 21 | భక్తక | భక్తుఁడొక |
| 65 | 4 | 200 | 2000 |
| ,, | 6 | — | 1500 |
| ,, | 8 | శ్రేష్టిలు | శ్రేష్టులు |
| ,, | 14 | శ్రీద్దాళువు | శ్రద్ధాళువు |
| 68 | 20 | ఆర్చ | అర్చ |
| 69 | 8 | Inda | Indra |
| 70 | 5 | మాసాథ్య | మాసాద్య |
| 72 | 3 | హృతరింపు | హృతరిపు |
| ,, | ,, | వీరశ్రియా | వీరశ్రియా |
| ,, | ,, | సల | సల |
| 77 | 12 | ఇవా | ఇహా |
| 79 | 5 | శేశవ | కేశవ |
| ,, | 10 | ధమడు | ధర్మ |
| 88 | 4 | ణాట్టుకు | భట్టుకు |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ,, | 6 | భట్టుదకు | భట్టారకుడు |
| 89 | 10 | విజయాధిత్యుఁడు | విజయాదిత్యుఁ |
| ,, | 12 | బేట | బేత |
| ,, | 14 | గణగ | గుణగ |
| 95 | 4 | Awgwst | August |
| 96 | 1 | 'ndicote | indicate |
| 100 | 5 | సువర్ణ | సురానే |
| 102 | 5 | సేపేచ | స్వేపేచ |
| ,, | 8 | శంఖతీరం | శంఖతీర్థం |
| ,, | 18 | పూర్వాద్యశా | పూర్వాన్యశా |
| 103 | 11 | సమవోచయః | తుతఃశో ఽబ్రువన్ |
| 103 | 16 | పర్యంతం | పర్వతం |
| ,, | 20 | పూనరా | పునరా |
| ,, | 20 | యయం | యంయం |
| 104 | 11 | చతుర్భుజ | చతుర్భుజ |
| 105 | 8 | వణనం | వర్ణనం |
| 107 | 9 | కృష్ణైన | కృష్ణస్య |
| 108 | 15 | పిత్ర | తత్రి |
| ,, | 16 | తత్రూణాం | పిత్రూణాం |
| ,, | 19 | ఉగగ్వహః | ఉదగ్వహః |
| ,, | ,, | లోకేఘ | లోకేషు |
| ,, | 20 | గీయెతే | గీయతే |
| 109 | 8 | వాసిషం | వాసిష్ఠం |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ,, | 17 | స్త్రపుం | స్త్రప్త్రం |
| 110 | 1 | ర్భధాః | ర్బధాః |
| ,, | 2 | కృషా | కృష్ణా |
| ,, | 6 | యంత్ర | యత్ర |
| ,, | 8 | సిర్ది ర్పవే | సిద్ధిర్భవే |
| ,, | 10 | స్క—దేన | స్క—ందేన |
| ,, | 18 | ముసిమ్ | మునిమ్ |
| 112 | 7 | ప్రణవాత్మక | ప్రణవాంకుర |
| ,, | 12 | త్బశా | ఏతాశ్చా |



